# వీరమతి

పది యంకముల నాటకము

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారిచే
రచియింపఁబడినది.

రెండవ కూర్పు 500

ప్రకాశకులు :
కురుకూరి సుబ్బారావు అండ్ సన్స్
ప్రొప్రయిటర్సు : సరస్వతీ బుక్కు డిపో, బెజవాడ (కృష్ణాజిల్లా)

తెనాలి లక్ష్మీ పవర్ ప్రెస్ నందు ముద్రింపఁబడియె.

 1943 [వెల రు 1-4-0

# ఇందలి పాత్రములు

## పురుషులు

ఉదయాదిత్యుఁడు — ధారానగర రాజు

జగద్దేవుఁడు — ఉదయాదిత్యుని ప్రథమ భార్యకుఁ బుత్త్రుఁడు

గంధవహుఁడు — ఉదయాదిత్యుని ద్వితీయ భార్యకుఁ బుత్త్రుఁడు

శీగాగాడుసింగు — ఉదయాదిత్యుని మంత్రి

శివప్రసాదుఁడు, రామసింగు } జగద్దేవుని జంపుటకు మంత్రిపంపిన భటులు

దుంగరసీ — పట్టనాస్థాన దండనాథుఁడు

లాలాదాసుఁడు — దుంగరసీ కొడుకు

జయసింగు — పట్టనాస్థాన ప్రభుఁడు

లక్ష్మణరావు, రంగారావు } పట్టణమండలి పౌరులు

పూజారి — తారికాదేవిని బూజించువాడు

మరి యిద్దరు సేవకులు, ఇద్దఱు ద్వార రక్షకులు.

## స్త్రీలు

భవాని — ఉదయాదిత్యుని ప్రథమభార్య

పార్వతి — ఉదయాదిత్యుని రెండవభార్య

కుశల — పార్వతి దాసి

లలిత — పార్వతి దాసి

వీరమతి — జగద్దేవుని భార్య

జంబుకి — తార్పుడుకత్తె

జాంబవతి — వేశ్య

కమలాదేవి — పట్టణప్రభుఁడగు జయసింహుని భార్య

ఇద్దరు బాలికలు — మంగళపుటారతినిచ్చువారు మొదలగువారు.

శ్రీరామ

# వీరమతి

## నాంది

ఉ. శ్రీ వసుధానురాగములఁ ♦ జిక్కక స్వీయవిశుద్ధవీరధీ
భావుక శక్తియుక్తిని బ్ర ♦ పంచమునందు నికృష్టజంబుకీ
భావకృతప్రశారణ వి ♦ పద్రహితుండయి మించు నాజగ
ద్దేవుని కీర్తిచంద్రికలు ♦ దిక్కులఁబర్వి ముదంబుఁగూర్చుతన్.

(నాంద్యంతమందు సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూ—నటీ!—నటీ!—నటీ!!

(నటి ప్రవేశించును.)

సూ—పలుకులతోడనే ప్రతిధ్వనివలె వెంటనే వచ్చెడుదానవు. ఇపు డింత యాలస్యము చేసితివేల?

నటి—ఆలస్యహేతు వావల మనవిచేసెదను. నన్నుఁబిలుచుటకుఁ గారణమేమో మొదట సెలవిండు.

సూ—అధునిక కవిశిఖామణియగు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు శ్రీ శ్రీ పీఠికాపురమహారాజదంపతుల ప్రథమపుత్త్రికారత్నమగు శ్రీ శ్రీ మంగమాంబాదేవి జన్మదివసమహోత్సవ సమయమునఁ బ్రదర్శింపఁబడుటకై రచించిన "వీరమతి" యను పదియేడవనాటకము ప్రదర్శింపఁగాఁ జూచుటకీ పరిషన్మహాజను లతికుతూహలులై యున్నారు. సర్వము సిద్ధముచేసి యుంచితివిగదా!

నటి—ఉంచితినిగాని పదునాఱవనాటకము బయలువెడలినపిదప నిది వెలువడుట కింత యాలస్య మేలయయినది?

సూ—కవి యీ నడుమ స్నేహితులతో దేశసంచారము చేయుచుఁ గార్యాంతరమునఁ బడియున్నాఁడు. అదియే యాలస్యకారణము.

నటి—ఆయన పీఠపురములోనే పీఠము వేసికొని యున్నట్లున్నదే.

సూ—ఓసి వెఱ్ఱిదానా! కవి దేశసంచారమునకుఁ గాలు గదల్పనక్కఱలేదు. అది భావనాపర్యటనముచే నిర్వర్తింపఁబడుపని.

గీ. కన్నొకఁడుమూయుఁ దెలిచునొ ♦ క్కండు, కాని
కలనుగనువాఁడు గవియు నొ ♦ క్కగతివారె,
యున్నచోటను బడియుండు ♦ నొడలుగాని
పఱగడలుద్రొక్కుచుండు బ్రది ♦ మ్మరిమనంబు.

ఇంకొకవిశేషమున్నది చూడుఁ.

గీ. ఆత్మ యంతరంగచతుష్ట ♦ యమును బనులు
సలుపఁ బురికొల్పి తాఁ దట ♦ స్థతను దాల్చు
నట్లు స్వాంతరంగచతుష్ట ♦ యమును బనిచి
సాక్షియై కవి తనపని ♦ జరుపుకొనియె

నటి—ఓహో! సర్వాంధ్రలోకవిదితములైన సాక్షిగ్రంథములఁగూర్చియా మీరు సెల విచ్చుచున్నారు?

సూ—ఔను. ఇఁక నీయాలస్యముమాట యేమిచెప్పెదవు?

నటి—ఎట్లుచెప్పుటకుఁ దోఁచుటలేదు పాత్రవర్గముమీఁదఁ గోపపడకున్నఁ జెప్పెదను.

సూ—ఓపినంత యుపకారము చేయవలయు. మిత్రులపైఁ గోపమేల? చెప్పుము.

నటి—చిత్తము. నాటకము రసవత్తమమై యుండుటచేత మనవారు తమతమ పాత్ర భాగములు పఠించుటయేకాక నాటక మామూలాగ్రముగాఁ జదివినారు.

సూ—ప్రదర్శనకళాకౌశలసూచకమైన యాపని కోపజనక మెట్లు కాఁ గలదు? కాల యాపనము గావింపక చెప్పదలఁచుకొన్న దేదో తటుకునఁ జెప్పుము.

నటి—దానివలన నొక చిక్కు తటస్థించినది. నేనే వీరమతివేషము వేసెదనని స్త్రీపాత్రములును నేనే జగద్దేవవేషము వేసెదనని పురుషభూమికాధారులును బంతాలాడ జొచ్చినారు ఉదయాదిత్యునిపాప మెట్టిదో కాని యతనివేషమెుకఁడును వేయ నన్నాఁడు ఆయల్లరులన్నియు నడఁచి సవరించునప్పటికి నా తలప్రాణము తోఁకకు వచ్చినది అదియే నాయాలస్యమునకుఁ గారణము.

సూ—వారి గుణగ్రహణశక్తి స్తవనీయమేకాని రసగ్రహణపాటవము మాత్ర మంత మెచ్చుకొనఁదగినదికాదు. సదసత్సమ్మేళనమే సగ్గవైచిత్ర్యమూలమైనట్లు శిష్టదుష్టపాత్రసమ్మిశ్రితమైన నాటకమే మనోహరమై దర్శనీయమై యుండును. ఒక్క బ్రహ్మానందమే నిరపేక్షకముగాని తక్కు ప్రపంచానందము లన్నియు నాపేక్షకములే.

సీ. కృష్ణపక్షముచేత ♦ నే శుక్లపక్షంబు। నరులకుఁ జక్షురా ♦ నందమిచ్చు
నుమ్మచేఁ బ్రాణమ్ము ♦ లుమ్మలించినఁగాని। వలితెమ్మెరలు హాయిఁ ♦ జిలుకలేవు
క్షారాదిరసములు ♦ చవిఁగొన్ననేకాని । తీపి నాలుకకెక్కి ♦ తృప్తినిడదు
పగలెల్లఁబనిచేయు ♦ వానికే లభ్యమౌ । రాత్రి విశ్రాంతి ని ♦ ద్రాసుఖంబు

గీ. సుగుణవంతుఁడు శోభిల్లు ♦ నగుణిసరసఁ। గాన సజ్జనవిఖ్యాతి ♦ కారణంబు
నిత్యపార్శ్వస్థ దుర్జన ♦ నిచయ మింతి। సృష్టియందును గవిరాజు సృష్టియందు.

లలితాజాంబవతీత్యాది పావన స్త్రీ వ్యక్తులును నుదయాదిత్యాది పరమతామస వ్యక్తులును హేయములైన నగుఁగాక! వీరమతి జగద్దేవుల ద్విగుణీకృతకీర్తులఁ జేసిన వాపాత్రములే.

నటి—చేసినఁ జేయవచ్చును గాని కవి యా వీరమతిజగద్దేవుల శౌర్య గాంభీర్య వైరాగ్యసౌశీల్యములు మిక్కిలి చక్కఁగాఁ జిత్రించినాఁడు.

సూ—నటీ ! నీవు నిజమే యాడితివి.

గీ వారిపలుకులు వర్తన ♦ ల్పరమపావ | నంబు లిందలి యష్టమాం ♦ కంబు గీత
యందు నాఱవయధ్యాయ ♦ మట్లు వెలసి|భోగవై ముఖ్యమును ద్యాగ♦బుద్ధిఁగఱపు.

ఆ పార్వతీపరమేశ్వరుల చారిత్రము ప్రదర్శించుటచే మనము ధన్యులమగుదుము.

నటి—అదిగో. పరిచారికయగు కుశలతోఁ బార్వతి రంగమునకు రానున్నది. మనమిఁకఁ బోవుదము. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

శ్రీరామ

# వీరమతి

## ప్రథమాంకము

ప్రదేశము :—ధారానగరములోని రాణియంతఃపురము

ప్రవేశము—రెండవరాణి పార్వతి, దాసి కుశల.

పార్వ—కుశలా ! అతనికే పట్టాభిషేకమగునని యాతని నమ్మకమా ?

కుశ—మీసవతికొడుకగు జగద్దేవున కట్టినమ్మకమున్నదని చెప్పలేదమ్మా. ప్రజ లాతని యందు బద్ధానురాగులై యున్నారు. ఆతని సౌజన్యము ప్రయోజకత్వమునట్టివి.

పార్వ—అటులైన నాకొడుకు కప్రయోజకుఁడని నీయభిప్రాయము కాఁబోలు ?

కుశ—తల్లీ పార్వతీ ! నాయభిప్రాయముతోఁ బని యేమున్నదమ్మా ?

పార్వ—ఆలాగా ! ఒక్క నీయభిప్రాయముతోఁ బనిలేదేమి? మా రాజ్యములోని ప్రజ యందఱి యభిప్రాయ మదియే కాఁబోలు నేమి ?

కుశ—మీ కొడుకునెడల జనాభిప్రాయ మెట్లున్నదో నే నెఱుఁగను గాని మీ సవతి కొడుకు నెడల జనులు మహాభిమానులై యున్నారు.

పార్వ—ప్రజల యనురాగమున కెక్కడకు? విరాగమున కెక్కడకు? అది యొక గాలి పాటు గంగవెఱ్ఱిపోటు. ఉద్రేకమేకాని యౌచిత్యము వారికేది ? ఈ దినమున వీరావేశము—రేపు తోఁకముడుపు—ఈ దినమునఁ గౌఁగిలింత—రేపు చెంపపెట్టు—ఈ వేళ నమస్కారము—రేపు తిరస్కారము—ప్రొద్దున నాహాహా! మధ్యాహ్నమున హేహేహే! సాయంకాలమున ఛీ ఛీ ఛీ! ఇంతేకాదా ప్రజాభావ వైఖరీసౌభాగ్యము. అందులకు నేను విచారింపను గాని భగవంతుఁ డాతని పక్షమున నున్నట్లు కనఁబడుచున్నది. అందులకు విచారించుచున్నాను.

కుశ—అమ్మా ! భగవంతుఁ డొకనిపక్షమేమమ్మా ? భగవంతుఁడు మనకార్యములకుఁ దోడుపడువాఁడుకాఁడు. అడ్డుకొనువాఁడును గాఁడు. మీకుఁ గ్రొత్తరాజ్యములు రాకుండ నడ్డుకొనువాఁడు కాఁడు మాకుఁ గ్రొత్త మగలను సంధానము చేయుటయందుఁ దోడుపడువాఁడును గాఁడు. మనకార్యములు మనబుద్ధినిబట్టియుఁ బ్రయత్నబలమునుబట్టియు నుండును. క్రిందటిసారి మీ సవతి కొడుకునకు విసము పెట్టినప్పుడు (ఇటునటు చూచి) ఎవరులేరుకద ! మన భటుఁడే బుద్ధిలేక యావిసమును ద్రాగుటచేత జచ్చినాఁడు. అంతేకాని దేవున కిందున సంబంధ మేమున్నది ! దేవుఁ డేమి యాతనిగొంతుకలోఁ బోసెనా ? మనము చేయఁ దగినంత ప్రయత్నము చేయక పోయినప్పుడు—

పార్వ—వెనుకటిలోపము లిప్పుడు తడవుకొనుట యెందులకే?

కుశ—ఇఁకముందట్టిలోపములు రాకుండుటకు.

పా—నాకుఁ గార్యముకావలయునన్న యుద్రేకముచేతఁ బ్రయత్నలోపమును దెలిసికొనుశక్తి లేకపోవచ్చును. చతురంగఖేలనమున నాటగానికంటెఁ బైవానికి మంచియెత్తు స్ఫురించునట్లు నీకు నాకంటె మంచి యుపాయము తోఁప వచ్చును. ఇప్పుడేమి చేయుమని నీ యభిప్రాయము?

కుశ—నా యభిప్రాయము జోలి మీ కెందులకు? ఏది యెట్లు గానైనయెడల మీ పీడ వదలునో యది స్పష్టముగాఁ జెప్పుఁడు.

పా—ఇప్పుడు తిరుగ నేలచెప్పవలయును? నా సవతికొడుకగు జగద్దేవుఁడు నా సవతి యగు భవానితో నాతని నూతనవధువగు వీరమతితోఁ బరాభవింపఁబడి రాజ్యమునుండి వెడలఁగొట్టింపఁబడవలయును అప్పుడు నా మనస్సు సుఖముగా నుండును.

కుశ—అప్పుడైన మీ మనస్సు సుఖముగా నుండునా? మందమతియో మేధారహితుఁడో కాక కొంపవెఱ్ఱివాఁడో యేమియుఁ దెలియఁదగని వ్యక్తియైన నీ కొడుకగు రణధవళుఁడు రాజ్యార్హుఁడగునా? బాబు బాబని బుద్ధిచేతఁ బర్వతమనియు శౌర్యమున బృహస్పతి యనియు గతిలేనికవులు—

పా—అదేమే? బుద్ధిచేత బృహస్పతియనియు, శౌర్యమునఁ బర్వతమనియుఁ గాఁబోలునే.

కుశ—అదియేకాఁబోలు-ఇంక—రూపమున నెవఁడో నమ్మా—ఆ! రూపమున మార్కండేయుఁ డనియు.

పా—మార్కండేయుఁడేమిటే నీమొగము—మన్మథుఁడు.

కుశ—అమ్మా! ఎవఁడో యొకఁడు. కవిత్వము చెప్పినవాఁడుమాత్రము మన్మథునిచూచి యేడ్చినాఁడా యేమి? వీవో చిట్టకట్టుపలుకులు—చిలుకకొట్టునుడువులు—రొట్టకొట్టుక్రింద జనపనారపచ్చడిక్రిందఁ గొట్టుకొని వచ్చుచున్నవాఁడే కాని యంతకంటె నేమైన నున్నదా? ధనమే గుణమనియెంచెడు నీవీ నిర్భాగ్యులు—గాయకుఁడెవఁడో గాడిదయేదో తెలియని మన భర్తృదారకునిమీఁదఁ బ్రబంధములా? ఇతని తెలివితక్కువకే కవిస్తోత్రములే కొంతకారణము ముక్కునేల పెట్టి రాచినఁగాని గోడికిఁ బౌరుషమెక్కునా? గడ్డిగంపఁజూపి యాకర్షించిన గుఱ్ఱము పందెము గెలుచునా! జోలపాడినకొలఁది బాలునకు నిద్ర. నాగస్వరము వాయించిన కొలఁది పామునకు మత్తు. స్తోత్రపాఠము లొనర్చినకొలఁది రాజునకు మందమతి.

పా—కుశలా! నీ వెఱ్ఱికాని రాజ్యముచేయుట కేమంత తెలివికావలయునే? మొదలు రాజులకుఁ దెలివితోఁ బనియేమున్నది? శాస్త్రవాదములు చేయవలయునా? గ్రంథములువ్రాయవలయునా? వచ్చిన నాల్గుకోటులు తోఁచినంతమట్టునకుఁ

గర్చుపెట్టుకొనుటకుఁ దెలివియెందులకు? మన యిష్టమువచ్చినవారికిఁ బెట్టుకొందుము కానివారిని గొట్టెదము ఈమాత్రపుఁ బనికిఁ బ్రధాను లెందులకు? కోశాధిపతు లెందులకు? లెక్క లెందులకు? డొక్క లెందులకు? అయిన కర్చులపరీక్షయు నంచనాకర్చులయేర్పాటును జేసికొన్న యాస్థానములు వృద్ధి పొందవు. లెక్కతో రాజమర్యాద నశించిపోవును. దర్బారునకుఁ గోమటి దుకాణమునకు నేమైన భేదముండవలయునా? ఇంతకు నక్షరజ్ఞానమునకు రాజ వ్యవహారమునకు సంబంధములేదు పూర్వరాజుల తెలివితేటలమాట నే నెఱుఁగను గాని యిప్పటిరాజులలోఁ దెలివితేటలున్నవా రెందఱున్నారో నే నెఱుఁగనా? రెండుద్రోళ్లు వంగుసరికి మూఁడవది వంగదు మూఁడవది బలాత్కారమున వంచినను నాలుగవది నట్టు వారందఱు వ్యవహారములు చేసికొనుచున్నారా లేదా? అటులే నాకొడుకుఁగూడఁ జేసికొనును. వ్యవహారపు బాగోగులు ప్రారబ్ధమునుబట్టి యుండును గాని ప్రభుని తెలివినిబట్టి యుండవు. అయినను మహారాజుగా నెంతపెద్దవారైనను నింకఁ గొన్ని సంవత్సరములు జీవింపఁగూడదా? చూడు! కుశలా! నాకొడుకు నెట్లో లోకజ్ఞానయుక్తునిగాఁ జేసెద నని చెప్పితివికాదా? ఏమి చేసితివే?

కుశ — అమ్మా! చక్కని యాఁడుదానిగాలి సోకగ మెండిమొఱడైనఁ జిగుర్చును. దాని కంటికొలు పట్టె తళుక్కన మెఱసినయెడల నంధుఁడైనను దివ్యచక్షువగును సవిలాసమగు దానిపలుకు వినినయెడల మూఁగవాఁడైనను వాణీవిశారదుఁడగును. దాని చేయి తగిలినయెడల మట్టి బంగారమగును పురుషుని బహిరంత స్తత్త్వములకుఁ గాంతానురాగ మిచ్చునంతటి సాపుసంతన—మార్దవము తళుకు—మ తేవియు నీయఁజాలవు. ఒక్క ప్రక్కచూపు పదునాలుగు చిత్రిక గుల్లలపెట్టు. ఒక్క చిఱునవ్వువిసరు ముప్పది మెఱుఁగులపెట్టు. ఒయ్యారమైన యొక్కలెంపపెట్టు, అయిదు బీజాక్షరములపెట్టు. ఇట్లు తెలిసియో తెలియకయో కవులు చెప్పు మాటలు నేను మనస్సులో యోజించుకొని నిదర్శనమునుజూతమని యొక్క చక్కనిచుక్కను—ఒక్క వాలుగన్నులవగలాడిని—రెండు దినములనుండి నీకొడుకుపై నుసికొలిపితిని.

పా — అయ్యయ్యో! పెండ్లియాడు పిల్లవాఁడు చెడిపోఁడఁటే!

కుశ — ఇంతకంటెఁ జెడున దేమున్నది?

పా — వానితో నెవతెను సంధానపఱచితివి?

కుశ — మీ సెల వైనదని చెప్పి నా మేనకోడలు—లలితను—

పా — అయ్యయ్యో! నాతోఁ జెప్పకుండ నెంతపని చేసితివే?

కుశ — అంతఃపురము కనిపెట్టుకొన్న దాసులము. మాకామాత్రపు స్వాతంత్ర్య ముండఁగూడదా! అమ్మా—

పా — ఏడ్చినట్లే యున్నది. కాని, యీ రెండు దినములనుండియు విశేషమేమి?

కుశ — లలిత నాతోడ నేమియుఁ జెప్పలేదు నే నడుగలేదు.

పా — నాసవతికొడుకగు జగద్దేవునకు లలితమీఁదఁ బ్రేమ యని నాతో నీ వెప్పుడో చెప్పలేదా ?

కుశ — చెప్పలేదమ్మా అతఁడు నాతనిభార్య వీరమతియు క్షీరోదకన్యాయమునఁ గలిసి మెలసి కాపుర మొనర్చుచుండగా నది మీ కిష్టము కాకపోవుటచే వారిద్దఱకు విడాకు లిప్పింపఁదలఁచి లలితకు జగద్దేవునకు సంబంధమున్న దని యాతని భార్యతోఁ జెప్పుమని మీరు నాకాజ్ఞ యిచ్చితిరి. అంతేకాని నేను మీతోఁ జెప్పలేదమ్మా.

పా — సరే. పోనిమ్ము వెనుకటిమాట లేల? అయినను నెవ్వరు చెప్పిన వినియోగము మాత్రమేమున్నది ? ఎందఱో నమ్మినారు గాని యావీరమతి నమ్మియేడ్చినదా యేమి ? ఏదో మఱియొక్క మార్గ మాలోచించియే యున్నాను. ఈసారి జగద్దేవుని యతని తల్లిని నేల నడఁచికొట్టెదనో లేదో చూడు లలిత నాకు జగద్దేవపరాభవప్రయత్నమున సంపూర్ణముగఁ దోడుపడునా !

కుశ — అమ్మా ! మీసెల వగునెడలఁ దోడుపడనివా రుందురా ? ఇత రాంతఃపురముల లోని దాసులవలెనే మే ముంటిమా అమ్మా ! ప్రాణము లర్పించుటకు సిద్ధముగా నున్నవారము కాదా ? అందులో లలితకు మీయాజ్ఞయం దెంతభక్తియో మీ రెఱుఁగరా ?

(నేపథ్యమున) అత్తా ! రణధవళుఁ డచ్చట నున్నాఁడా ?

పా — లలిత మాటలోనే యిక్కడకు వచ్చిన దేల ?

కుశ — లలితారణధవళీయనాటకమునకు నియమితమైన రంగములేదు. ఇప్పటి నాటకము వలె నెక్కడ కక్కడకే యంకము. ఎక్కడ కక్కడకే రంగము. వారంతఃపురమున నెక్కడఁ దారసింతురో అక్కడనే వారు మాటలాడుకొందురు వారిక్కడ కిప్పుడు వత్తురేమో ? మీ రుద్యానమునకో పైమేడలోనికో దయ చేయుఁడు. నే నింటికిఁ బోయెదను. లలితా ! భర్తృదారకుఁడిచ్చట లేఁడు. (నేపథ్యమున) అమ్మగారి యంతఃపురములో నుండెదనని చెప్పినాఁడు. ఆతని కొఱకిచ్చట వెదకుచున్నాను అమ్మగా రచ్చటనున్నారా !

కుశ — లేరు.

పా — నాకుఁ దోఁచినయుపాయ మేదో నీచెవిలోఁ జెప్పెదను. (చెప్పుట నటించును) లలిత దీని నాచరణలోఁ బెట్టవలయును. బహునిపుణముగ జరిగింపవలయునని లలితతోఁ జెప్పుము. నీవు లలిత కెదురుగఁ బోయి దానితోఁ జెప్పుము. అది గాక జగద్దేవుఁ డిక్కడకు సాధారణముగా వచ్చుసమయమిదియే. ఆతఁ డొక వేళ రానియెడల నీ వాతనియింటికిఁ బోకుండ నాతఁడిక్కడకు వచ్చునట్లు చేయవలయును. తెలిసినదా ?

కుశ — తెలియకేమమ్మా ! ఇది మాకుఁ గ్రొత్తయా ?

పా — సరే. నేనుద్యానవనమునకుఁ బోయెదను. (నిష్క్రమించును)

కుళ — లలితా! (లలిత ప్ర॥)

చూడు లలితా! (చెవిలోఁ జెప్పుట నభినయించుచు) ఇఁక నేను బోవుదును.

లలిత — నీవు పోవుచెడల నెట్లు? నీవిప్రక్కనే యుండి యప్పుడుఁ గనిపెట్టుచుండి యెప్పు డెట్లుచెయవలయునో యప్పు డట్లుచెయవలయును గాదా?

కుళ — నాకుఁ జెప్పవలయునటె. (సకళల నిష్క్రమించును)

లలి — అహాహా! నా కీగడుసుపనితోఁ దగులాట సేమి? ఇతఁడు జన్మమందుఁడు కాఁడు, వెఱ్ఱివాఁడు కాఁడు అటునిటుకాని యేదో వింతవ్యక్తిగా నున్నాఁడు. అమావాస్య యనక, పూర్ణిమ యనక, పగలనక, సంధ్యయనక, భార్యలతోఁ జేరనరాజులు కిక చపుటిడద్ద్యాలు పుట్టుదురు నిల్వోపనిపేదనకు రాజు లంపుచుండెత్తెను సోఁదిసినఁగాని కోటలలో నీవిశ్వామిత్ర సృష్టియాగదు. ఈ కాంకనక్కకు — ఈ పెద్దమ్మరు నా బాహుబలంనుల గరడీనేర్పి రాజ్యార్హఁ డగునట్లు చేయవలయునఁట. శుక్రుని నీతిసారము, చాణక్యుని యర్థశాస్త్రము దుమ్ముకొట్టుకొనిపోయినవి ఇంతకు దాసిదాని గాగరాగతె యైనది. మొదలు మనుజుఁ డగుటకే యర్హత లేనివానికి రాజ్యార్హత యెట్లు నేర్పవచ్చును? అమ్మగారియాజ్ఞ ఆధునికకవిత్వములోవలె నరములేదు. రాజ్యార్హత నే నాతని కీయవలయునఁట. ఇది యేమి లెంపపెట్టా? నెత్తిపై మొట్టా! రణధవళా! రణధవళా! (రణధవళుఁడు ప్ర॥)

రణ — హీ హీ హీ హీ. (నవ్వును)

లలి — రావోయి మగఁడా! రావోయి మగఁడా! నా యదృష్టమునకొలఁది దొరకితి వోయి మగఁడా!

రణ — ఇదిగో! నన్ను మగఁడా మగఁడాయని పిలిచినయెడల బాగుగా జరుగదు. జాగ్రత్త!

లలి — నే నెవతెనో బాగుగాఁ జూడు నేను నీభార్యనుగానా? ఇదిగో (గుండెపైఁ జేయివైచి) ఇటుచూడు. ఇటు చూడు

రణ — నిన్నుఁ జూడగా నాకుఁ జిన్నతనమునఁ బాలిచ్చిన బంగారి జ్ఞప్తికివచ్చుచున్నది.

లలి — ఓరి నీపాలుత్రాగుట బండలుగాను! ఈసమయమునఁ బాలుత్రాగుట జ్ఞప్తికి వచ్చినవాఁడవు నీ వెందులకయిన నక్కఱకు వత్తువా? భర్తృదారకా! నేను నీకు దాసిని నీకుఁ బ్రపంచజ్ఞానమును వ్యవహారదక్షతను నొసఁగుటకుఁగాను మీయమ్మగారిచేత — అదిగో! అటులిటులు చూడకు. నేను జెప్పిన దేదో తెలిసిందా? నా మాటలపై మనస్సు చెదరనీయకుండ నిలుపఁబెట్టుము. నీకు రాజ్యార్హత కలుగునట్లు — అదిగో! అటులిటులు చూడకు ఇదిగో! నావంక-

రణ — అదిగో! అరిసెలపళ్ళెముమీఁదఁ జిట్టెలుక — హీ హీ హీ.

లలి — నాపిండకూడు నల్లమనుగు. పోతంత యూఁడుదానను నావంకఁజూడక, చిట్టెలు కరెపో యని దేవులాడెద వేల? ఇఁక నట్లుచూడకు. (అతని యూడాడపై

నొకచేయి యీగోడపై నొకచేయి వైచి మొగము తనవంకకుఁ ద్రిప్పుకొని) నేను జెప్పఁబోవున దేదో మనస్సు పాదరసమువలెఁ జెదఱనీయక విను నా వంక సరిగాఁ జూచుచున్నావు కాదా? నీతండ్రిగారు పెద్దవారైనారు. రెండుమూఁడు సంవత్సరములకంటె నెక్కువ జీవింపరు

రణ—హీ హీ హీ.

లలి—నవ్వెదవేల? వారి యనంతరము నీవు రాజ్య మేలవలయును. అదిగో! అటు చూడకు. సరిగా నా మొగమువంకఁ జూచి మాటలాడుము.

రణ—ఊంను ఊంను. నీకు మూఁతిమీఁద రవంత మీసము బయలు దేఱుచున్నది సుమా!

లలి—(వదలి వైచి) మీసాలమగవాఁడ వైన నీప్రయోజకత్వ మిటులుండ నేనేమి చెప్పుదును నాకు మీసము వచ్చినఁ దప్పు లేదు. ఇదిగో మఱియొకసారి శ్రద్ధగా విను నీవు సర్వవిధముల నసమర్థుఁడ వగుటచే మీయన్న జగద్దేవుఁడు మీతండ్రి రాజ్యమును స్వీకరించి పరిపాలించును నీ మొగము చూచువా రెవ్వరునుండరు. నీవు మూఁడు పూటల భోజనముచేయుచుఁ గూరుచుండవలసినదే కాని—

రణ—సువారములో రొయ్యపప్పు కాకి యెత్తుకొనిపోవుచుండగా రాయితీసి కొట్టి నాను. అది మన వీరిగానికంటికిఁ దగులుటచేఁ గన్ను లొట్టపడిపోయినది. హీ హీ హీ

లలి—ఎంత మందభాగ్యుఁడవయ్యా! రాతుసంహార మొనర్చుచు మీయన్న రాజ్యమున నుండ, నీవు సువారములోఁ గూరుచుండి కాకులను గుక్కలను దోలుచుందువా? రాచబిడ్డవు కావా? పౌరుష మక్కఱలేదా? నిన్నుఁగన్న తల్లి తండ్రులు నీవలన నెంతబాధ పడుచున్నారో చూడుము. మీయమ్మగారికి జగద్దేవుఁడు క్రోధస్థానము. అతనిని సాధింపవలయు నని యామె నిశ్చయించుకొని నది. ఆమెకోర్కెను నెరవేర్చి యామెను సంతోషపెట్టవలయును. నీ వేమి చేసెదవు అదిగో, అటుచూచెదవేల? నావంక సూటిగఁజూచి మాటలాడుము నీ వేమిచేసెదవు? మనస్సు చెదఱనీకుండఁ జప్పుడుఁ జెప్పుము. అతనికిఁ బట్టాభిషేకమగుచో నెడల నీకు ముష్టి రోగము తక్క నంతకంటె లేదు

రణ—పౌరోహిత్యపు బాపనయ్యలపైఁ గుక్కల నుసికొల్పెదను. హీ హీ హీ.

లలి—బాబయ్యా! అంతేనా! పశువులపాలకు నిప్పంటింపరాదా? అశక్తిలో నీ కింత దౌర్జన్యమున్నది! కొండఱుకంఠములకుఁ బల్లులేకపోవుటచేత, గానము నందు సంగతులు వారు తలఁచుకొనకుండ వానియంత యవియే వచ్చును. అటులే నీమనస్సున నేమాత్రమును బుద్ధిలేకపోవుటచేత, నీవు తలఁచుకొనకుండ నన్ని యవకతవకమాటలు వానియంత యవి వచ్చుచున్నవి నేనిప్పు డేమి చెప్పి తినో నీ కర్థమైనదా? ఛీ! వట్టి రసహీనుఁడవు

రణ—పనసల రసము చేసికొన్నప్పుడు కీళ్లు పట్టినవి. లేవఁబోయి కాఁగులు నదిపూజారి గారిమీఁదఁ బడినది. హీ హీ.

లలి—ఇఁకఁ జాలించు. నేను నీమీఁద నట్లు విఱుచుకొనిపడినయెడల—

రణ—మాయమ్మతోఁ జెప్పెదను.

లలి—ఏదీ! ఏమాత్రము చెప్పెదవో (మీఁదఁ జేయివైచును.)

రణ—ఈ. (గీ పెట్టును.)

లలి—గొంతుకోసినట్లట్లు గీపెట్టెదవేల? ఆఁగు. ఆఁగు. అంతటితో నాఁగు. నావంక దృష్టినిలుపుము. నే నాఁడుదాననుగదా! నీవు మగవాఁడవుకదా! నేను నిన్నిట్లు కౌఁగిలించియుండ నీకేమైన నుత్సాహముకాని యుద్రేకముకాని కలుగుచున్నదా?

రణ—ఆఁకలియగుచున్నది.

లలి—ఛీఛీ! ఆఁకలియగుచున్నదా? పోయి బంగారియొద్దఁ బాలుద్రాగుము. బుద్ధితోఁ జేరిన యేపనికిఁగూడ నీవు పనికిరావు సరేకదా ఒక్క సాపాటునకుఁ దక్క నీవు మఱెందులకు నక్కఱకురావు. కేవల మింత నిరుపయోగుఁడవగు నీచే నేయాటనాడింపవలయునని యాబ్రహ్మ యీ ప్రపంచరంగమున నిన్ను మనుజునిగ సృష్టించెనో యాతనికే యెఱుక. నీ బ్రదుకు నిరర్థకము. నీకు రాజ్యము లేదు. ధనములేదు. సుఖములేదు. గౌరవములేదు. ఉదయాదిత్యమహారాజు ప్రియభార్య కొడుకవైన నీకంటెఁ బడుచుకొని జీవించు దాసిదాననైన నేను సహస్రగుణాధికురాలను.

రణ—మాయమ్మ నడిగి యెంతో చక్కగ నొక కోక కట్టుకొని యొక రైక తొడిగి కొందును.

లలి—హరహరీ! కోకకట్టుకొని రైకఁదొడిగికొని యెవరియొద్దఁ బండుకొందువు.

రణ—మా జగద్దేవన్నయ్యయొద్దఁ బండుకొందును.

లలి—నారాయణ నారాయణా! పో పో! (తనలో) ఎవరిదో కాలియలికిడి యగుచున్నది. ఇఁక నడు. (రణధవళుని త్రోచివైచును)

(నేపథ్యమున) మాయమ్మగా రచ్చట నున్నారా? నేను వచ్చుచున్నానని మనవి చేయుము.

లలి—అదిగో! జగద్దేవుఁడు వచ్చినాఁడు.

(నేపథ్యమున) రావచ్చునో లేదో తెలియకున్నది.

లలి—రావచ్చునయ్యా. (జగద్దేవుఁడు ప్రవేశించును.)

అయ్యా! నమస్కారములు.

జగ—దీర్ఘాయుష్మతీభవమ్మ. అమ్మగారేరి?

లలి—అమ్మగారు మేడమీఁద నున్నారు. మీరాకనుగూర్చి నివేదించి యిప్పుడే క్రిందికి దిగితిని. ఆమె స్నానముచేయుచున్నారు. ఒక్క పావుగంటలోఁ గ్రిందికి వచ్చెదమనినారు. మిమ్మిక్కడఁ గూరుచుండుమని సెలవిచ్చినారు. ఈ యాసనమున దయచేయుఁడు.

## ప్రథమాంకము

జగ—లలితా! నీవు నన్నుఁగూర్చి తీసికొన్న శ్రమకు మన్నింపవలయును. మాయమ్మగారలస్యముగ దయచేయుదురేమో! ఇప్పుడామెతో నేను మనవిచేసికొ-సిన యవశ్యపు సంగతు లేవియు లేవు కేవలము దర్శనార్థినై వచ్చితిని. మఱి యొకజాము తరువాతఁ దిరుగవచ్చెదను. నాకు సెలవిప్పింపుమని మేడమీఁదికిఁ బోయి యమ్మగారితో మనవిచేయఁగలవా?

లలి—అభ్యంతరమేమి. (తనలో) మేడమెట్లగదిలో నున్నవి కావున దానిలోనికిఁ బోయి రెండునిముసములు గూరుచుండి వత్తును. (నిష్క్రమించును.)

జగ—మన మేదైనఁ బనిచేసికొనుచుండఁగా నెవ్వఁడో యొకఁడు మనలఁ గాంచుటకు గుమ్మములో వేచియున్నాఁడని మనకుఁ దెలిసిన తరువాత మనచేతిలోని పని కాఁదగినంతతీఱికగా మాత్రము కాదు. మనకొఱకు నిరీక్షించువాఁడు మిత్రుఁడైనసరే-శత్రుఁడైనసరే-తటస్థుడైనసరే-పనిలోఁ గొంత తొందరకల్గుట మాత్రము సత్యము. దోషనిరూపణమొకటి స్నానమొకటి మంత్రాలోచనమొకటి తీఱికగాఁ జేయవలసినపనులు. అందుచే మఱియొక సమయమున వచ్చుటయే మంచిదనుకొందును. అయినను లలిత యేమిచెప్పునో విందము.

లలి—(ప్రవేశించి తనలో) అమ్మగా రుద్యానవనములో నున్నట్లున్నారు. ఇంతట రారు. (ప్రకా) భర్తృదారకా! మీరు సెలవిచ్చిన సంగతు లమ్మగారితో మనవిచేసినాను. ఆమె క్రిందికి దయచేయువఱకు మిమ్మిక్కడనే కూరుచుండుమనినారు.

జగ—సరే సంతోషమే.

లలి—ఎందులకుఁ గూరుచుండుమనినారో యాకారణమును దెలిసి కొందురా?

జగ—తెలిసికొనవలసిన యావశ్యకత నాకు లేదు. వేదవిహితవిధులకుఁ దల్లిదండ్రుల యాజ్ఞలకుఁ గారణములు తెలిసికొననక్కఱలేదు.

లలి—మీకుఁ దెలిసికొనఁదగకపోవచ్చును గాని నాకుఁ జెప్పకతప్పదు. మీకు వినక తప్పదు కుశల మిమ్ము రమ్మని పిలిచినదా?

జగ—లేదు. నాయంత నేనే వచ్చినాను.

లలి—అమ్మగారు మీ కేదో భక్ష్యము చేయించుచున్నట్లున్నారు. దానిని మీ కిచ్చుటకుఁ గాఁబోలు మిమ్మిక్కడ నుండుమనినారు.

జగ—సరే. నే నిక్కడఁ గూరుచుంటినని మనవిచేయుము.

లలి—ఈ మనవి కొఱకుఁ దిరుగ మేడనెక్కవలయునా! ఇదివఱకు రెండు మాఱు లెక్కితిని. తిరుగ మూఁడవసారి యెక్కుమనుచుంటివా? నీ కెంతదయలేదయ్యా! రాజవంశములోనివారే మనుష్యులనియు సేవకజాతివారు కారనియు నీ యభిప్రాయము కాఁబోలునేమి? మీ వలె మాకు ధనములేదు. అధికారములేదు. కాని కష్టసుఖముల కధీనమగు మనస్సులేదా? మీవలె మాకుకూడ నున్న

పులుసు దిను శరీరమునే మాకుమాత్రము కోరికలుండవా ? కోరికలు దీఱలేదని లేహాలహాలుండవా ?

జగ—(తనలో) ఈమె యింతవింతగ మాటలాడుచున్నదేమి చెప్పుమా (ప్రకా) లలితా! ఈ మాత్రమునకే యింతగాఁ జదువనేల! రెండుసారులు నీవు నా కొఱకు మేడ నెక్కినందులకు నన్ను మన్నింపవలసినదని నిన్నుఁ గోరితిని అమ్మగారియొద్ద నుండవలసిన సేవకురాలవు అమ్మగారు మేడమీఁదనుండగా నీవు నా యొద్ద మఱియెవ్వరు లేకుండ నుండుట బాగుగా నుండదని అమ్మగారియొద్దకుఁ బొమ్మంటిని. అది నీవు తప్పుగా భావించుట న్యాయమా ?

లలి—అమ్మగారి యాజ్ఞకు వ్యతిరేకముగా నడువుమని నీవు నా కాజ్ఞాపించుట న్యాయముకాఁబోలునేమి ?

జగ—అదేమి ? అమ్మగారి యాజ్ఞకు వ్యతిరేకమేమి ?

లలి— అమ్మగారు నాతో నేమిసెలవిచ్చినారనఁగ "అబ్బాయి క్రిందకు గూరుచుండు నంతగలకు నీ వాతనితో నేవైన ముచ్చటలాడుచు నాతని కేదైనఁ బరిచర్య చేయుచుఁ గాలక్షేపము సులభముగా నగునట్లు నీ వాతనిదగ్గఱ గూరుచుండవలయును" ఇది రాణిగారియాజ్ఞ. మీరు నన్నుఁ బైకిఁ బొమ్మనుచున్నారు. వెళ్ళవలయునో, యిక్కడనే యుండవలయునో మీరే నిర్ణయింపవలయును.

జగ—అమ్మగారట్లాజ్ఞాపించిరని నీవు నాతోఁ జెప్పకపోవుటచేత నిన్నుఁ బైకిఁ బొమ్మంటిని.

లలి—అమ్మగారు నాకొఱ కిచ్చిన యాజ్ఞ మీతో నేల చెప్పవలయునో నాకు బోధపడలేదయ్యా !

జగ—లలితా ! పోనిమ్ము. తగవెందులకు. నీవుకూడ నటఁ గూరుచుండుము.

లలి—నే నూరక కూరుచుండుట కిటకు రాలేదయ్యా ! మీకుఁ బరిచర్య చేయుటకై నియమింపఁబడితిని. కాళు లొత్తుమందురా ? విసరుమందురా ? తల దువ్వమందురా ? మీ దాసిని. సిద్ధముగ నున్నాను. ఏమిసెలవు ?

జగ—నీ యాదరమే చాలు నీవు పరిచర్యచేసినట్లే సంతోషించితిని. ఆదరోక్తికంటె ననుస్థాన మెక్కువది కాదుసుమా ? కాని మాయమ్మగారు నిన్ను నాయొద్దనుండి పరిచర్య చేయుమని నీకేల యాజ్ఞాపించినారో చెప్పుమా ?

లలి—ఆప్రశ్న నన్నడిగినదా ? మిమ్ము మీరు పృచ్ఛించుకొనినదా ?

జగ—నన్నే నేను బ్రశ్నించుకొంటిని. కాని నీ వుత్తరమీయఁగలిగిన యెడల సంతోషింతును.

లలి—అటులైనఁ జెప్పునా. (సిగ్గు నటించుచు) నీకు నాకు నేదోయున్నదని యమ్మగారి నిశ్చయము.

జగ—శాంతమ్ పాపమ్—శాంతమ్ పాపమ్. ఎట్టిదుర్వార్త వినవలసి వచ్చెను. మరణమింతకంటె మేలుకదా. మృతశరీర మగ్నిసంస్కారముతో నంతమొందును.

చచ్చిన యశస్సు శాశ్వతముగాఁ గ్రుళ్ళుచునే యుండునుగదా? లలితా మా యమ్మగారి కట్టి నిశ్చయమున్నదని చెప్పితివికదా. ఆమె కట్టి దురభిప్రాయము నాయెడల నెవరు కలిగించిరో-ఈ ప్రతీతిలో నెంత సత్యమున్నదో నీకు బాగుగాఁ దెలియునుగదా? నీవు మాయమ్మగారి యొద్దకేగి నేనును నీవును నీయంశమున నిర్దోషులమని చెప్పి నాయెడల నామెకుఁ గల దురభిప్రాయమును దొలఁగించి పుణ్యము కట్టుకొందువా?

లలి—(నవ్వుచు) సరే మీ యిష్టము ననుసరించి నేను మీ యమ్మగారితోఁ జెప్పెద ననుకొనుఁడు. ఆమె నామాట నమ్మనే నమ్మదు. పోనిండు నమ్మినదనియే యనుకొనుఁడు అంతటితో మీ యశస్సు పరిశుద్ధినొందునా? ఈ యూర లక్షజనమున్నది వీరందఱి యొద్దకే రాయబారుల నంపఁదలఁచినారయ్యా? మీరు ప్రభువులు ధనబలసంపన్నులు సరే. ఎవరెవరినో పంపి యేయే పాటులో పడి యీ పట్టణములోని పురపాలక సంఘమువారిచే శుద్ధపత్రిక నొందెదరనుకొనుఁడు. అంతటితో నైనదా_పోనిండు కరపత్రములచేతనో కుడ్యప్రకటనముల మూలముననో దండోరాల మూలముననో మీ రాష్ట్రములో మట్టునకు మీ కీర్తికి బులికాపు పెట్టుదురుగాక! అంతటితో మీ యశస్సులోని మచ్చలు పోవునా? దూరపువారికి మఱింత పెద్దమచ్చ లగపడునను సంగతి మీ రెఱుఁగరా? మీరు బుద్ధిమంతులు ఉత్తమవర్తనులు. రాజకార్యదక్షులే కాని శృంగారకాండములో మా కనూచానపాండిత్యమని మీ రొప్పుకొనఁదగిన దేనా—చిత్తము ఇట్టి విషయములలో లేదని వెల్లడించుకొనుకొలఁది నున్నదను సంగతి మఱింత స్థిరపడును. గోకుకొనుకొలఁదిఁ జిడుము వ్యాపించునట్లిది చెఱపివైచుకొలఁది నావరించును మీరు ధర్మమూర్తులు ఈ పాటు లెప్పుడు పడినవారుగారు. ఇది కడిగివైచినకొలఁది గుగ్గిలపుజిడ్డులాగునఁ దెగసాగును. మీ కే పూర్వజన్మపాపముననో యీ మహానింద సంభవించినది. ఇప్పుడే భద్రముగఁ బ్రవర్తింప వలసిన మహావసరము. లేనిపోనిగుబ్బెటలుపడి త్రొక్కులాటలుపడి మఱింత యల్లరి చేసికొనకుండఁ బ్రార్థించుచున్నాను.

జగ—నీవనినది కొంత సహేతుకముగనే యున్నది అసత్యవార్తవలన మనస్సులోఁ గలిగినయాందోళనముచే నేనంతమట్టునకు యోజింపలేదు. అటులైన నిఁక నెట్లు?

లలి—ఏమి చేయవలయునో చెప్పెదను. వచ్చినవాదేదో రానేవచ్చినది. దాని నెవ రొక్కన వలదు. అది పోవలసినప్పుడే పోవును. నేను బదునాలేండ్లదానను, బంగారు బొమ్మనని ప్రఖ్యాతినొందినదానను. పండ్రెండుమాసములనుండి నీ కొఱకు రేయుంబవళ్ళు పరితపించుచున్నాను అదిగో మొగము ముడుచుకొనుచున్నావు. ఊహలు హ్హానఁబోవుచున్నావు. ఇఁక మాఱుచెప్పవలదు. ఈ శరీరము నీది. ఈ మనస్సు నీది నన్ను నీయొద్దకుఁ జేర్చుకొనుము. ఊఁ. సందేహింపకుము. ఇదిగో నీ పాదములపైఁబడుచున్నాను.

జగ—అఁగుము. అక్కడనే యాఁగుము. లలితా! నీలాపనిందకొఱకే విచారించుచున్న నేను బాపకార్యాచరణమున కొడఁబడుదునా? కల్ల. పట్టికల్ల. నీ వాభ్రాంతి పడవలదు నేను త్రికరణశుద్ధిగా సాధర్మపత్నిని ప్రేమించినవాఁడను. పరకాంతను స్పృశింపను నాయందు దయయుంచి నన్ను వదలిపెట్టుము.

లలి—నిన్ను నేను వదలిపెట్టుదును గాని నా కోరిక నన్ను వదలి పెట్టునా? నాదుఃఖము నన్ను వదలిపెట్టునా? నారోషము నన్ను వదలిపెట్టునా? వానిని వదలి పెట్టుమని చెప్పుము. ఆహాహా! వదలి పెట్టుమని యెంత సులభముగాఁ జెప్పితి వయ్యా! కంటికి మంటికొక్కధారగ నీకొఱకహోరాత్రము లేడ్చుచుంటినే. నీనామమే తారకనామముగ జపించుకొనుచుంటినే. నీకొఱకే నాశరీరమును బవిత్రముగనుంచుకొంటినే. ముష్టివాఁడు దేహియని యాచింపనాతని కన్న మిచ్చి యాదరింతుము. వీధిలోని కుక్క యొకగంటసేపు మనగుమ్మము వదల కుండఁ గనిపెట్టుకొని యుండునెడల దానికి గంజియైన బోయుదుమే. అది కేవలము మనుష్యధర్మముకాని మఱియొక్కటి కాదుగదా. ఆమాత్రపు మొగ మోటమిర్యైన లేనివాఁడు మనష్యుఁడే కాఁడుకదా. అందులోఁ బ్రభుకుమారుఁడవు. పదునెనిమిదేండ్లవాఁడవు. పట్టాభిషేకమున కర్హుఁడవు. రాజ్యాంగతంత్ర మంతయు నిది వఱకే నేర్చినవాఁడవు నీదాసినిగదా పంద్రెండుమాసములనుండి నీకొఱకు విలపించుచుంటినిగదా. నిద్రాహారములులేక యథశ్యాయన బ్రహ్మచర్యవ్రతములు నీ కొఱకే చేయుచుంటినిగదా! సూదిమొన యంతజాలి నీ హృదయమున లేకపోయెనే. ఇఁక రాజులని యాశ్రితులని యాశ్రితపక్షపాతము లని దర్బారమన్ననలని నా పిండకూడని నల్లమడుగని యింత గంపలిరుగుడు గత్తర యెందులకు? అన్ని రాజధర్మములు మన్ను కొట్టుగొనిపోయెనా? దగ్గఱకు వచ్చునరికి దూరముగఁ బరుగెత్తెదవా? నావంకఁ జూడుమని ప్రార్థింప మొగమటు త్రిప్పుకొందువా? సేవించినంతకాలము కదలకుండ మెదలకుండ సేవ చేయించుకొందువా? ఇమ్మని యడుగ నేడుపా?

జగ—లలితా! అట్లె చదువకు. నీ కోర్కకు రాజధర్మమున కేమియు సంబంధములేదు అత్యుద్రేకముచే సత్యాసత్యము లెఱుఁగక దుర్నీతిని బోధించుచున్నావు. నీ కోర్కె తీర్పనియెడల రాజధర్మహానిలేదు. నీవేమి కోరితివో యెఱుఁగుదువా? నాశరీరమును నా ప్రేమను. అవి నా ధర్మపత్ని కిచ్చితిని. ఒకరికిచ్చిన వానిని నీకుఁ దిరుగ నిచ్చుటకు సాధ్యమెట్లు? అవి నీ వడుగఁదగదు. నే నీయఁదగదు.

లలి—ఇంతే. ఇంతే.

జగ—అంతే. అంతే. కాని సేవించినంతకాలము కదలకుండ మెదలకుండ సేవచేయించుకొందువా-ఇమ్మనఁగ నేడుపాయని నీవింతకుముందు నన్నెత్తిపొడిచితివి. నీ చేత నేనేసేవ చేయించుకొంటిని?

లలి—ఏసేవచేసితినో నీవెఱుఁగవు. చెప్పవలసిన యావశ్యకములేక నీకిదివఱకుఁ జెప్ప లేదు. అడిగినప్పుడు చెప్పకుండుట తప్పుకావునఁ జెప్పెదను. మీ సవతితల్లిగారు నీకు విషము పెట్టినప్పుడు—

జగ—అయ్యయ్యో! అంతగట్టిగ వలదు, నిమ్మళము. అట్టివాడుక యున్నదికాని యది కేవల మసత్యమునుమా! కిట్టనివారు కలిగించినవదంతి యది చూడు లలితా! యీ సంగతి మఱియెవ్వరితోడ ననఁబోకుమా (తొందరతో సమీపించును)

లలి—వియ్యమ్మగారి మర్యాద కాపాడుటకై యిప్పుడు దగ్గఱకువచ్చితివా? ఏదీ! ఒక్కముద్దు నీ యిష్టమువచ్చినంత నిమ్మళముగాఁ జెప్పెదను, ఏదీ ఒక్కటి—

జగ—అబ్బే! ఇఁక నట్టిప్రస్తావమే వలదు.

లలి—ఆ ప్రస్తావము వలదు. కాని యిది కావలయునుగాఁబోలు. అటులైన నేను జెప్పను. విషముపెట్టిన అమ్మగారిపరువును గాపాడుట కింతయాందోళన పడుచుంటివే. ఆవిషతంత్రమునుండి నీ ప్రాణమును గాపాడిన దానిదాననైన నా మర్యాదను గాపాడుట కింత వెనుదీయుచుంటివా? ఏదీ! ఒక్కముద్దేకాదా! నీకు నష్టములేదు. నాకు మహాభాగ్యప్రదమైన బహుమానము ప్రాణము కాపాడినదానికొఱకు మాత్రపుఁ ద్యాగమైనఁ జేయలేవా?

జగ—నా ప్రాణమును నీ వెట్లు కాపాడఁగలిగితివి?

లలి—(తనలో) నీ ప్రాణమును భగవంతుఁడే కాపాడినాఁడు. (ప్రకా) నేను జెప్పను. ఒక్కముద్దిచ్చినయెడలఁ జెప్పెదను. ఆలోచింపకు. సందేహింపకు. జాగు సేయకు. త్వరగ—ఊఁ.

జగ—ఊహు-నేను ముద్దిడుకొనను.

లలి—పోనీ. నేను జెప్పను.

జగ—కాని నీవీయంశమును మఱియెవ్వరితోడఁ బ్రస్తావింపకుమా. నేను నీకు విధేయుఁడనై వేఁడుకొనుచున్నాను.

లలి—నేను నీకు విధేయనై యింతగా వేఁడుకొనినందులకు నీవు నాకిట్లు మొండిచేయి చూపితివి. ఇఁక నేను నీకా? ప్రభువులనీతి యే బానిసలకును. దాని తప్పుచేసినప్పుడు ప్రభుని మూఁతిపైఁ బొడిచిన యెడల నా తప్పు దిద్దుబాటగును. నీకు నాయెడల విశ్వాసమైన లేదుకాని నా ప్రాణముపోవువఱకు నీ యెడల నా కనురాగము మాత్రము పోదు. ఇఁక నేను బోవుదును.

జగ—నా ప్రాణమును రక్షించితినని చెప్పుచున్నావు. నేను విశ్వాసహీనుఁడనుగాను ఈ హారమును దీసికొనుము. ఇప్పటివఱకు నా కింతవఱకే శక్తియున్నది. దయయుంచి తీసికొనుము. నీ మేలు నే నెన్నఁడును మఱవను.

లలి—హా! జగద్దేవా! నాకు హారమిచ్చితివి. దీనిని నీయొద్దనే యుంచుము. నా బ్రదుకెట్లున్నదో నీవు రవంతయైన యోజించితివా? నీయూపు మాపనెంచిన నీ సవతి

తల్లికి—ఉదయాదిత్యమహారాజును పట్టి వ్యర్థునిగ మూలఁ గూరుచుండఁబెట్టి రాజ్యమేలుచున్న నీ సవతి తల్లికి—నిన్ను నీతల్లిని, నీ భార్యను గజగజలాడించుచుఁ గొలబెత్తెమిచ్చి గోళ్లు గిల్లుకొనుచుఁ గూరుచుండఁబెట్టిన నీ సవతితల్లికి —ఆమె చేసిన విషతంత్రమునుండి నీ ప్రాణములు రక్షించిన నేను—ప్రబల విరోధినగుట యాశ్చర్య మేమున్నది? నేను దన కడ్డువచ్చితి నని యామె కెప్పటికైనఁ దెలియును గాని మానదే నన్నామె ముక్కముక్కలక్రింద ఖండించుటకు సిద్ధముగ నుండునే పోనీ! ఆమె క్రోధముతో నాకు లెక్కయేమి? నే నీమహారాజపుత్రుని సంరక్షించితిని. అతని చేతిలో నాతనువు వెడలిపోవును నాకేమిభయమని నేను ధైర్యముతో నుండుటకు నీవు నాకంటె నాఁడుదానవైతివే. పోనీ! నేను దాసిని గదా! నాకు నీవే యున్నమాట యేమి? ఈయూరు విడిచి మఱియొక్క యెడకుఁ బోయి యెవ్వరికైనఁ జేరదీసి లోకముతోపాటు కులవృత్తి చేసికొని జీవింతునన్న నయ్యయ్యో! నామనస్సు—నా ప్రాణము—నాయాత్మ నీ కర్పించుకొంటినే. నీవులేని బ్రదుకు నా కక్కఱయేలేదే. ఇట్టి స్థితిలో నీవు నాకు హారమా యిచ్చితివి! అదిగో బట్టలాఁగట్టు నూఁబుత్రాడు. దానిని దెచ్చి గట్టిగ నా గొంతున నురిపోయుము నీవును నేనును గూడ సుఖపడఁగలము.

జగ—హరిహరీ! ఎంతమాట నాడితివి! నా ప్రాణములను రక్షించిన దానవుకదా, అట్టి నీ గొంతున నురిపెట్టి నీ ప్రాణములు తీయనా? నీవట్లు కోరఁదగునా? ఆమాటలవలన నా ప్రాణ మెంతకొట్టుకొనినదో నీ వెఱుఁగుదువా? నీవు నా యందు దయగలదానవుకావున నాయంతరంగమును వెలిబుచ్చుచున్నాను. నీవు చెప్పినవిషప్రయత్నమునుగూర్చికర్ణాకర్ణికగ నేను విని యున్నాను. అది సత్యమో యసత్యమో. సత్యమే యైనను నట్టివారిని భగవంతుఁడే క్షమించి మంచిమార్గము లోనికిఁ దెచ్చుఁగాక! ఎట్టులైనను నిచ్చట నుండుట మాకుఁ గష్టముగనున్నది. అందుచేఁ గొలఁది దినములలో మఱియొక్కచోటికిఁ బోవుదుము. నీ విచ్చట నున్నయెడల నిన్ను మా సవతి తల్లిగారు శిక్షింతు రని చెప్పితివి కావున—

లలి—సామాన్యశిక్షతో నామె సంతుష్టిపడునా! కొఱతను వేయించునో—ఉప్పుపాత ఱను వేయించునో. అయ్యయ్యో! జగద్దేవా! ప్రాణము అరచేతిలో నుంచుకొని యున్నానుగదా!

జగ—అందుచేతనే చెప్పుచున్నాను. నీవు మఱియొకచోటికిఁ బోయి నీ వృత్తి చేసికొనుటకుఁగూడ నిష్టపడ నని చెప్పితివి కావున—

లలి—నా బ్రదుకు మండిపోను! ఇంకను గులవృత్తియా? నే నంతనీచురాలనా! సర్వసద్గుణసంపన్నుఁడగు జగద్దేవుని త్రికరణశుద్ధిగఁ బ్రేమించిన నేను—కలంకారిపూలగాగరా కట్టుకొని, జూలుకైకఁ దొడిగికొని, మొగమున బూడిదె రాచికొని, జాలుకొప్పుతో, నోటివిడెముతో, బ్రేలుపైఁటతోఁ దలుపుచాటున నిలువఁబడి సంతపందలను జూచి దోబుచ్చులాడుదునా? ఛీ! నాల్గుగోడల

నడుమను బస్తుపడి చావనైనఁ జచ్చెదను గాని—దాసిదాని కేమి? యనురాగమేమి యని వెఱ్ఱిముండకొడుకులు పరిహసింతురుగాక! దాసిమాత్ర మాఁడుది కాదా? దానికి మాత్రము హృదయము లేదా? కడుపు గడవక యెన్ని కక్కుఱితులు పడినను దానికిఁగూడ శాశ్వతమైన యనురాగ మొక్కనియందే నిల్చియుండును. నా మహాపాపమున నీయందు నా బుద్ధి స్థిరముగా లగ్నమైనది. "శాపాదపి శరాదపి" తత్త్వముగల ముండను గావున బ్రహ్మచర్యవ్రతమునకు శపథమొనర్చితిని. ఇంతకును—

జగ—ఇంకఁ జెప్పనక్కఱలేదు. నాకుఁ దెలిసినది. ఇక్కడ నుండుటకు వీలులేని హేతువునను గులవృత్తి వదలుకొనిన హేతువుచేతను నీవు నాభార్యయొద్ద నుండుము. మేము నిన్ను సమస్తగౌరవములతోఁ గనిపెట్టుదుము. దయయుంచి యంగీకరింపుము

లలి—(ముక్కుపైఁ జేయి వైచుకొని) ఎంతమాట నాడితివి! నీ కాళ్ళపైఁబడి మ్రొక్కినందులకు నీవింత సౌభాగ్యమును గలిగించితివి. ఇఁక నీభార్య కాళ్ళకుఁగూడ మ్రొక్కింపవలయు నని నీకు బుద్ధిపుట్టినదా? నన్ను ముక్కలక్రిందఁ గోయుటకే సంకల్పించుకొని యుంటివా? నా యెడలఁ బ్రేమములేదు సరేకదా మీఁదు మిక్కిలి కోపముకూడ నున్నదా?

జగ—ఆఁ ఆఁ! నా హృదయ మెఱుఁగకుండ మాటలాడుచున్నావు.

లలి—నీ హృదయమును నీవేమాత్ర మెఱుఁగుదువో చెప్పెదను వినుము. నీవొక కాంతను వలచితివి. తలమున్కలుగ వలచితివి. దాని పాదములపైఁ బడి యాచించితివి అది నిన్నుఁ దలపైఁదన్ని పొమ్మన్నది. నీకు దానిపై రోషముకల్గునా? నీవు దానిని సాధించి పట్టి పాలాగ్నవలయునను పట్టు నీ హృదయమున గనిగవలె నాఁటియుండునా? అంతేకాని యామె యింటిలో నంటకుండలు గడుగుచుండు సేవకవృత్తి నంగీకరింతువా? నీహృదయము నడుగుము అది యేమని చెప్పునో విను. దాని ప్రత్యుత్తర మేదో నీ మొగముమీఁదఁ గనఁబడుచునే యున్నది. నీకుఁ దగనిది నాకెట్లు తగుననుకొంటివి? నేను నీ వంటిదానను గానా? నాకు నీవలెనే సిగ్గుబిడియములు లేవా? ఈ కాలపుఁ గాంతలు పురుషులకంటె నెక్కువ పౌరుషలక్షణములు కలవారని యెఱుఁగవా? ఒక్కసంగతి యాలోచింపుము. చిత్రాంగి యేమి చేసినది? నీవు నన్నిన్నివిధముల నిరాకరించినందులకు నేను గ్రోధము వహించి నీయెడల మాయమ్మగారిని ప్రోత్సహించి యరనిముసములో నిన్నురితీయింపఁగలనే! ఇంత యవమానము మఱియొకతె సహించునా? పరమపవిత్రమైన యనురాగముకలదానను గావుననే సహియించితిని. చచ్చి పడియుంటిని. అందుకు సంతోషించి యూరకుండక నీభార్యవీఁపు గోకు మందువా?

జగ—నీ వేమిచెప్పిన సరేకాని నీ విక్కడనే యుండి నా మూలమునఁ జచ్చుటకు నే

నంగీకరింపను. అటులైన మేముకూడ నిక్కడనే యుందుము. నా ప్రాణము పోయిన తరువాతఁ గాని నీకు బాధ కలుగఁగూడదు.

లలి—నిజముగా నీ కంతదయ యున్నదా? ధన్యురాలను. నీ వెక్కడ నున్నను నీ కభిమానముండినఁ జాలును.

జగ—నీకుఁ జాలునుగాని మాకుఁ జాలదు. నీవు మాతోడనే యుండవలయును.

లలి—సరే ఆలాగుననే చూచుకొనవచ్చును.

జగ—లలితా! సంతోషమే కాని యీ హారమును దీసికొనుము.

లలి—తీసికొందును గాని యిది ధరించుటకు వీలు లేదు కదా! ఇది ధరించినయెడల నీకును నాకును సంబంధమున్నదనుప్రతీతి మఱింత ప్రబలమగును గాదా? రెండుమూఁడు దినములలో వెడలిపోనైయున్నాముకదా! ఇంతలో నీ కవ్వ మఱింత యెక్కువ యగుట యెందులకు?

జగ—ఇప్పుడు ధరింపకుండఁ బెట్టెలో దాఁచికొనుము.

లలి—సరే. ఇమ్ము ఇది నీదనిమాత్ర మెవరికిఁ దెలియును. ఇష్టమైనయెడల ధరింపనే ధరింతును. (నిమ్మళముగా జగద్దేవా! ఇదివఱ కమ్మగారు క్రిందికి దిగినారు కారు చూచితివా? ఏదో దుష్టతంత్ర మాలోచించుచున్నదని నాకు భయముగా నున్నది. నన్నిక్కడ నీతో మాటలాడుమని యాజ్ఞాపించినది. మనసంభాషణ మును దెలిసికొనుటకు గోడచాటున నెవ్వరినైన నుంచినదేమోయని సందేహ ముగా నున్నది, నేను దనయెడలఁ జేసిన ద్రోహమును గనిపెట్టుట కీసంభాషణ మును బొసఁగించినదేమోయని నాకు భయముగా నున్నది ఏమియనుకొనుటకు వీలులేకుండ నున్నది మొత్తముమీఁదఁ బ్రాణము లరచేతిలోఁ బెట్టుకొని యున్నాను. ఏచాటునుండి యెప్పుడు తలపైఁ గొట్టించునో. నీవు నాకు వృథగ నీహార మిచ్చితివి కాని ప్రాణరక్షణసాధన మేదైన నిచ్చియుండునెడల బాగుగా నుండునుసుమా! ఈ రెండుమూఁడుదినము లెట్లుగడపెదవోయి భగవంతుఁడా రక్షింపుము.

జగ—నీకు భయముగా నున్నది కావున నా బాకిచ్చెదను. ఇది పైఁటచాటున భద్ర పఱచుకొనవచ్చును.

లలి—అయ్యో! నీకో! నీకుమాత్రము శాంతియున్నదా? ఎప్పటికేమిమూడునో.

జగ—ఇంటియొద్ద బాకులులేవా? ఇంటికిఁబోవులోపల నాకేమికీడురాఁగలదు?

లలి—అటులనుటకు వీలులేదు అమ్మగారిక్రోధ మట్టిది.

జగ—మ కేమియు భయములేదు. ఇదుగో బాకు తీసికొనుము.

లలి—(తీసికొని) మహాప్రసాదము. ఇదిగో నీపేరు దీనిపై నున్నదే. కన్నుల కద్దుకొందును. (అట్లుచేయును.)

జగ—అమ్మగారింకారారేమో.

లలి—సరిసరి. రాకపోవుటకూడానా ? చూడు జగద్దేవా ! అమ్మగారు రెండుదిన ములనుండి మఱియొకచిత్రము నడిపించుచున్నారుసుమా !

జగ—ఏమది ?

లలి—రణధవళునికిఁ బౌరుషము రాచఠీవి వ్యవహారదక్షతయు నేర్పఁగలందులకు నన్ను పాధ్యాయురాలినిగా నియమించినారు. అతనినిఁజూడ నాకు మిగుల రోఁతయగు చున్నది ఇదివఱకు మూఁడుపాఠములైనవి. చూడు అతనికి స్త్రీవాంఛ యున్నట్లు లేదేమి ! అతఁడు పట్టిచచ్చు—

జగ—ఆఁ. ఆఁ. అతని నేమియు ననవలదు. అతఁడు నాకుఁ బ్రాణతుల్యుఁడు.

(రణధవళుఁడు ప్రవేశించును)

జగ—తమ్ముఁడా వచ్చితివా ! సంతోషము. సుఖముగనున్నావా ?

రణ—హీ హీ హీ. కుశల యిక్కడికి గెంటివైచినది.

లలి—బుద్ధిహీనుఁడా ! సమయమెఱుఁగకుండ వచ్చితివేల చావుము (తనలో) అమ్మ గారిసెలవుప్రకారము బాకుతని మెడప్రక్కను భద్రముగఁ జేర్చెదను (చొక్కాకు మెడకు నడుమ నిమ్మళముగ బాకుపెట్టును.) (పాఱిపోవును.)

రణ—బాబయ్యో ! చచ్చితిని చచ్చితిని (క్రిందఁబడును.)

జగ—(తెల్లఁబోయి) ఆ. ఆ (అని రణధవళుని సమీపించును.)

కుశ—(పరుగున వచ్చి) అమ్మా ! రా ! భర్తృదారకుని జగద్దేవుఁడు చంపినాఁడమ్మా,

పార్వ—(ప్రవేశించి) అయ్యయ్యో ! నాతండ్రీ ! నాతండ్రీ !

కుశ—(ఆమెకాళ్ళపైఁ బడి) అమ్మా ! అదిగో నీసవతికొడుకు.

పార్వ—అయ్యో ! నా తండ్రీ !

జగ—అమ్మా ! తొందరలేదు. అతని కేమియు భయములేదు. అతనికిఁ బోటు తగుల లేదు. బాకు తీసివైచెదను.

పార్వ—దుర్మార్గుఁడా ! ఇంకను దమ్ముఁడు చావలేదు కావున మఱియొకసారి పొడి చెద ననుచున్నావా ? ఎవరక్కడ ?

(నేపథ్యమున) చిత్తము.

పార్వ—ద్వారరక్షకభటులారా ! మీరు వెంటనే లోనికి వచ్చి జగద్దేవుని బట్టుకొని మహారాజుగారిసెలవైనదని కారాగృహాధిపతి యధీనమున నంపుఁడు. కుశలా! చిరంజీవి బిడ్డను బట్టుకొనుము. మహారాజుగారితోఁ జెప్పెదము. రా. (పార్వతి కుశల, రణధవళుఁడు నిష్క్రమింతురు.)

జగ—(వికటముగ నవ్వి) హా ! పరమేశ్వరుఁడా ! ఎంత చిత్రచర్యఁగల వాఁడవోయి

(ద్వారరక్షకులు వచ్చి జగద్దేవుని బట్టుకొని తీసికొనిపోవుదురు.)

ఇది ప్రథమాంకము.

శ్రీరామా.

# వీరమతి

## ద్వితీయాంకము.

ప్రదేశము — మహారాజ్ఞియంతఃపురము.

ప్రవేశము — ఉదయాదిత్యమహారాజు, పార్వతి.

ఉద — ప్రాణకాంతా! అతఁడెక్కడకుఁ బోవును? అందువలన నాతనికిఁ గారాబం బము లేకుండఁ జేసితిని. ఎప్పుడవసరమైన నప్పుడేయున్నది తొందరపడక యాలోచింతము.

పార్వ — ఇంకను దొందరయక్కఱలేదా? ఇంకను దొందరయక్కఱలేదా? నేను దొందరపడుచుంటినని యే నీకగపడుచున్నదా? నాకొడుకును నీకొడుకు బాకతోఁ బొడిచినప్పుడు కూడ నీకింత శాంతియా? ఇంత నెమ్మదియా? ఇంత యోరిమియా?

ఉద — నాకొడుకేమి? నీకొడుకేమి? ఇద్దఱు నాకొడుకులేకద. ఇద్దఱు నా కొక్కటియేకద!

పార్వ — ఇద్దఱు నీ కొక్కటియేనా? ఆ పెద్దమ్మ యన్నివిధములఁ బెద్దమ్మయగుట చేతనే కదా నన్నుఁ గట్టుకొంటివి? చిన్నయిల్లాలనని మురిపముల యిల్లాలనని మురిసిమురిసిపోయితివే నాకొడుకే నీకుఁ బ్రాణప్రదమని పదేపదే బాసచేసితివే. వెనుకటిచదవు లిప్పుడు నెమరున కేలరావు? ఆవయస్సుతోడనే యాయవసరములతోడనే యాయాలాపము లన్నియు నంతరించినవా? ఆవాగ్దానములన్నియు వల్లకాడైనవా? ఇప్పుడు నా మొగము చూడవలసినయావశ్యకతలు నీకుఁ జల్లాఱినవికావునఁ బరమశాంతుఁడవై మహావేదాంతివై యిద్దఱు నాకొక్కటియే యని ద్వంద్వశూన్యత్వము నవలంబించితివా? మీఁదుమిక్కిలి యీవేదాంతమును నాకు బోధించుచుంటివా? ఇద్దఱు నొక్కటియే? పొడిచినవాఁడు పొడువఁబడినవాఁడు నొక్కటియే? అటులైన శిక్షాశాస్త్రము లెందులకు? న్యాయసభ లెందులకు? నీ వెందులకు? పాపపుణ్యము లెందులకు? భగవంతుఁ డెందులకు?

ఉద — దేవీ! నే నన్నమాటయేమి? నీవు చెప్పిన ప్రత్యుత్తర మేమి? పుత్రత్వము సమానమంటినిగాని ప్రేమ సమానమని చెప్పితినా! నేను జెప్పిన దేదో తెలిసికొనకుండ—

పార్వ—ప్రేమ సమానము కాదని నే నెఱుఁగనా ? నాసవతికొడుకునందే నీకుఁ బ్రేమ యెక్కువయని నే నెఱుఁదును ఆతఁడు విద్యావంతుఁ డని, రాజకార్యవిశారదుఁ డని, బుద్ధిమంతుఁడని, మీఁదుమిక్కిలి యాశ్యేష్ఠకుఁ గొడుకని నీకాతని యందేయనురాగము హెచ్చు, నీమొగము చెప్పుచున్నది నీప్రవర్తనము చెప్పుచున్నది.

ఉద—నాప్రవర్తనము చెప్పుటకు నేనిప్పు డేమిచేసితిని ?

పార్వ—ఏమియు నిదివఱకుఁ జేయలేదనియే నే నేడ్చునేడ్పు తెలిసినదా ? అయ్యయ్యో ! నోరులేనివాఁడే—వెఱ్ఱివాఁడే—పసివాఁడే—తల్లి తండ్రి కలవాఁడుకాని దిక్కుమాలినవాఁడు కాఁడే—అందులో మహారాజు కొడుకే—నిర్దోషుడే—పరమపవిత్రుఁడే—అట్టివానిని—ఒడలు పొగరుగ్రమ్మి—గనులు మీఁదికి వచ్చినపడుచువాఁడు ముంపయొంటిమీఁద అంకెలు వైచుకొనుచు నా యంతఃపురములోనికి వచ్చి బాకుతీసికొని పొడుచునా ? మఱియొక రాజైనయెడల మఱియొక న్యాయాధికారి యైనయెడల నీసరి కానరఘాతుకుని తల నఱికించియుండునే నీ వాతని నేమిచేయఁగలిగితివి ? శిరఃఖండనశిక్ష విధింపక యింక నేలయుపేక్ష చేసెదవు ? నీసెలవైన దని చెప్పి కారాగృహాధిపతి కుత్తరువు లిచ్చెదను. నీ వూరకుండుము.

ఉద—అయ్యయ్యో ! విచారణ చేయకుండనే శిక్షయా ? రాజ్యవినాశకమైనపని కాదా !

పార్వ—విచారణయెందులకు ? ఆతఁడు పొడుచుచుండఁగా అలిత చూచెను కుశల చూచెను. బాకింక మెడప్రక్కనుండగా నేనుజూచితిని. గీరుకొనిపోవుటచేత నెత్తురువచ్చినది బాకుతీసి మఱియొకసారి పొడిచెదనని యాతఁడు నాతోడనే యనెను. ఇంతకంటె నేమి నిదర్శనములు కావలయును ? విచారణవలదు ఏమియువలదు. వెంటనే శిక్ష విధింపుము ఇట్టి పెద్దవ్యవహారములలో నాలస్యమొనర్చిన,కొలఁది నప్రతిష్ఠ హెచ్చగును తప్పుగలిగినప్పుడు తటుకుమనునంతలో శిక్ష విధించినఁగాని ప్రజలకు భయముండదు అదిగాక సందేహమున్నప్పుడు విచారణకాని బట్టబయలైన యంశమునకు విచారణయెందులకు ? సూర్యుఁడున్నట్లు స్థిరపఱచుటకుఁ దర్కశాస్త్రమేల ? కావున సందేహింపక యాతని తల నఱుకుట కుత్తరువీయవలయును

ఉద—తల నఱికింపుమని యిదివఱకు రెండుపర్యాయములు చెప్పియుంటివి. ఆతఁడు హత్యచేయకుండనే యాతనికి శిరఃకర్తనశిక్ష విధించుట తగునా ?

పార్వ—నాకొడు కింకను బ్రదికియున్నాఁడని నీవిట్లు త్రొక్కులాడుచున్నావా ?

ఉద—హరిహరీ. అంత కఠినోక్తులేల ?

పా—కఠినోక్తులుకాక నానోటనుండి యిప్పుడు శృంగారవాక్యములు వచ్చునను కొంటివా ? తలవెంట్రుకవాసి తప్పినదికాని నేను నా కొడుకుతోఁ గూడఁ జితిమీఁద నుండవలసినదే. తలలో భూకంప మొందవ గుండెలలో నగ్నిపర్వ

తము పగుల హాహాకారమిడుచున్న నేను నీతో పరససల్లాపములాడుటకు వచ్చితి ననుకొంటివా ? కొడుకు మెడమీఁదఁ బొడిచినసవతికొడుకు తండ్రిని గౌఁగి లించుకొనివచ్చితిననుకొంటివా ? కరినోక్తులని విచారించుచుంటి వేమి ? నా మనస్సులో ఫిరంగిగుండు తగిలినప్పుడు నేను గట్టిగ మాటలాడఁగూడదా ? నేనుగావున నింతటితో నాఁగియుంటిని గాని నాకొడుకువలన నాసవతికొడుకు నకే యీదెబ్బతగులనీ ! ఆరాకాని యీసరికి నిన్ను నన్నుఁ గట్టఁగట్టి సము ద్రములోఁ బాఱవైచియుండదా ? నే నట్టిసాహసమున కసమర్థను. అందుచే నిన్ను యాచించుచున్నాను కావున నాతని కురిశిక్షయే తప్పకుండవిధింప వలయును. అతఁడు నాకొడుకుమృతిని సంకల్పించుకొనియున్నాఁడు అతని సంకల్ప మాతనికే తగులవలయును. అతఁడు బ్రదికి యెక్కడనుండినను నాపు త్రునిజంపక మానఁడు హత్యచేసినవానినే కాని చంపఁగూడదను ధర్మశాస్త్ర మెవఁడుచేసినది ? మన కాచట్టముతోఁ బనిలేదు. మన కిష్టమైనవారికిఁ బెట్టు కొందుము ఇష్టముకానివారిని జంపుదుము. అయినను నిన్నడుగువాఁ డెవ్వఁడు నీ వెవ్వరికి బాధ్యుఁడవు. సర్వాధికారము న్నప్పుడు చకచకలాడుచుఁ జప్పునఁ జంపక, సందేహించుచుండుటకంటె నర్పయోజకత యున్నదా ? అశక్తి యున్నదా ! విచారణ యక్కఱలేదు ఏమియు నక్కఱలేదు.

ఉద—అతఁ డేమిచెప్పుకొనునో రవంత వినవలదా ?

పార్వ—అతఁ డేమి చెప్పుకొనును ? అంతఃపురములోనికిఁ దాను రాలేదని చెప్పునా ? బాకు తనది కాదని చెప్పునా ! అదిగో చూడుఁ. నీయొద్దనే యున్నది. తాను బొడువలేదని చెప్పునా ? తాను లలితమీఁదఁ బడుటకు యత్నింపలేదని చెప్పునా? తాను బొడుచుచుండఁగా లలిత కుళల చూడలేదని చెప్పునా ? పెద్దకేకలతో నేను రాలేదని చెప్పునా ? మఱియొకసారి పొడిచెదనని యనలేదని చెప్పునా ? తన్నుఁ గారాగృహమున నుంపుఁడని భటులకు నీవాజ్ఞాపింపలేదని చెప్పునా ? ఊరక నీకు సందేహమేకాని యాతఁ డేమనిచెప్పును ? ఏమనిచెప్పుట కవకాశమున్నది ?

ఉద—అదే. అదే ఏమియుఁ జెప్పకపోయిన సరియే, ఏమి చెప్పునో వినకుండ శిక్షిం చుట లోకము సహించునా ?

పార్వ—అదే మీపెద్దలతిక్క. అదే కొసవెఱ్ఱి. లోకమున కిందుతో నేమిసంబంధ మున్నదయ్యా ? తంబలసందేహములు కాక పోయినయెడల లోకమున కిందుతో సంబంధము గంధలేశమైన నున్నదా ? ఇది మన గృహకృత్యములలోని వ్యవహారమయ్యెను. లోకమున కేమి ! లోకము మనకేమి పెట్టవలయునా పోయ వలయునా ? మనబాధ మనది వారిబాధ వారిది. ఆనడుమ మీతల్లిగారు పోయి నప్పు డామెకు ఉత్తరక్రియలు మీరు చేసినారా లోకము చేసినదా ? రవంత యాలోచించుకొననక్కఱలేదా ? ప్రత్యంశమునకు లోకముసంగతి చూచుకొన వలసియే యున్నయెడల నిఁక బ్రదికినవారమే. లోకమునకేమి ? మిమ్ము మకాఁకుఁ బొమ్మనినారు. పొండు మీకు రాజ్యమెందులకు మాకిచ్చివేయుఁ

మన్నారు. ఇచ్చి నెత్తిమీఁద ముసుఁగువైచికొని నడువుఁడు. లోకమఁట— మొదలు తుద లేనిమాట-అర్థము భావము లేనిమాట-ఇది యెక్కడ నేర్చుకొన్నారు? చాలుచాలు.

ఉద—ప్రజ లాతనియెడల ననురాగపూర్ణులై యున్నారు. ఆతనిని విచారింపకుండ శిక్షించునెడలఁ గొందఱైనఁ దిరుగఁబడవచ్చును.

పార్వ—ఏడ్చినారు. కోటబురుజులకుఁ గట్టించి ఫిరంగులచేఁ గొట్టించెదను. పిల్లికి దండమనియు, నెలుకకు దండమనియు నెంతకాలము వ్యవహారము చేయుఁగల మయ్యా. జరిగినన్నాళ్ళే యయ్యెను. పౌరుషముతో నిర్లక్ష్యముగాఁ జేసిన వ్యవహారమే వ్యవహారముకాని రైతుకుఁ జిత్తమని, రెడ్డికిఁ జిత్తమన్న వ్యవహార మేమి వ్యవహారమయ్యా? ప్రజలబెదరింపు లిక్కడ నేమాత్రము సాగవు. ప్రజలలో నున్న పరమతుచ్ఛస్వభావ మేదో చెప్పనా? ప్రజలు అతిమాలినకొలఁది బిఱ్ఱబిగియుదురు. ధర్మము చేసినకొలఁదియుఁ దిట్టుదురు. చేతులు జోడించుకొనకొలఁది నెత్తి కెక్కుదురు. జడిసినకొలఁది బెదరింతురు. వంగినకొలఁదిఁ ద్రొక్కుదురు. వారి బెదరింపులకు వారి హుంకారములకు లొక్కితే పరమ హంసక్రియ ఎదురుకొని వెనుకముందు చూడక గ్రుడ్డిత్రోవగ నుత్తరదక్షిణాల క్రింద నొక్కఁబెట్టు జేసినయెడల నిఁక నంతే. ఒక్కనిముస మగుసరికియొవని మట్టునకు వాఁడే తెల్లమొగము. ఎవనిమట్టునకువాఁడే లోఁక ముడుపు ఏమన్నది? కాకులమూఁక-కోతులమంద ప్రజలకు బెదరిన రాజెన్నఁడు బాగుపడ నేరఁడు కావునఁ బ్రజ లేమనకొందురో యనియెంచి సీకొడుకు నిటకు బిలిపించి యేమియు నడుగవలదు.

ఉద—అబ్బ! అలాగే ఆతని నిట కిప్పుడు పిలిపింపనులే. కాని కుళలను లలితను బిలిపింపుము.

పార్వ—వారుమాత్ర మెందులకు? వా రెఱిఁగిన దేదో నేను జెప్పితినిగాదా? వారును వలదు.

ఉద—అలాగునఁ గాదు. ప్రత్యంశమున కడ్డుపెట్టెద వేల? నీసెలవు ప్రకారము జగద్దేవు నిప్పుడేమియు నడుగనుగాదా? దాసుల నడుగుట కభ్యంతరమేమి? వీరు చెప్పునదైన వినకుండ నాతని నెట్లు శిక్షింపను?

పార్వ—నామాటలకంటె దాసులమాట లెక్కువా? దాసులు! పేరేగాని వట్టి తెలివి తక్కువపెద్దమ్మలు. నాయొద్దనే నోరు మెదలుపలేక గ్రుక్కిళ్లు మ్రింగువారు మీ యొద్ద మాటలాడఁగలరా? ఏమాట చెప్పఁబోయి యేమాట చెప్పుదురో?

ఉద—భయముచేఁ జెప్పిన పొరపాటేదో దుర్బుద్ధిచేఁ జెప్పిన యసత్యమేదో మనము సులభముగా గ్రహింపఁగలముకాదా?

పార్వ—ఏమో! ఏమి కనిపట్టఁగలవో నాకేమియుఁ దెలియదు. దాసులను విచారించుట మానివేయ గూడదా? ఈదినమునఁ గుళలకు వంతులేదు. లలితకేమో

యారోగ్యము సరిగ లేదఁట.

ఉద—ఏమి లేకపోయినను, ప్రాణమున్నయెడలఁ గోటలోనికి రావచ్చునుగదా? నేను బిలిపించెదను ఎవరక్కడ!

(నేపథ్యమున) మహాప్రభూ! ఏమి సెలవు?

ఉద—కుశలను లలితను బిలిపింపుము.

(నేపథ్యమున) చిత్తము మహాప్రభూ!

పార్వ—వారు వచ్చిన తరువాత నేను వారితో మాటలాడకుండ నీవు విచారింపఁదగదు.

ఉద—ఏమి మాట లాడవలయును?

పార్వ—ఏమున్నది? రాజుగారిని జూచి బెదరవలదని సత్యము చెప్పుఁడని చెప్పెదను.

ఉద—సరేకాని, దానికేమి. ఇప్పుడు నీ యుపపాదన మిదియే కాదా? లలితకు జగ వునకు సంబంధము. అది నిజమే కాదా?

పార్వ—నేను జూచితినా యేమి? నాకెట్లు తెలియును?

ఉద—ఇచ్చటికి మనము రాకముందు నీవు చెప్పలేదా?

పార్వ—చెప్పలేదని యిప్పుడుమాత్ర మందునా?

ఉద—ఇప్పుడు మాత్రమే కాదు. వెనుకఁగూడ నీవు చెప్పితివి? ఎప్పుడా! జగద్దేవుఁ డేకపత్నీవ్రతుఁడని నేననఁగ, నీవు నన్ను బుగ్గమీఁదఁ బొడిచి, లలిత నడుగుమని యనలేదా?

పార్వ—కాదని యిప్పుడుమాత్ర మంటినా?

ఉద—సరే! జగద్దేవునకు లలితకు సంబంధమనియు, దానికొఱ కాతఁడు కోటలోనికి వచ్చి సల్లాప మాడుచుండెననియు, నంతలో రణధవళుఁ డచ్చటికిఁ బోయెననియు, తన రహస్యము వెల్లడి యయ్యెనని కోపముచేతఁ గాఁబోలు జగద్దేవుఁడు రణధవళుని బొడిచెననియు నీ యుపపాదనము—ఇంతే కాదా?

పార్వ—నే నప్పుడు చెప్పిన దింతయే. నాకేమి మనస్స్థిమితతయా, మన్నా! వారు వచ్చినపిమ్మట నేదో వారు నేను గూడఁబలుకు కొన్నమీఁదట పిసలుపలుప వచ్చును. వారెప్పుడైన నిట్టిప్రారబ్ధ మెఱుఁగుదురా? ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్న యంశమున కెన్నిపాట్లు తెచ్చిపెట్టినావయ్యా! ఎంతసూటికార్యమున కెన్నివంకలు తెచ్చిపెట్టితివయ్యా!

(నేపథ్యమున) మహారాజా! లలిత వచ్చుచున్నది.

పార్వ—(ఎదురుగఁ బోయి, అప) లలితా! అది యేల రాలేదు?

లలి—(అప) స్నానము చేయుచున్నది కాఁబోలు. నే నెఱుఁగను.

పార్వ—(అప) ఇక్కడ మీకేదో క్షౌరము సిద్ధముగా నున్నప్పుడు దాని మొగము స్నానమేమి? తరువాత నేకముగా మృత్తికా స్నానములు జేయఁగూడదు! రాజుగారేమో నిన్ను విచారింతురఁట. ఏమి యెఱుఁగుదువు?

లలి—(అప) ఏమున్నదమ్మా? ఏదో మాయోపాయముచేత జగద్దేవుని బాకును సంగ్రహించి నాయొద్దఁ బెట్టుకొని యక్కడ కేర్పాటు ననుసరించి వచ్చి రణధవళునికి దెబ్బ తగులకుండ నతనియంగరక్షలో మెడప్రక్కనుండి యాబాకును బెట్టుమని మీసెలవైనదని నాతోఁ గుశల చెప్పినది ఆప్రకారమే చేసితిని అంతకంటె నేనేమియు నెఱుఁగను

పార్వ—(అప) సరే! ఈమాటలు మహారాజుగారికిఁ దెలియవలసినవి కావుగదా?

లలి—(అప) ఆమాత్ర మెఱుఁగనా?

పార్వ—(అప) నీకును జగదేవునకును సంబంధమున్నదా యని రాజుగారడుగ నేమని చెప్పెదవు?

లలి—(అప) ఏమని చెప్పుమందురు?

పార్వ—(అప) నీకు నాతనికి సంబంధ మున్నదనియే నేను జెప్పితిని సుమా?

లలి—(అప) నేనునట్లుచెప్పెదను. అట్లు చెప్పకున్న యెడలఁ జిక్కున్నది. ఈ హార మాతఁ డిచ్చినది మెడలో వైచుకొంటిని. ఇది జగద్దేవునిదని రాజుగా రెఱుఁగుదురేమో? అదిగాక రణధవళు నాతఁడు పొడుచుట కీ శృంగారసంబంధమైన యసూయయే కారణమని తేటపడ లనియున్నది కదా.

పార్వ—(అప) అందులోఁగూడ నొక చిక్కు కనఁబడుచున్నది రణధవళునితో నీకు సంబంధ మేమని నిన్ను తెంపపైఁ గొట్టునేమో. అందుపై మఱి యేసంగతి కదలునో? ఎందులకైన మంచిది, ఈహారమును రైకలో దాఁచుకో (తనలో) హా! మనస్సుకలఁగుఁడునొంది యున్నది.

లలి—(అప) అయ్యయ్యో! రాజుగారు నా మెడగనుకంటె హారమునే ముందు చూచినారు ఇప్పుడు దాఁచుట యేలాగు?

ఉద—దేవీ! లలితతో నీవు మాటలాడుట పూర్తియైనదా?

పార్వ—మాటల కేమున్నది? అడిగినప్రశ్న మేదో బాగుగాఁ దెలిసికొని నిదానించి ప్రత్యుత్తర మిమ్మనియు, దొట్రుపాటు పడవలదనియుఁ జెప్పుచుంటిని మహారాజా! ఈమెను బుజ్జగించి నిమ్మళముగా బోధించి మఱి యడుగుఁడు.

ఉద—లలితా! నీ కాముత్యాలహార మెచ్చటినుండి వచ్చినది?

పార్వ—అదిగో! ఆప్రశ్నము మీ కెందులకు? అది దాసి. దాని తగులాటములు—దాని సంపాదనలు మనమేల తెలిసికోవలయును? ఇది మఱింత బాగుగా నున్నదండోయి ఎవ్వఁ డెప్పుడే మేమి యిచ్చినాఁడో యీ యాసామివారిలెక్క మన కెందులకయ్యా? ఇవేమి యాస్థానపుచిత్తాలా, ఆవర్జాలా?

ఉద—అబ్బ! దాని నడుగుచుండగా నీవు చెప్పెద వెందులకు?

పార్వ—నా దాసి నడుగుచున్నప్పుడు నేను జెప్పక యూరకుందునా? ఇది మఱింత చిత్రముగా నున్నదండోయి.

ఉద—దేవీ! దయయుంచి నీవు రవంతసేపూరకుండుము.

పార్వ—హారమునుగూర్చిన ప్రశ్నమాత్ర మడుగవలదు.

ఉద—ఎందులకడిగితి ననఁగా:—ఆమౌక్తికహారము జగద్దేవునకు నేనిచ్చినది. దీని కెట్లు వచ్చినది? లలితా! దాని నిటు తెమ్ము చూచెదను.

పార్వ—ఈయకే

ఉద—లలితా! నీవు దానిని నాచేతి కిచ్చుటకు సందేహించుటవలన నది జగద్దేవుడుఁ నీకిచ్చినట్లు స్పష్టపడుచున్నది. నీకును జగద్దేవునకును సంబంధమున్నది కాదా?

లలి—(తల వంచుకొని సిగ్గు నటించును)

ఉద—(విసుగుతో) ఇది కోటలోనే సరసమారంభించినదేమి?

పార్వ—అది యెంతవిశ్వాసవంతురాలో మీ రెఱుఁగుదురా? మన కోట తన సొంత కొంపలాగునఁ జూచుకొని నాబొందిరయో యని ప్రాకులాడుచున్నదే అట్టి కృతజ్ఞురాలినిఁ గాంచి సంతోషింపక దానిని నిందింతురేల? మంచి సరసము గానే యున్నది లెండు

ఉద—పరమపవిత్రమైన యంతఃపురభాగమునం దిది యీదుర్నయ మొనర్చినందులకు దీనిని ముందుగా శిక్షింపవలసియున్నది

పార్వ—ఆ! ఆ! నీకొడుకు నాకొడుకుగొంతు కోయఁ బ్రయత్నించిన తప్పుకంటె లలిత యేదో యెక్కడనో చేసినతప్పు నీకంటి కెక్కువగాఁ గనఁబడుచున్నదా? అందుచే శిక్షకంటె నిందుకు శిక్ష ముందుగా జరుగవలసియున్నదా? పాపము! పాలుమాలకుండఁ బనిచేయుచానిసలు. వారికిఁ గోటయే సమస్తమునకు నాధారము కాదా! నరఘాతుకుఁడై, భ్రాతృఘాతుకుఁడై, వంశవినాశకుఁడై దుష్టాధమాధముఁ డైన కొడుకు తలపై వెంద్రుకనైనఁ గదల్చుటకు శక్తిలేక కాళ్ళు పట్టుకొనుచు సెంగిలిమెదుకులు దిని మనల సేవించుచుఁ గఱకుమొఱకు లేని వట్టి జావకడి దానిముండను సంహార మొనర్చుటకు సన్నద్ధుఁడవైతివా? పొక్కు లేనిచోటఁ బుండుపుట్టించి యేమెరా యున్నదో లేదో కొట్టుగింజను గుమ్మడికాయను జేసి, దోమమీఁదికి దండయాత్ర బయలుదేఱితివా? వీరాధివీరుఁడవు! నాదాసి శిక్షార్హురాలే యైనయెడల దానిని నేను శిక్షింపవలయును గాని మీరేల శిక్షింప వలయును? మీరు దాని నేమియు ననఁదగదు (లలితవంకఁ దిరిగి) పొగరు బోతా! నీగొంతుగోయ. (లలితకాలిపైఁ దన్ని) పో! యింటికిఁ బో! అంతః పురములో నాదుర్మార్గునితో నీకు మాటలెందులకు? (అప) డాబుకొఱకుఁ దన్నితిని మఱి యేమియు ననుకొనకుము కెంపుల దుద్దులం రేపిచ్చెదనులే.

లలి—అమ్మా! నేను మాటలాడలేదు ఎగిరి యెగిరి వచ్చి యాతఁడే నన్ను బలాత్కరించినాఁడు.

పార్వ—అమాట మొదటనే యేడువలేకపోయినావా? నాథా! చూచితిరా ఏమి చెప్పుచున్నదో?

ఉద—నీకది రంభారావణీయమైనయెడల నాతనిహారమేల గ్రహించితివి ?

పార్వ—మాటమీఁద మాట ఉఊ యుక్తిమీఁద యుక్తి అంతేకాని కష్టము సుఖము సంగతి సందర్భము, వీలు సాలు యోజింపనక్కఱలేదేమి ?

లలి—మొదట బలాత్కారముమాట నిజము. కాని తరువాత నాకుఁగూడ నిష్టమయ్యెను.

పార్వ—నీ మొగము నీమోర. నడునడు (అని త్రోసివైచుచున్నది)

ఉద—అదేమి? దానిని బంపివైచితి వేల ?

పార్వ—ఇంకను బరీక్షింపవలయునా ? ఈ మాత్రపుఁబరీక్షకే యదియెంత తలక్రిందయినదో ? రవంతసేపు బలాత్కార మనినది రవంతసే పిష్టమనినది నేను దగ్గఱ నుంటిని గావున నీమాత్రపు వ్యత్యాసముతోనైన సరిపుచ్చినది కాని లేని యెడల రణధవళుని నేనో, కుశలయో పొడిచినారని కూడఁ జెప్పును. అంత మాత్రపువ్యక్తిగల పెద్దమ్మ. సరే, యిఁక దీనిని మించిన మృగస్వరూపమా కుశల! బలిబొమ్మలాగునఁ బైకి భీకరముగాఁ గనఁబడుటయే కాని వట్టి నడిమివెలితి ముండ నేను గావున నొడ్డుపెట్టుకొని దినములు దొరలించుచున్నాను.

ఉద—ఇఁకఁ గుశలను బరీక్షింపనక్కఱలేదా ?

పార్వ—ఎవ్వతెను గూడ నక్కఱలేదు. దీనిలోఁ బరమార్థ మొక్కటియే యున్నది అది సాక్ష్యములవలనను, జట్టములవలనను నిర్ణయింపఁదగినదికాదు అది నీకుఁ దెలియును నాకుఁ దెలియును. లోకమునకంతకును దెలియును. ఋజువు మాత్రముకాదు. తనకొడుకును దనకోడలిని దన్నుఁ గోటలో నేదో మూల నొక చిన్నకుటీరమునఁ బడవైచి నేనిక్కడ మహాంతఃపురములో మహైశ్వర్యముతో మగనిని వశపరచుకొని దాసీగణముతోఁ గులుకుచుఁ గులుకుచుఁ దూఁగుటుయ్యాలలో నూఁగియూఁగి యెగిరియెగిరి చుక్కలను దన్నుచున్నా నని నాసవతి కన్నులలో నిప్పులు పోసికొనుటచే నామె యింత చేయించినది నేనిక్కడఁ గ్రుళ్లిక్రుళ్లి యేడ్చుచున్నాననుసంగతి యామెకుఁ దెలియదు. నాకొడుకును—

ఉద—నీమాట కడ్డమువచ్చితిని. నీవు చెప్పునదేదియో గ్రహించితిని. కాని నే నొక్క మాటఁ జెప్పుచున్నాను, గోపపడవుగద?

పార్వ—కానిండు.

ఉద—నేను నీకు సర్వదా విధేయుఁడను. నీయభిప్రాయమే నాకు శాసనము. మన మొంటరిగా నున్నప్పుడు నీవు నన్నెంత దూషించినను, నేను చేతులు జోడించుకొనియే యున్నాను. ఇంతకు ముందు నీవు దానియెదుట నన్నడ్డమైన చీవాట్లు పెట్టినావు. నామనస్సునకుఁ గష్టముగా నున్నను సహించినాను. పై వారేమను కొందురో?

పార్వ—నాకు స్వతంత్రతగనుక—నాకు సర్వస్వేచ్ఛగనుక—నా మగనిని నాయిష్టము వచ్చినట్లనుకొందును. ఆజ్ఞ పెట్టుకొందును. పై వారేమైన ననుకొనిన యెడల మూఁతిమీఁదఁ గొట్టెదను. నోరు క్రొవ్వకపోయినయెడలఁ బైవారనుకొనుట యెందులకు?

ఉద—సరే. నీయిష్ట మెటులో యటులే తరువాత నేమిచెప్పెదవు?

పార్వ—ఏమున్నది? నాసవతి తనకొడుకునకు బోధించి బాకిచ్చి కోటలోనికి బంపినది. అతఁడు నాకొడుకును బొడిచినాఁడు నడుమ నాతఁడు లలితను జూచెనో లేదో తెలియదు. చూచినను జూడకున్నను మనవ్యవహారమునకది సంబంధములేదు.

ఉద—జగద్దేవుఁడే పొడిచెనని నీనమ్మకమా?

పార్వ—నేను బొడిచితినా యేమి?

ఉద—జగద్దేవుఁడే పొడిచినయెడల రణధవళుఁడు కాఁడుగదా రాక్షసుఁడైనఁ బ్రతుకునా? ఆతఁడెంతబలాఢ్యుఁడు! ఎంత కత్తిగరిడీ నేర్చినవాఁడు! ఎంత సూటియైన వ్రేటుగలవాఁడు అదిగాక మెడపట్టి యెత్తిగించి నిమ్మళముగా ఛిద్రముగా బాకులోనికిఁ జేర్పఁబడినట్లున్నది. కాని పోటులక్షణము అచ్చట నమ్మిన నున్నవా! ఇంతకును మెడమీఁద పోటేమి? రెండు రెక్కల నడుమను గీలుకొనిపోవుటయేమి? ఆశ్చర్యముగ లేదా?

పార్వ—అటులైన నీయభిప్రాయమేమి?

ఉద—నాకేమియుఁ దెలియ—కుండ—నున్నది.

పార్వ—కావున నేనొక్కమాట చెప్పుచున్నాను విను. నీకు నామాటయందు విశ్వాసములేదు నేనింతకాలము నీకూడిగము చేసినను నీకు నాయందునమ్మకము కలుగలేదు ఎన్నిసంవత్సరము లెడఁబట్టినను మగవానికిఁ బెద్దభార్యయందుఁ బ్రేమపోదు. రెండవభార్య యందలిప్రేమ పాలపొంగువలె బుస్సునపొంగి వెంటనే చల్లారిపోవును ద్వితీయభార్యసుఖములో భౌతికపుగత్తెయేకాని పారమార్థిక గంధములేదు భగ్గునమండినను నిది తాటాకుమంట మినుకు మనునప్పటికి నది చక్కనిచుక్క రెండవభార్యయెన్ని సేవలొనర్చినను బెద్దభార్యయే మంచిదోయి యనియేడువని రెండవ పెండ్లివాఁడిదివఱకు లేఁడు. ఇఁకముం దుండఁబోఁడు. మగవానికది పుట్టినను బుట్టినబుద్ధి. ఈసంగతి నాకిప్పటి కనుభవము లోనికి వచ్చినది అందుకంటె నేనధికురాలనని యాసపడితినిగాని నాగొంతు చల్లనికత్తితోఁ గోసి నన్ను దిక్కుమాలినదానివలెఁ బెంటపైఁ బారవైచినావు. ఇఁకఁ జాలు! మహారాజా! నీకు నాకు నింతవరకే చాలును. నీవు నాసవతి తోడనే సుఖముగనుండుము. నమస్కారము. నేను బోవుదును.

ఉద—(పట్టుకొని) నీసవతియందు నాకనురాగములేదులేదు. భగవంతునివెంగను చూచి చెప్పుచున్నాను. ఆమెను బూర్తిగా వదలుకొని యెన్నిసంవత్సరములో యైనది. జగద్దేవునియందుఁ గూడ నాకులేదు లేదు. నీవు నాపైఁ గోపించిన యెడల

నే నేమి కావలసియున్నది! నీవెక్కడకుఁ బోయెదవు? నిన్ను సర్వదా యనుసరించి యుండుటతప్ప నాకుఁ గర్తవ్యమేమున్నది! నీవెక్కడకుఁ బోయెదవో నన్నుఁగూడ నక్కడకే తీసికొనిపొమ్ము.

పార్వ—సెబాస్ ప్రాణనాథా! ఇంతకాలమునకు దయగల్గిన మాటనాడితివి. ఇదిగో నీకాళ్ళపైఁ బడుచున్నాను. నాప్రార్థన మాలింపుము. నేనొక్కకొడుకును బెట్టుకొని బ్రతుకుచున్నాను. వాఁడైన వెఱ్ఱివాఁడు. ఏ వెఱ్ఱివాఁడైనను వాఁడు బ్రదికి బాగుగా నుండుటకంటె నాకుఁ గోర్కెలేదు వాఁడు నీ రాజ్యమేలవలయునని నేనేడ్చుచుండుటలేదు. వానిచేతిమీఁదుగా నాఘటము వెడలిపోవలయునని నేను మ్రొక్కుకొనుచున్నాను. కాని యట్లు జరుగనేరదని గుండెలు కొట్టుకొని యేడ్చుచున్నాను.

ఉద—ఏల?

పార్వ—ఏలయందువేల? నాసవతి నాకొడుకును బ్రదుకనీయదు మహాప్రభూ! జగద్దేవుఁ డాతనిని దఃపొట్టఁ బెట్టుకొనుట నిశ్చయము. నిశ్చయము. నాకీముప్పు రాకుండ నన్నావలికిఁ బిల్లవానితోఁ బోనిమ్ము. ఏపల్లెటూరనో సేకాయ గసరుతోనో పొట్టపోసికొని వాఁడు బ్రదుకును. వానికి సింహాసనమక్కరలేదు. నాకు రాజ్ఞిత్వమక్కరలేదు. రాజ్యములేనివారు చచ్చిపోవుచున్నారా! ప్రాణమున్నఁ జాలును. నే నెక్కడికిఁ బోయిన నాతో నీవుకూడ వచ్చెద నని చల్లనిమాటలాడితివి అందులకే మహానందమయ్యెను కాని నీవిక్కడనే యుండుము నాతో రావలదు. నీవు నాకుఁ బ్రభుఁడవు నిన్ను భగవంతునివలె నే నింతవరకు నారాధించితిని. ఇఁక నీకును నాకును ఋణసంబంధము తీరిపోయినది నీకును బ్రభుఁడైన పరమేశ్వరుఁడే నాకింక శరణ్యుఁడు. కాషాయాంబరధారినై శేషకాలము గడపెదను నాకుఁ బ్రపంచసుఖములన్న మొదటనుండియు రోఁత నీవు నన్నుఁ గట్టుకొనుటచే నిఁకఁ దప్పదుగదాయని యింతకాలము సంసారమున నుండవలసి వచ్చినది. నీకు లోపములేదు. ఇంకొక భార్యయు నింకొక కొడుకు నున్నారు. జయా పరమేశ్వరా యని నేను బోయెదను కఱ్ఱవాని నిక్కడకుఁ బంపెదను కడపటిసారి నీవాతని నాశీర్వదించి పంపుము. నన్ను వదలుము. (పోఁబోవును)

ఉద—నీవేల పోవలయును, వారే పోవుదురులే

పార్వ—జరుగరానిమాట లేల చెప్పెదవు! జరుపలేనిమాట లేలయాడెదవు? వారు పోరు.

ఉద—జరుపలేకపోవుటగూడనా? అందులో నీసెలవైనప్పుడిఁక నడ్డున్నదా?

పార్వ—నాసెలవనకుము. నీయిష్టము.

ఉద—పోనీ! నాయిష్టమే. వారిని రేపే పంపెదను.

పార్వ—రేపా? హు. రేపులోపలఁ బదనాల్గుమార్పులు జరుగును ఎందులకు వచ్చిన మాట?

ఉద—ఇదిగో! ఈఖడ్గముతోఁ బ్రమాణము చేయుచున్నాను-రేపే—

పార్వ—సరే, నేను నాపిల్లవాడును సుఖపడుదుము. అదిగాక వారు పోవుట నీకుఁ గూడ మంచిదే పశువు వరిచేనిలోఁ బడుటకెంత యాత్రపడునో, నీసింహాసన మెక్కుటకు జగద్దేవుఁ డంతయాత్ర పడుచున్నాఁడు నాసవతి ప్రోత్సాహమున వాతఁడు నిన్నుఁ జంపునేమో యని నాకు భయమున్నదికాని లేకపోలేదు. పోనిండు. ఇకఁ గొంకకాలపైన నైదవతనమునఁ గాలక్షేపము చేసెదను. ఈలోపలనే నేవెడలిపోవు నెడల మఱింత యదృష్టవంతురాలను. ఇఁక నేను బోవుదును. సాయంసమయ మైనది. లక్ష్మీపూజవేళ యైనది. (పోవును)

ఉద—రెండవపెండ్లిచేసికొను నిర్భాగ్యులలో మొదటిభార్య కొడుకు నింటనుండి గెంటివేయుట యెవనికిఁ దప్పినది! చిన్నసంసారమేమి? పెద్దరాజ్యమేమి? కుటుంబ సంబంధ వ్యాపారములన్నియు నొక్కటే. చిన్నసంసారమందైన చిన్నయల్లరి. పెద్దరాజ్యమందైనఁ బెద్దగోల. ఇదియే భేదము ఈయప్రతిష్ఠకు నింక నితరాప్రతిష్ఠలకుఁ దల యొగ్గినవాఁడే రెండవసారి పెండ్లిపీఁట మీఁదికి సిద్ధపడవలసినది. అట్లు సిగ్గులేక తలయొగ్గిన నేనిప్పుడు దవుడపండ్లు రాల్పుఁదగిన లెంపపెట్టున కేల సిద్ధపడి యుండక తప్పును! కాని అందరతోపాటు నేనును,

ఆ. వె చావునందుఁ బ్రజకు ♦ జననాథునకును వ్య
త్యాసమేమి గలుగ ♦ దనిరి బుధులు
చావునందెకాదు ♦ జీవించుతఱిఁగూడ
భేద మింతయైన ♦ లేదు లేదు.

గీ. కొలఁదిసంసారమందలి ♦ గోచిముల్లు
క్రుమ్ములాట లసూయలు ♦ కుంపటులును
సార్వభౌముని విపుల సం ♦ సారమందుఁ
గూడ నుండు సరిగ నచ్చు ♦ గ్రుద్దినట్లు
కాని కవివర్యులు చరిత్ర ♦ కారు లెపుడు
ప్రభులచరితంబులే యేర్చి ♦ గ్రంథములుగ
జేసి ప్రకటించి యల్లరి ♦ చేయుచుంద్రు
వారి నేమిచేసినను బా ♦ పంబు లేదు.

(నేపథ్యమున) మహారాజా! కుశల వచ్చియున్నది.

ఉద—లోనికిఁబంపుము (కుశల ప్రవేశించును.)

కుశ—మహారాజా! మ్రొక్కుచున్నాను.

ఉద—కుశలా! ఇంతయాలస్యముగ వచ్చితివేల?

కుశ— మీవార్త వచ్చినప్పుడు నే నింటియొద్ద లేను. స్నానముచేయుచున్నదని మాతల్లి యేమో చెప్పినదఁట.

ఉద—అటులైన నీకు దారిలో లలితకనఁబడి యేమియుఁ జెప్పనేలేదా ?

కుశ—లలితను నాకొఱకుఁ దిరుగఁ బంపితిరా ? లలితను నేను జూచి చాలసేపైనది. అది యంతఃపురములో నున్నట్లిప్పుడు గుమ్మము నొద్దనే తెలిసినది.

ఉద—సరేకాని నీ వాచాటునకుఁబోయి రాణిగారుగాని యామె పరిచారికలుఁగాని సమీపమున నెవరైననున్నారేమో కనుఁగొనుము.

కుశ—(చూచివచ్చి) ఎవ్వరులేరు. రాణిగా రిప్పుడు పూజలో నుందురు. లలిత రణధవళుఁడు బాబుగారికి భోజనము చేయించు ప్రయత్నమున నుండును మిగిలిన దాసులు బట్టలుమార్చుకొనుట కింటికిఁ బోయెదరు. ఇప్పు డెవ్వరు నిక్కడకు రారు ఏమయ్యా! చీఁకటి పడిన పిమ్మట నన్ను రమ్మనినారు ?

ఉద—నీతోఁ బనియుండియే రమ్మంటిని నీవు దగ్గఱగరమ్ము.

కుశ—(సిగ్గుపడుచు ముసిముసినవ్వులు నవ్వుచు) మీయిష్టము వచ్చినంత దగ్గఱగ వత్తును. రానా ? నేను మరచిపోవుదునా ? ఏనాటిసుఖమో—మూఁడేండ్లనుండి యొక్కసారి నా మొగముఁ జూచిన పాపమునఁ బోయితిరికారుగదా ! ఎంత దాసివారమైనను మేము రాతిబొమ్మలమా ? మాకుఁగూడ మమకారముండునని యెఱుఁగరా ?

ఉద—(తనలో) అరరే నేను దీనినిదిరుగ నపేక్షించితినని యనుకొనుచున్నది కాఁబోలు.

గీ. కలుష రక్తంపుమచ్చ సుగంధినడఁగు
సవితృజపమున శ్వేతకుష్ఠమునశించు
పుట్టుమచ్చ యెగిరిపోవుఁ గిట్టువెనుక
చెనటి సరసంపుమచ్చ చచ్చిననుబోదు.

ఇది యాబాకుపోటురహస్య మేమైనఁ జెప్పనేమో. వెనుక వినిపించి విసర్జించిన విటపాత్రమును దిరుగ రవంతసే పభినయింతును. (ప్రకాశముగా) కుశలా ! మూఁడేండ్లనుండి మరల నిన్ను జూడనిమాట నిశ్చయమే. రాజ్యవ్యవహారము లందుఁ దెరపి తక్కువ కుటుంబవ్యవహారములందుఁ గలతలెక్కువ. నీ వెఱుఁగని దేమున్నది ? రాణిగారు బహుజాగరూకతగలవారు.

కుశ—రాణిగారి భయముచేతనే యింతకాలము నేను మీయొద్దకు వచ్చుటకు సాహసింపలేదు. ఏమైననేమి ? ఈమూఁడు సంవత్సరములనుండి యథశ్శయన బ్రహ్మచర్యవ్రతములు సల్పుచున్నాను.

ఉద—(నవ్వి) అధశ్శయనబ్రహ్మచర్యవ్రతములే ! ఆఁ ! అటులైన నీ నడుమనుగలిగిన సంతానముమాటయేమి ?

కుశ — మనస్సు చేతనయ్యా! మనస్సు చేతనయ్యా? పనికి మాలిన శరీరము లెట్లు తగులఁబడి పోయిననేమి? ఈశరీరములనే నమ్ముకొనుటయంత పామరత్వము వేఱొకటి యున్నదా?

ఊద — అటులైన నీపాతివ్రత్య ధర్మమునకు లోటులేదని స్థిరపరచితివా? సంతోషమే! చూడు కుశలా! నీయందు నాకుఁగల చనవును బురస్కరించుకొని నేను నిన్నొకసంగతి నడిగెదను చెప్పెదవా?

కుశ — ఏసంగతియయ్యా?

ఊద — రణధవళుని మెడప్రక్కనుండి జగద్దేవుని యీబాకు లోనఁజొనిపినవారెవరు? నీవా? లలితయా?

కుశ — సరిసరి. మహారాజా? నాకెట్లు తెలియును? నేను రాణిగారికాసుకోళ్లకుఁ దవిటి యుండలు చేయుచున్నాను. ఇంతలోఁ బ్రక్క నేడ్పు వినఁబడినది. చేతిలో పనివిడిచి పరుగునఁబోయి చూడఁగ బాకు రణధవళుని మెడపైనున్నది ఆతఁడు విలవిలలాడుచున్నాఁడు. జగద్దేవుఁడు ధవళబాబును బొడిచినాఁడని కేకలు వైవగ—

ఊద — ఆసంగతియంతయు నాకక్కరలేదు జడచుట్టలో మొగలిరేకు భద్రముగాఁ బెట్టినట్లున్న యాపని యాఁడుది చేసినదనియే నిశ్చయింపవచ్చును. లలితచేసినట్లు నీవొప్పుకొందువా?

కుశ — నేను జూడలేదు.

ఊద — నీవు చూడలేదుతే. అట్లు లలిత చేయవలసినదనియేనా యంతకు ముందటి యేర్పాటు?

కుశ — నాకుఁ దెలియదయ్యా, లలిత నాతోఁ జెప్పి చేయునా యేమి? రాణిగారు నా గొంతుఁగోయుదురు ఏమనిచెప్పను? చెప్పకపోయిన యెడల మీరు నన్ను జంపుదురు.

ఊద — నేను నిన్నేమియు శిక్షింపను. నీవు నాతో నీరహస్యమును జెప్పితివని రాణిగారితో నేను జెప్పను ఇఁకభయమేమి!

కుశ — మహారాజా! ఇంతకంటెఁ గావలసినదేమి? ఇదిగో అమ్మగారికిఁ జడబిగించుట వలన వ్రేళ్లెట్లు కాయలుకాచినవో. నిలువుటద్దము పగులఁగొట్టితినని యామె కొరడాపుచ్చుకొని కొట్టినప్పటి మచ్చ యిదిగో. వెండిచెంబు నేనెత్తుకొనిపోయితినని —

ఊద — అబ్బా! ఈగొడవయంతయు నాకెందులకు? నీ వెఱిఁగినదేదియో దాఁచకుండ నాతోఁజెప్పుము

కుశ — నామీఁద మీకు మునుపటిలాగుననే యున్నదా? నిజముగానే యున్నదా? నిజముగానే! నాతోడే?

ఊద — త్వరగఁజెప్పుము.

కుళ—అమ్మగారిపై ద్రోహమైనమాట పైకిఁ జెప్పుట నాకిష్టముకాకపోవుటచేతఁ జెవిలోఁ జెప్పెదను.

ఉద—సరే! ఇందులోఁగూడ రవంతనియమమా! ఏమియు మిగుల్పకుండ నంతయుఁ జెప్పుము.

కుళ—(చెవిలోఁజెప్పుట నభినయించును.)

ఉద—సరే! అనుకొనినదంతయుఁ జెప్పితివి కాని రాణిసెలవుపైన లలిత తనవెంట రణధవళుని త్రిప్పుకొనుచున్నదని చెప్పితివి? నాకు బోధపడలేదు అదియేమి?

కుళ—స్త్రీశరీరస్పర్శను తగిలినగాని చిన్నబాబుమనస్సు వికసింపనేరదని యోజించి యాతనిని శృంగారకాండలో రవంతమలుపుటకు రాణిగారు లలిత కేర్పాటు చేయించిరి నన్నే యీపనికి మొదటఁ బూనుకొనుమనిరి. కాని నేను ధవళబాబునకుఁ దగ్గివరుసదానగుటచేఁ దప్పించుకొంటిని (తనలో) నేనే లలితనాతని కంటఁగట్టితినని చెప్పగా నీ రవంతదయయుఁ బోవునేమోయని యమ్మగారిమీదనేఁ ద్రోచివైచితిని.

ఉద—(ముక్కుమీఁదఁ జేయివైచుకొని) పిల్లల మనోవికాసమునకుఁ బ్రపంచజ్ఞానసంపాదనమునకు నీ క్రొత్తకల్పన మీనాఁడు కలిగినదా! ఓసీ! నీగొంతుఁగోయ! రవంతయైనఁ దెలియనిచ్చితివి కావేమి?

కుళ—ఇది మీవఱకు రావలసినయంశము కాదనియు నిందులో మీసంబంధ మేమాత్రము లేదనియు నమ్మగారు సమర్థించిరి. అదిగాక గురువులని, పండితులని, కవులని యెవరెవరినో పెట్టి మీపాట్లేవో పడనేపడినారు. అది చిన్నబాబున కేమియు నుపయోగింపలేదు అందుకొఱ కమ్మగారు ఋశ్యశృంగచరిత్రము నాధారముచేసికొని యందు కింతకంటెఁ బరమహంసక్రియ లేదని యీలాగున సెలవిచ్చినారు.

ఉద—నీ పిండకూడు. అమ్మగారు సెలవిచ్చుట, నీ వాచరించుట నీగొంతుఁగోయ.

కుళ—మమ్మేమి చేయమందురు బాబూ?

ఉద—సరే నీవుపొమ్ము. (కుళ నిష్క్రమించును)

ఉద—హా! ఎంతదురవస్థ!

గీ. వార్ధకమువచ్చె దైహిక ♦ పటిమతగ్గ
మనసులోని బింకముకూడ ♦ మఱలిపోయెఁ
బైకి రాజుగాఁ గానంగఁ ♦ బడుదుఁ గాని
బానిసలకంటె బానిస ♦ నేనె యకట!
రవలమకుటంబు శిరముపైఁ ♦ బ్రబలుగాని
దీనిక్రింద నెయున్నది ♦ దేవిమొట్టు,

హృదయమున రాజనీతి శో ♦ భించుఁగాని
దీనిపై నంత గ్రమ్మెను ♦ దేవిభీతి
చిత్తమున రాణి తర్జని ♦ చివుకుమనఁగ
కనక వేత్రంబు లిటునటు ♦ గ్రాలనేమి ?
ఆలిదయకు దాసినిబతి ♦ మాలుచుండ
నరివిభులు చరణాక్రాంతు ♦ లైననేమి ?
పందికెదురై పోడుచువాఁడు ♦ బంటుకాఁడు
పరశతఘ్ని డాసినవాఁడు ♦ బంటుకాఁడు
వరదకెదురీఁదు మానిసి ♦ బంటుకాఁడు
భార్య నాజ్ఞలోఁ బెట్టిన ♦ వాఁడె బంటు
గజమునకుగోయి చేఁపకు ♦ గాల మశ్వ
మునకుఁగళ్ళెము త్రాఁచుపా ♦ మునకు మంత్ర
మనిల జలశుద్ధి యఖిలరో ♦ గావళికి ద్వి
తీయ భార్యకేమున్నదో ♦ తెలియఁబడదు
గూడుచేరిన పక్షియు ♦ గునుకువెట్టు
గుహనుజేరిన మృగమును ♦ గుఱ్ఱుపెట్టు
నింటిలోకంటె నెమ్మది ♦ యెటను లేదు
అదియె సున్న రాజేంద్రుఁడ ♦ నైననాకు ;
అంతలో బుద్ధివచ్చిన ♦ యట్టు లుండు
నంతలో బుద్ధి దిగిపోయి ♦ నట్టులుండు
శీతపిత్తజ్వరముచేతఁ ♦ జిక్కుపడెడు
వాని గాత్రంపువేడిమి ♦ పగిదిగాను
లేదు పైచేయి పైమాట ♦ లేదు రమ్మ
నంగ వత్తును మఱి పొమ్మ ♦ నంగఁ బోదు
భిక్షుకునిచేతిలోఁ గోతి ♦ విధముగాఁగ
పొలఁతికిని బూత్రిగా లొంగి ♦ పోయినాఁడ
మల్లరణమున జితుఁడైన ♦ మల్లవీరుఁ
డెప్పటికినైన జయముచే ♦ నొప్పఁగలఁడు

మొదటితంత్రలమేళము ♦ బెదరుమనుజుఁ
డెప్పటికినైన సుస్వర ♦ మీయఁగలఁడు
సృష్టి మెత్తన గఱుకని ♦ చెప్ప మనుజుఁ
డెప్పటికినైన రంగులు ♦ చెప్పఁగలఁడు
గాని భయమున సతిదాసుఁ ♦ డైన మనుజుఁ
డెప్పటికి నైన మఱల రే ♦ కెత్తలేఁడు

నాగతి యిట్లైనది ఇఁకముం దింతకంటె నెట్లుచెడునో అంతకంతకు దీఁతసే కదా, కానీ! ఏమికావలసియున్నదో? చేసికొనిన దానిఫల మనుభవింపక తప్పునా?

(నేపథ్యమున)

మహారాజా! భోజనసమయమైనది. అమ్మగారు పూజపూర్తిఁజేసి వేఁచి యున్నారు. దయచేయుదురుగాక

ఉద—ఈరాత్రి యింతశీఘ్రముగానే భోజనమేమి? అయినను వచ్చుచున్నానని చెప్పుము.

(నేపథ్యమున) చిత్తము.

ఉద—పెందలకడనే భోజనమొనర్చి పండుకొనినఁ గాని యుదయమున మెలకువ రాదేమో? కొడుకుతోఁ గోఁడలితో సవతికి రేపుదయమునఁ జరుగఁబోవు పట్టాభిషేకమహోత్సవము చూచుటకు వలనుపడదేమో యని రాణి యాందోళనపడుచున్నది కాఁబోలు ఎవరక్కడ?

(నేపథ్యమున) చిత్తము.

ఉద—తనతల్లితో భార్యతోఁ గలసి రేపుదయముననే జగద్దేవుని నాయొద్దకు రమ్మని నేను గోరితినని వానితోఁ జెప్పుము తెలిసినదా? ఈబాకాతని కిమ్ము. (బాకావలకు విసరును.)

(నేపథ్యమున) చిత్తము మహాప్రభూ!

ఉద—సరే! పొమ్ము.

(నేపథ్యమున) ఇంకను రాలేదని యమ్మగారు తొందరపడుచున్నారు.

ఉద—(తనలో) అయ్యగారి యశక్తినిబట్టియే యమ్మగారితొందరయు నుండును.

(నిష్క్రమించును)

శ్రీరామ.

# వీరమతి

## తృతీయాంకము

ప్రదేశము :—కోటభవనప్రాంతము

ప్రవేశము :—భవాని, వీరమతి, జగద్దేవుఁడు

జగ—తల్లీ! నేను నిర్దోషుఁడనను నమ్మకము నీకున్నప్పుడు మిగిలిన యంశములన్నియు నీకేల ?

వీర—అత్తగారట్లు సెలవిచ్చుచుండగాఁ జెప్పఁగూడదా ?

భవా—తండ్రీ! స్వప్నమందైన నీవలన దోషముండునని నేననుకొందునా ? కాని మనపై నిన్నివాదులు కల్గుటకేమికారణమోయి నాయనా ?

వీర—నేను గూడఁ గొన్ని వింటిని.

జగ—అమ్మా! నీవు విన్న వేవో చెప్పుము.

భవా—చిరంజీవి రణధవళుని పొడువుమని వాకిచ్చి నిన్ను నేనే కోటలోనికిఁ బంపితి నని యొకటి, నాయనా నీ మొలలో బాకున్నదో లేదో నే నెఱుఁగుదునా ? నీవు కోటలోనికి వెళ్ళితివో లేదో నే నెఱుఁగనే. నాయనా! ఇది నాసవతి కల్పించిన ప్రతీతియేనా ?

జగ—అమ్మా నీవామె నేమియు ననవలదు. నాకు నీవు నా మెయుఁగూడ నొక్కటియే.

భవా—ఆమె యేమియు నెఱుఁగదనియే నీయభిప్రాయమా ? అట్లైన నామెనుగూర్చి తప్పాడిన జనులను భగవంతుఁడు క్షమించుఁగాక !

జగ—మఱియొక ప్రతీతియేమి ?

భవా—నీవు రాజ్యాపేక్షచే నీతండ్రిగారినిఁ బొడువఁబోవఁగ నాయన పాఱిపోయె ననియు, నా దారిని భ్రమాదికమున వచ్చిన చిరంజీవి తమ్ముని నీవు పొడిచితి వనియు మఱియొక ప్రవాదము.

జగ—హరిహరీ! దవ్వగుకొలఁది వస్తువు తక్కువగును. కాని,

ఆ. వె. అనృతవార్త దూర ♦ మరుగుకొలందిని
భీకరముగ మిగులఁ ♦ బెరిగిపోవు
పుట్టమీఁది త్రాడు ♦ భుజగసహస్రమై
పల్లెలన్నికూడఁ ♦ బ్రాకుఁగాదె.

భవా—నాయనా! అడిగితివికానఁ జెప్పితిని. ఇదియు నసత్యమని యెఱుఁగనా? వీరమతీ! నీవు విన్నదేదియోఁ జెప్పుము.

వీర—నాకుఁ జెప్పుటకు లజ్జయగుటయే కాక నవ్వువచ్చుచున్నది.

జగ—సందేహింపక చెప్పుము.

వీర—నేను చెప్పనుకాని నాథా! మీ మెడలోని హారమేది?

జగ—సవతితల్లిగారి దాసియైన లలిత కిచ్చితిని.

వీర—సంతోషమే.

జగ—ఏల యిచ్చితినో యడుగవేమి?

వీర—నాకేమైన మీయోగ్యతను గూర్చి సందేహమున్నప్పుడుకదా యడుగవలయును? పాటుపైచుకొంటిరేమో యనుసంశయమున హారమును గూర్చి యడిగితిని. క్షమింపుడు

జగ—(తనలో) లలితా! యెంతపని చేసితివి? నీకున్న తెలివితేటలు సన్మార్గమునందు వినియోగింపఁబడు నెడల లోకమెంత ధన్యమగునో ధర్మమార్గ మందుకంటె నధర్మమార్గమందు మిగులఁ దీవ్రముగ బుద్ధి ప్రకాశించునుగదా!

ఆ. వె. మాయము త్రియంపు ♦ మహనీయమంజిమ
యాణిము త్రియంబు ♦ నందుఁ గలదె?
వంకగీఁతలోని ♦ పొంక మొయ్యారంబు
సూటిగీఁతయందుఁ ♦ జూడలేము,
కులటహారగు మెఱుఁగు ♦ కులకాంత కెటువచ్చు?
గత్తు రక్తి భజన ♦ గతికిఁ గలదె?
తులసితీర్థమునకుఁ ♦ గలదె కాఫీరుచి
పైఁట తళుకు కావి ♦ శాటి కగునె?
సత్యమెపుడు మిగులఁ ♦ జప్పనై మనసెక్క
దెవఁడు వినును గాకి ♦ యొగిరె ననఁగ
మృషకు రుచులు నొండు ♦ మేక పులిని మ్రింగె
ననఁగ నంద రట్టె ♦ యాలకింత్రు!

అదిగాక

సత్యమార్గంబు దుష్ప్రవే ♦ శం బధర్మ
వీథి సుకరప్రవేశమై ♦ వెలయు నెప్డు

డధికకష్టము గీతార్థ ♦ మధికరింప
నేర్వవచ్చును చీట్లాట ♦ నిముసముసను.

వీర—నాథా! ఏమో యాలోచించుకొనుచున్నారు?

జగ—ఔను.

గీ. మొద్దువటుఁడొక సతిలేక ♦ మొత్తుకొనఁగ
వృద్ధునకు నల్వురిల్లాండ్రు ♦ వేశ్యకొసరు
నీతిమంతుఁడు గతిలేక ♦ నిందనొంద
బానిసీఁకి ద్రోహికి ♦ బ్రహ్మరథము
ఇచ్చువానినె తిట్టుదు ♦ రెల్లవారు
పిసిడివానికె పెదపెద్ద ♦ బిరుదచయము
పాంసులాత్మకు ఫలముపైఁ ♦ బ్రబలఫలము
ఏకపుత్రమరణము సు ♦ శ్లోకునకును,
సృష్టిలో నిట్టి మార్మెలి ♦ యిట్టివెలితి
గలుగ నేలొకొ చెప్పఁగాఁ ♦ గలఁడెవండు?
దీనిసవరింప జను లెన్ని ♦ తెన్నులైన
రుచులపై విధ్యమునుబట్టి ♦ తొక్కినారు;
ఎన్ని న్యాయపీఠములైన ♦ నిందుకొఱకె
యెన్ని ఘోరయుద్ధములైన ♦ నిందుకొఱకె
సమతను బలాత్కృతినిగూర్పఁ ♦ జాలినట్టి
యెన్ని ప్రబలయత్నములైన ♦ నిందుకొఱకె
అస్వభావకవిన్యాయ ♦ మనుసరించి
యెంతగ్రంథాళియో పుట్టె ♦ నిందుకొఱకె
కర్తృకలపుఁబోటుల సృష్టి ♦ గతులుమారు
నంచు దలఁచుట యున్నాద ♦ మగునుగాదె?
అర్హునకు నర్హఫలము సం ♦ ప్రాప్తమగుట
సృష్టి నెచ్చటఁ గనఁబడ ♦ దిట్టివంక
బ్రహ్మ పుట్టినయపు డెంత ♦ వఱకుగలదొ
యంతవఱ కిప్పు డున్నదం ♦ చనుట తగును.

వెఱ్ఱిగ యోజించుకొనుచున్నాను.

భవా—నాయనా! వెఱ్ఱియో మంచియో నీవనినది నాకుఁ దెలియలేదు. విదుషియైన నా కోడలి కేమైనఁ దెలిసినదేమో?

వీర—నాథా! అర్హకర్మఫలము గలుగకపోవుటచే సృష్టిలో నేదియో పొరపాటున్న దని చెప్పువారు అర్హతానర్హతలు నిర్ణయించుట యసాధ్యము అర్హుఁడని మీ రనుకొనినవాని కేదో యనర్హత యుండకతప్పదు. అందుచేతనే తగినఫలసిద్ధి యగుటలేదు మనుజులలో నర్హతానర్హతలు నిర్ణయించుట యెట్లసాధ్యమో ఫలములలో నర్హతానర్హతలు నిర్ణయించుట యట్లసాధ్యము అదిగాక పరమార్థదృష్టిచేఁ జూడ వ్యత్యాసమేమియు లేదు. చక్రవర్తికి సుఖములేదు, ముష్టివానికి కష్టములేదు. వీఁడు ముష్టివానిని జూచి సుఖి యనుకొనుచున్నాఁడు. వాఁడు వీనిని గాంచి సుఖి యనుకొనుచున్నాఁడు, మనకు వారిమనస్సులోదూరి కాంచుటకు శక్తియున్నయెడల నిద్దఱిమనస్సులలో నేమియు వ్యత్యాసమున్నట్లు కనఁబడదు. ఏదైన బహుస్వల్పము గనుక్నను దానిని గణింపఁదగునా? అదిగాక మనబ్రదుకిచ్చట నెంతయో కాలమా? సత్రములో మూఁడునాళ్లకంటె హెచ్చు లేదే? ఈస్వల్పసౌభాగ్యమునకు సత్రమిఱకటముగనున్నదని యొకపెణక కురియుచున్నదని గదిలో దుమ్మని సత్రాధికారిని నిందించుట పాడియా? మనము శాశ్వతలోకమున్నదని నమ్మినవారముగాని యీగుడుగుడుగుంచములో బ్రదుకు కడతేరునని నమ్మినవారము కాముకదా? కన్నుమూసికొని యసంతుష్టిచే గొణగకుండ వెడలఁబుచ్చవలసిన యీ త్రుటికాలము వెడలఁబుచ్చి శాశ్వతలోకమున నవ్యయానంద మొందఁదగదా?

జగ—సెబాస్! ధర్మపత్ని బాగుగఁజెప్పితివి. అమ్మా! నీకోడ లెట్లు చెప్పె వింటివా?

గీ. ఇచటి కష్టము కష్టము ♦ నిచటిసుఖము
సుఖముకాదని చెప్పె నీ ♦ శుభ్రమూర్తి
యైహికపుటూగులాటల ♦ నన్నిగడచి
యవ్యయానంద మొందుద ♦ మచటఁ దల్లి.

వీరమతీ! దైవధ్యాన మొనర్చుకొందము. నీవు రచియించిన గీతమును బాడుము. నీతోఁ గలసి మేమును బాడెదము.

వీర— కాంభోజ. కీర్తన.

పరమేశ భవనాశ పాపవిభంజన
పరమపురుష మమ్ముఁ బాలింప రావయ్యా ॥పర॥
భువి నేకష్టములైనఁ బొందఁగలము కాని
భవలంపటతమాత్ర భరింపలేమయ్యా

ప్రవిమల భవదీయపాదనీరజభక్తి
యవిరళముగ హృదయములందు నిల్పుమో ॥ పర ॥

భవా—లోపలఁ గొంచెము సందడిగనున్నది. మహారాజుగారు దయచేయుచున్నట్లున్నారు.

(నేపథ్యమున) జయా! శ్రీ ఉదయాదిత్యమహారాజునకు జయా!

(మహారాజు పార్వతిపైఁ జేయివైచుకొని ప్రవేశించును.)

ఉద—(తనలో) గీ. అక్కటా! యుదయాదిత్యుఁ ♦ డనెడిపేరు
గాని యస్తగతాదిత్యు ♦ కరణి నుంటి
శ్రీ మహారాజబిరుదంబు ♦ స్త్రీకి భటుఁడ
యాఖ్యకును సంస్థితికి నెంత ♦ యంతరంబొ.

భవా—నాథా! నమస్కారము.

జగ—తండ్రీ! నమస్కారము.

వీర—మామగారూ! నమస్కారము.

జగ—తల్లీ! నమస్కారము.

వీర—అత్తా! నమస్కారము.

పార్వ—నాయనా జగద్దేవా! కోడలా సుగుణవతీ! మాయక్కగారికి మ్రొక్కి మిమ్మాశీర్వదించెను. అక్కా! నమస్కారము.

భవా—చెల్లెలా! చిరంజీవినివగుము.

పార్వ—నాయనా జగద్దేవా! దీర్ఘాయుష్మంతుఁడవై యుండుము తల్లీ వీరమతీ పుత్రవతివికమ్ము (అప) నాథా! నాది జాలిగుండె. ఇట్టిపరిస్థితులను నేను చూడఁజాలను. కావున నీకొడుకును సతీమాతృసహితముగా శీఘ్రముగ దేశాంతరమునకుఁ బొమ్మని నీవు చెప్పుము. ఈవ్యవహారము నిముసములోఁ దీరవలయునుగాని యాలస్యమైనయెడల నాకు దడకలుగును.

ఉద—జగద్దేవా!

జగ—తండ్రీ!

పార్వ—(అప) ఆతనినిబిలుచుటయేందులకు? మీరేమైన నాతనినడిగెదరాయేమి? అంతయుఁ దిరుగ మొదటికివచ్చినదా? మీరూరకుండుఁడు. నేనుమాటలాడెదను. (ప్రకా) జగద్దేవా! మీతండ్రిగారి పక్షమున నేనుమాటలాడుటకనుజ్ఞనొందినాను. చూడుజగద్దేవా!

భవా—చెల్లెలా! తండ్రిగారినే మాటలాడనీయరాదా!

పార్వ—ఆయన మాటలాడవలయుననియేకాదా నాదేవ్రులాటకూడను. ఆయన మనస్సు బొత్తిగాఁ జెడిపోయియున్నది. ఆయనకర్మము నాకర్మను. మాదినముల

మాహాత్మ్య మిట్లు మండిపోవుచున్నది మనస్సు సర్వవిధముల చెడిపోయిన యీమహారాజును మాటలాడు మాటలాడు మని పొడిచిన నేమి మాటలాడును? ఆయనకు రెండు రెండుకనులు, రెండు రెండుచేతులు. నీవొక వైపున, నేనొక వైపున. నిన్నుఁ బొమ్మనఁగలరా? నన్నుఁ బొమ్మనఁగలరా? ఇద్దఱును గన్న కొడుకులే జగద్దేవుఁ డొకవంక, రణధవళుఁ డొకవంక అతనిని విడనాడఁ గలఁడా? ఇతనిని విడనాడఁగలఁడా? పోనీ! మనమందఱము క్షీరోదకన్యాయమున నుంటిమేమో యేబాధయు నెవ్వరికి లేదనుటకు మాదురదృష్టదినములచేత నిట్లు నాపుట్టిమునుగుటకు సిద్ధమయ్యెను రవంత తప్పెనుగాని గంగాప్రవేశము చేయవలసినస్థితి పట్టియుండును. నీవు ప్రోత్సాహపఱచి నీకొడుకుచేత నాకొడుకును బొడిపించితివని—

భవా—హరిహరీ! యెంతమాట!

పార్వ—నీవు చెప్పవలయునా? అది యసత్యమని నేనెఱుఁగనా? నేనన్నము తినుట లేదా? నాజిహ్వ కోసినదైన నే నట్లుచునా? అమ్మా! లోకమును బట్టఁ గలమా? పలుగాకి లోకము! పాపిష్టిలోకము వారి ననవలసినపనికూడ లేదమ్మా? మనము సవతులమయ్యెను. వారు సవతిసోదరులయ్యెను అందులోఁ బడుచువారయ్యెను. తండ్రిగారు వృద్ధులయ్యెను. రాజ్యముల కపేక్షులయ్యెను అయినను జగద్దేవుఁడు నాయందు భక్తికలవాఁడే ఇఁక గోముమాత్ర మేమను కొనును తెల్లవాఱి లేచుసరికేదో క్రుమ్ములాట ఏదోయపవాదము చెవిని బడుచుండును. అందులోను—నమ్మవేమో మాతల్లీ! యీలలితముండ పెద్దదై కోటలోఁ జేరినతరువాతమాత్రము—అబ్బ—యీయపవాదములకు లెక్కలేకుండ నున్నది ఇద్దఱుపడుచు రాజపుత్రులింటిలో నుండిరయ్యెను. ఈపడుచుదాసి కెపకెపలాడుచుఁ దూనీఁగలాగు నటులిటు లెగురయ్యెను! జగద్దేవుఁ డేకపత్నీవ్రతుఁడే. అది శిలాక్షరమైనమాటసుమా! పోనీ! ఈదాసిని వదలుకొందమన్న (నోరుమూసికొని నిమ్మళముగ) ఆముసలిసరసుఁడు ఎవఁడు? మామంత్రి పెద్దయ్య దీనినిఁ జేరఁదీసినాఁడు. వాఁడు చచ్చినగాని యిది వదలదు. అమ్మా! అమ్మా! ఒకచిక్కుకాదు. ఒకబాధకాదు. ఇట్టిస్థితిలో సర్వవిధముల మనస్సు చెడిన మహారాజేమిమాటలాడును?

వీర—మహారాజా ప్రత్యక్షముగా నాభర్తను బరీక్షించి యెవనివలనఁ దప్పున్నదో తెలిసికొని వారిని శిక్షింపఁగూడదా? సమక్షమున మీమాధ్యస్థ్యము లెందులకు? అంటియు నంటని పొందియుఁ బొందని యొద్దు నీరుకాని యీమాటలవలనఁ బ్రయోజనమేమి?

భవా—(తనలో) నాకోడలు నాకంటె నయము.

జగ—వీరమతీ! తప్పుకాదా!

పార్వ—ఓస్! మంచి గొప్పభర్తవు బయలుదేఱినావు ఈమాత్రమునకే భార్య నాజ్ఞ పెట్టుచుంటివిగా! మేము పెద్దవారము బ్రదికియుండగా నీవప్పుడే స్వతంత్రుఁడవై భార్యపైఁగోపపడుచుంటివా! సెబాస్! వీరమతియనఁగ నెవరనుకొంటివి? నాకుఁ బ్రాణము. నాకోఁడలు రాకుండ నామెను నాయింటికివచ్చుట కేలయంగీకరించితిని? ఆమె యనేకవిద్యాపారంగత—యామె మహానిశితబుద్ధిని జూచియేకదా...ఆమె యేమన్నను నాకుఁదప్పులేదులే! అమ్మా! వీరమతీ! నీవు చిన్నదానవు. నీవుచెప్పినసంగతి నేనాలోచింపకపోలేదు ఈమహారాజుగారు నేనుగూడ నావిషయమున జాములకొలఁది చర్చించుకొనియే యుంటిమి. అది తగదనియే యామార్గమును వదలివైచితిమి దానిలోని యాతిభాధలేవనగా దోషమున్నచోట ఋజువున కొకప్పుడవకాశము లేకపోవచ్చును దోషములేనిచోట నొకప్పుడు దోషమున్నట్లు ఋజువుకావచ్చును దోషాదోషనిర్ణయము భగవంతునికి వదలివేయఁదగినది. నీవు దోషివగుదువా కావా? యని నేను ముఖాముఖిని జగద్దేవుని నడిగెదను దోషినని యాతఁడొప్పుకొనక తప్పదు నీవడుగుము. దోషినని ఘంటాపథముగ నొప్పుకొనక తీఱదు. సన్నివేశములు పరిస్థితులట్లున్నవి. అదిగాక యిందులోనున్న చమత్కారమేమనఁగా—

వీర—నాథా! మీరు దోషమొనర్చితిరా?

పార్వ—వీరమతీ! నీవుండుము. నీకుఁ తెలియదు. ఆతఁడు దోషిననియే యొప్పుకొనుననుకో. మఱియొకలాగున సమర్థించుట కవకాశములేనప్పుఁ డాతఁ డేమిచేయును. ఆతని ననవలసినపనియులేదు. ఆతఁడు దోషినని యొప్పుకొన్నయెడల నట్టి యప్రతిష్ఠనాదికాదా? నీదికాదా? మాయక్కదికాదా? అందఱికంటె నెక్కువుగఁ దండ్రిగారిదికాదా? ఒకవేళ దోషినిగాననియే యాతఁ డనుననుకో? ఇఁక దోష మెవరిదై యుండవలయును. తనదికాకపోయినప్పుడు నాదే యై యుండకతప్పునా? అప్పుడాయప్రతిష్ఠతనిదికాదా? నీదికాదా? మహారాజుదికాదా? ఇదికాక సాక్ష్యములని, సంపన్నతలని, ప్రశ్నలని, మాఱుప్రశ్నలని, వాదములని, ప్రతివాదములని, యీగాడిదగత్తరమూలమున నూరనున్నవారి వెకవెకలు, బుగ్గనొక్కులొకటి యధికమా? కుటుంబగౌరవము నిలువఁబెట్టుకొనఁదలఁచినవారికిది మార్గముకాదు. కావున దీని నిదివఱకే విడిచితిమి. నాథా! అంతేకాదా?

ఉద—(మాటలాడకూరకుండును.)

భవా—నాథా! నీవే మాటలాడకుండనప్పుడు మేము చేయవలసినదేమున్నది?

జగ—(అప) అమ్మా! ఏదియెట్లుజరిగినసరే, శాంతచిత్తవై యుండుము. మాతండ్రిగారి నేమియు ననకుము.

పార్వ—అక్కా! చేయవలసినదేమున్నదని నీవడిగితివి అదిమంచిది. అదియే యాలోచింపఁదగినది. కష్టమో సుఖమో యిదివఱకుఁ గలసియుంటిమి. పిల్లలా పెద్ద

వాండ్రయినారు. ఒకకోడలా కాపురమునకు వచ్చినది ఈనెలకో పైనెలకో రెండవకోడలు వచ్చునుగాని మానదుకదా. సవతులపోట్లాటలకు సవతికొడుకుల మత్సరములకుఁ దోడికోడండ్రకాటులాటలుకూడ తోడగుటకు సిద్ధమైయేయున్నవి. ఇక్కడి కీమూఁడువిధములయిన కలహములు—ఏదీ? అత్తకోఁడండ్ర యవాంతరకలహములుకాక—భార్యాభర్తల పరిపాటి పగటిపూటకలహములుకాక—యీకలహములలో నొకకలహ మింటిలోనున్నప్పుడే సంసారమమ్మవారిజాతరవలె నున్నప్పు డన్నియు నొకచోఁగూడినప్పుడెంకఁ జెప్పవలయునా? మనమిట్లుదెబ్బలాడుదుమని చెప్పితిననుకోవలదు అటు లెన్నఁడు జరుగదు. కాని యింత బహుళసంసారమైనప్పు డేవో కొన్నిపొరపాటులు నోరుజారుటలు ప్రమాదములు కలుగకమానవు. పొరపాటులు బుద్ధిపూర్వకముల క్రిందఁ బ్రజలన్వయించి యల్లరిచేయనారంభింతురు. నోరుజారుటలు తిట్లక్రింద ప్రజలు సమర్థించి మనల విమర్శింపఁజూతురు. ప్రమాదములు నేరములక్రింద సమర్థించి మనల సంతపాటి కెక్కింపఁజూతురు. మనమెట్లో సంబాళించుకొని సముదాయించుకొని యూరకుందమన్నను వారూరకుండరు. మనల నూరకుండనీయరు. అందువలన నెవరిమట్టునకువారు వేఱుగా దూరముగనున్నయెడల నుభయులకు క్షేమము. అదిగాక వెట్లకేమి, పోఁతలకేమి యభిమానములకేమి యాదరణములకేమి, దూరముగానున్నప్పుడే యెక్కువ యవకాశముండును. సవతిబాధలున్నప్పుడు సంఘకుటుంబమంత చావు మఱియొకటి లేదు.

భవా—చెల్లెలా! అంతటితో నాఁగెదవేల? ఆరవంతమాటకూడఁ జెప్పరాదా?

పార్వ—చెప్పుటకే నిశ్చయపఱచుకొన్నాను. అట్లుచేయుటకే నిశ్చయపఱచుకొన్నాను. నేనును నాకొడుకును దూరదేశమున కెటకైనఁ బోయి యచ్చటఁ గాలక్షేపముఁ జేయుదుము.

భవా—అబ్బ! నీవే?

జగ—అమ్మా! మీరేలపోవలయును?

పార్వ—ఏలాగుననో యొకలాగున నీయల్లరులు శాంతింపవలయును. ప్రజలనోట మన మింకఁ బడఁదగదు ఎవరైన నొకరు పోవలయును. నేనైననేమి, మీరైననేమి? అక్కా! నీవే! అబ్బ! నీవేయని నన్నెత్తిపొడిచితివి. నే నిక్కడనుండి పోనని నీదృఢవిశ్వాసముకాఁబోలు! చచ్చినను నేను బ్రహ్మరాక్షసినై కోటనంటిపెట్టికొని యుందునని నీనమ్మకముకాఁబోలు! అమ్మా! నేనంత కార్పణ్యమున్నదానను గాను. ఈభాగ్యభోగ్యములన్నియు నే నొక్కతెనే యనుభవింపఁ దలఁచియుండలేదు. గంగానమ్మలాగున బలికుంభములన్నియు నేనే మ్రింగ నెంచియుండలేదు. నేనీసంసారములో నెంత యంటిముట్టనట్లు ప్రవర్తించుచుంటినో మనప్రాణనాథు నడుగుము. నాథా! నాలాంపట్యరాహిత్యము మీరెఱుఁగరా? ఉన్నదంతయుఁ బ్రోగుచేసికొని మూటగట్టుకొని నాకొడుకునెత్తినిఁ బెట్టెదనను

కొనుటకమ్మా ! అత్తఁ డెట్టివాఁడో నీవెఱుఁగవా ! కొడుకు పనికిరానివాఁడయ్యెనే యని లోపలఁ గ్రుళ్లిక్రుళ్లియేడ్చుచున్న నాకు బనారసు కోకలెందులకు, పచ్చలహారము లెందులకు, కంజరము లెందులకు, గజ్జము లెందులకు, గవులెందులకు, కంచుగగాడిదె లెందులకు ? నేనును నాకొడుకును గోట వదలిపోవ నిశ్చయించుకొంటిమని నేనవఁగ నీవు నాస్వభావము గుర్తింపకుండ నన్నిట్లెత్తిపొడిచితివి గదా ! అమ్మా ! నే నొక్కనిదర్శనము చెప్పుచున్నాను వినుము. మేము కోట నుండి పోవుటకు మాకనుజ్ఞ యీయక తప్పదని నే నీమహారాజును నిన్న సాయంకాలమునుండియు నెంతనిరోధించుచున్నానో యీయననే యడుగుము. (రాజు 'ఔ' నని యభ్యనుమిచ్చునట్లు తలయూఁపును) చూచితివా ! అక్కా ! ఆయన యెట్లొప్పుకొనుచున్నారో ! నాకుఁ బైకొక్కమాట లోపల నొక్క యూహము లేదు మాయమర్మము, డాబుదాఁబటికము నన్ను నా కొడలుమంట కుండఁ బగులఁగొట్టినట్లు మాటలాడుటయే నాస్వభావము "అయ్యో ! ఇంతతెల్ల మనసు తెలివితక్కువ పెద్దమ్మవు నీవు మాఱుమనువుమగనితో సవతికత్తెరబోను కాపుర మెట్లుచేయఁగలవే" యని నాలుగేండ్లక్రిందటివఱకు మాయమ్మ చెప్పుచునేయుండెడిది మాప్రయాణము స్థిరపడినది ఈసంగతి మీకుఁ జెప్పుటకు మిమ్మిటకు రాజుగారు రమ్మనిరి వచ్చినవారు రానేవచ్చినారు కావున నిఁక నిటనే స్థిరముగా నుండుఁడు. నేను—

జగ—అమ్మా ! మమ్ము క్షమింపుము. మీరు పోవలదు. దూరదేశనివాసమువలన నెన్ని బాధలో యున్నవి. చిరంజీవి తమ్ముఁడంతశ్రమ కోర్వలేఁడు. మీయారోగ్యముకూడ సరియైనదికాదు. మేమే పోయెదము. దయయుంచి మాకు సెలవొసఁగుఁడు.

వీర—అత్తా ! నాప్రార్థనము నదియే

భవా—చెల్లెలా ! నాథుఁడు నీయుపచారమున కలవాటుపడియున్నాఁడు కావునఁ జిరంజీవి రణధవళునితో నీవిటనేయుండుము.

పార్వ—నానిశ్చితమునకు మీరడ్డురాకుఁడు. అక్కా ! నీయుపచారమున కలవాటుపడిననాథుఁడేకాదా నాయుపచారమున కలవాటుపడినాఁడు ! తిరుగ నీయుపచారమున కలవాటుపడును.

జగ—అమ్మా ! మీ కనేక సాష్టాంగనమస్కారములు. మాప్రార్థనవినుఁడు, మీరిచ్చటి నుండి కదలుటకు మే మొప్పుకొనము

పార్వ— నాయనా ! జగద్దేవా ! మీ కంతపట్టేల ?

జగ—పట్టుకాదమ్మా—ప్రార్థన—.

పార్వ—మీయిష్టమెటులో యటులే. మీమాట కెన్నఁడును వ్యతిరేకముగా నడువను. మీ రెక్కడనున్నను మీరు నమ్మవలసిన సిద్ధాంతవాక్యమిది. ఇదికాక మఱియొకమాట. కోటలో నేదియో నేరము జరిగినదనియు, నందుకొఱకు మిమ్ము

దూరముగ రాజుగారు పంపివైచినారనియుఁ బైవా రెవ్వరన కొనఁగూడదు. ఈనేరమునుగూర్చి పైవారెవ్వరికిఁ దెలియకుండఁ జేతనైనంతవఱ కేర్పాటుచేసి యున్నాను. ఇదివఱ కీసంగతి మంత్రికైనఁ దెలియఁబఱుపలేదు, మన కుటుంబ వ్యాపారములు పైవారి కేల తెలియవలయును? వారేమి యార్చువారా తీర్చు వారా? సరే అల్లరిపడకుండ నేదో విధముగ సర్దుబాటుచేసికొంటిమికదా ఇఁక నొక్క నిముసమైనఁ దడవుసేయక మీ యుద్యమమును మీరు నిర్వర్తించుకొన వలయును.

వీర—(తనలో) నాభర్త సర్వజనానురంజకుఁడగుటచేఁ బ్రజలు తిరుగఁబడుదురేమో యని యామె యింత జేవులాడవలసివచ్చినది.

జగ—తండ్రీ! నమస్కారము. పట్టణాస్థానమునకుఁ బోవుదును సెలవిండు.

ఉద—నాయనా! పెద్దవాఁడనైతిని నాక్షేమమును దఱచుగఁ దెలిసికొనుచు నాకాల మును నిరీక్షించియుండుము.

వీర—మామగారూ! నమస్కారము.

ఉద—అమ్మా! నీవు కోరుకొన్న భర్త నీకు లభించినాఁడు. సత్వరముగ సంతానవతివై సౌఖ్యపడుము.

పార్వ—అక్కా! మీరుకూడ భర్తగారియొద్ద సెలవుతీసికొనవలయును గాదా?

భవా—చెల్లెలా! నాకిప్పుడు నాథునియొద్ద సెలవెందులకు?

పార్వ—అయ్యో! నీవుకూడ మమ్ము విడిచి వారితోఁ బోవా?

భవా—నాభర్తను విడిచి నన్నుఁ బొమ్మనుటకు భగవంతునికే యధికారము లేదుకదా నీకెట్లున్నది?

పార్వ—అబ్బే! అధికారము మాటకాదు. ఇదివఱకు మనమనుకొన్న సంగతినిబట్టి చెప్పి నాను.

భవా—మీరు స్థిరపఱచుకొన్న ప్రకారము నేనేల నడవవలయును?

పార్వ—నీయిష్టము—దానికేమికాని పడుచుదంపతులను బరదేశమున విడిచి మీరిట నుండుట తగునా?

భవా—ముసలిమగని విడిచియుండుటకంటెఁ దప్పా!

పార్వ—ఇక్కడ నేనుంటిని గాదా?

భవా—నీవున్నయెడల నీవు తరింతువు కాని నాతరణముమాట నేను జూచుకొనఁదగదా?

పార్వ—సరే. దానికేమికాని—పాపము! అయ్యయ్యో! ముక్కుపచ్చలాఱనిపిల్లలే— వారిగతి యేమగునో కాసంత యోజింప నక్కరలేదా?

భవా—వారికర్మమునుబట్టి వారిగతియుండును. నాకు భర్తతోడిదే గతికాని వేఱు కాదు.

పార్వ—అటులైన నీభర్తనే యడుగుము.

భవా—నేనేమైనఁ దప్పాడితినా? ప్రపంచమునలేని యాచరణమును జెప్పితినా? వేదశాస్త్ర వ్యతిరేకమైనమాట పలికితినా? నాభర్త నడుగవలసిన పనియేమున్నది?

పార్వ—(తనలో) ఎంతదేవులాడినను నీపిశాచము విడుదలకాదయ్యెనే (అప) నాథా! ఈమెగూడ వెడలిపోవలసినదనియే కాదా నీయభిప్రాయము. అటులేకాదా యిదివఱకు స్థిరపఱచితివి. ఇప్పుడామె పోననుచున్నది నీవామెతో నేమిచెప్పుదువో చెప్పుము ఆమె యిక్కడనుండుట కంగీకరింపను. పొమ్మని చెప్పుము.

ఉద—భవానీ! మమ్మేల చంపెదవు. నీవుకూడఁ బొమ్ము.

భవా—నాయునికివలన మీ కేభాధయు లేకుండునట్లే నేనుండెదను. ఈయూరఁ గోట కుదూరముగా నేదైన బసచూచుకొని యటనుందును. ఉదయమున నొకసారి వచ్చి మీపాదదర్శన మొనర్చి పోవుచుందును అంతవఱకనుగ్రహింపవలయును.

ఉద—(అప) పార్వతీ! ఈయూర నేమూలనో యయుండు నెడల నుండ నీయఁగూడదా?

పార్వ—(అప) ఉదయముననే వచ్చి దర్శనమని కూరుచుండును. నాకొడు కామె యున్నకడ కప్పుడు వచ్చుట సిద్ధించు నెడలఁ దనకొడుకును లేకుండఁ జేసితినని నాపైఁ గోపమున నాకొడుకును గొంతుపిసికి చంపునేమో?

ఉద—(అప) పిల్లవాఁడు కాఁడుకదా—గొంతెట్లుపిసుకఁగలదు భయములేదు.

పార్వ—(అప) ఎన్నియేండ్లున్ననేమి వెఱ్ఱివాఁడుకాఁడా? అదికానియెడల మినుప సున్నియుండలో విసముపెట్టి చంపఁగూడదా? నేనామె నిదివఱకే నమ్మలేదు. ఇప్పుడు బొత్తిగా నమ్మవీలులేదు.

ఉద—(అప) ఇందున నొక ధర్మసూక్ష్మమున్నది వారిసంసారమంతయు నొక్కసారియే యూరువిడిచిపోవు నెడలఁ బ్రజలు కొంత సందేహింతురు. ఈమె యిక్కడనేయుండు నెడల జగద్దేవుఁడు భార్యనుదీసికొని యత్తవారింటికిఁ బోయెనని వారేమియుఁ దలపెట్టనే తలపెట్టరు.

పార్వ—(అప) ప్రజలా? వారిమొంగము వారిమోర. వారు మనకుఁ జేయునదేమి? అయినను నీయాజ్ఞకు వ్యతిరేకమొనర్తునా? 'ఆమె కోటవెలుపల నుండవచ్చును గాని, మీదర్శనమునకు వచ్చుటకు నేనొప్పుకొనను.

ఉద—(అప) అటులైన నేమిచేయవలసిన దని నీయభిప్రాయము?

పార్వ—(అప) మొదటిదినమున దర్శనమునకు రానిచ్చెదను. రాజుగారి సెలవైనదని రెండవదినమున నడ్డుపెట్టించెదను.

ఉద—(అప) నాసెలవనుట యెందులకు? నీయిష్టము వచ్చినట్లుచేయుము.

పార్వ—అక్కా! నిన్నిక్కడ నుంచుట కంగీకరింపకతప్పదని యింతసేపును రాజుగారికి బోధించుచున్నాను అక్కా! జగద్దేవుని పెండ్లికిఁ బూర్వము నీవు కోట వెలుపల నెట్లుంటివో యిప్పుడుకూడ నట్లే యుండవచ్చును. రాజుగారి దర్శనమునకు రావచ్చును.

భవా—చెల్లెలా! కృతార్థురాల నైతిని, నాథా! సెలవుతీసికొందును.

(జగద్దేవుఁడు భవాని వీరమతి పోవుదురు)

ఉద—ఇంక నిక్కడ నేమున్నది?

పార్వ—చిరంజీవి రణధవళుఁ డాపద్విముక్తి నొందెనుగాన నీదినము పండుగఁ జేసితిని గాదా! విందారగింతము రమ్ము.

ఉద—(తనలో) అలిమాటకు నెదురాడఁ ♦ జాల నకట!
బుద్ధి గంటగంటకు దిగి ♦ పోవుచుండె—
నస్వతంత్రత పూర్తిగా ♦ నలమె, జన్ని
జ్వరము దిగఁగ వాతము ముంచి ♦ వైచునట్లు.

లోనికిఁబోదమా?

పార్వ—రవంత పనియున్నది మీరు నడువుఁడు. మీవెంటనే వచ్చెదను. విందునకుఁ బిలిచినవారిని లలితచేఁ ద్వారలోఁ బిలుచుట కుత్తరువిచ్చి వచ్చెదను.

(ఉదయాదిత్యుఁడు నిష్క్రమించును)

లలిత! వేగ రమ్ము.

(లలిత ప్రవేశించును)

ఏమి జరిగినదో తెలిసినదా?

లలి—(తనలో) చాటుననుండి యన్నియు వింటిని. (ప్రకా) అమ్మా! నాకెట్లు తెలియును?

పార్వ—ఇప్పుడు చెప్పుట కాలస్యమగును. కాని మంత్రిని జూచితివా?

లలి—చూచితిని.

పార్వ—సరే—రేపాతనియింటికిఁ బోయి యాతనితో మాటలాడుము. నేను జెప్పిన పద్ధతి యంతయు జ్ఞప్తియున్నదా?

లలి—ఉన్నదమ్మా.

పార్వ—నేను ప్రోత్సహించిన ట్లెంతమాత్ర ముండఁగూడదుసుమా! ఆతనియంత యాతనికే యట్లు బుద్ధిపుట్టినట్లు చేయవలయును. ఎట్లు చేసెదవో! ఇదివఱకు ముద్దులిచ్చితినిగాదా ఈసారి దండ కడియములిచ్చెదను.

లలి—నాప్రయోజకత్వ మేమున్నదమ్మా? మీరు చెప్పినపక్కి హృదస్థమై యున్నది కాదా.

పార్వ—సరే రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

శ్రీరామ

# వీరమతి

## చతుర్థాంకము

ప్రదేశము :—మంత్రిమేడ

ప్రవేశము—లలిత, సీతారామసింగు

**సీతా**—అట్లు తొందరపడెదవేల? ఉండు, రవంతసేపు పలుకకుండుము.

**లలి**—సింగుగారూ! మీవలన నాకేమిసుఖము? మీరు నావంకఁజూడ కుండనున్నారు. పడకకుర్చీలోఁ గూరుచుండి మీఁదుమిక్కిలి కునికిపాటులుకూడఁ బడుచున్నారు. మీకునికిపాటులు చూడ నాకొడలుమంటగా నున్నది.

**సీతా**—తొందరపడకు. ఈరాత్రి నీవు వచ్చెదవనియే నల్లమందు మఱికొంచె మధికముగాఁ దగిలించితిని.

**లలి**—అబ్బే! నల్లమందు మ్రింగెదరా?

**సీతా**—(ఆవులించుచు)

గీ. బ్రాహ్మి బుద్ధికి, బంగి వై ♦ రాగ్యమునకుఁ,
గవితకు హరీతకియు, బాలు ♦ గానమునకుఁ,
గుక్కుటపుగుండె ధైర్యము ♦ కొఱకు, మఱియు
నరములకు నల్లమందు బం ♦ ధురములగును.

మందింతవఱకుఁ బట్టుచేయలేదు. (ఆవులించుచు) రవంతసేపు తాళుము.

**లలి**—నల్లమందు మొదలైన మత్తుపదార్థముల నాహారించి శరీరము పాడుచేసికొని మీరీ సరసమున కీ యుత్తరవయస్సులో సిద్ధపడుట యెందులకు?

**సీతా**—నీవు చిన్నదానవగుటచే మావయస్సులోని రక్తి నీవెఱుఁగవు.

(ఆవులించుచు) వైద్యమొకటి మంత్రమొకటి ♦ భక్తియొకటి
కవితయొకటి పైసరస మొ ♦ కటియుఁ బూర్వ
వయసులోకంటె నుత్తర ♦ వయసునందె
కడు నికరమౌచు నిగ్గౌచు ♦ ఘనతఁ జెందు.

లలి—(తనలో) నీపిండకూడుఘనత. (ప్రకాశముగా) మంత్రిగారిని జేపట్టితివమ్మా! మహాదృష్టవంతురాలవమ్మా! మాజాతికంతకు మణిపూసవు పుట్టితివమ్మా యని యందఱు నన్ను వేనోళ్ళఁ గొనియాడుచున్నారు కాని యిదిగో నాసౌభాగ్య మిట్లున్నది కునికిపాటులకుండి మిమ్ము లేపలేక చచ్చుచున్నాను

సీతా—ఉండు అప్పుడే యేమైనది. ఆస్థానవైద్యుఁ డెట్టిలేహ్యమును జేయుచున్నాఁడో నీవెఱుఁగుదువా?

లలి—ఈలేహ్యములవలన నాసవములవలన, షర్బత్తులవలన మీకడుపు నిండుచున్నది కాని నామనస్సు నిండుచున్నదా? నేనందఱివంటిదాననే యైనయెడల నాకీ బెంగ యుండునా? ఎవరిని నమ్ముకొంటినో చచ్చువఱకు వారితోడనే కాలము దొరలించుకొను స్వభావమున్నదానను; గావున—

సీతా—అదిగో! అట్టిబుద్ధి కలిగినదానవు కావుననే నీవు బాగుపడెదవు గొప్పవారిని జేపట్టినది, బుద్ధిగలిగి ప్రవర్తించినది, తోట దొడ్డి సంపాదించుకొన్నది మేడ మిద్దె కట్టుకొన్నది, తంగేడుపూఁతలాగున నొడలినిండ నగలు చేయించుకొన్నది, తాకట్టని తనఖాయని పత్రమని వ్రాయించుకొని యేవో కొంత విరివిగ వ్యవహారము చేసికొన్నది, యని నీకా ఖ్యాతివచ్చును ఒడుదొడుకు తిరుగుడు తిరిగి యొడలు పాడుచేసికొనఁదగిన లేఁతవయస్సులోఁ జప్పున నిన్నుఁ జేపట్టి బాగుచేసితినన్నఖ్యాతి నాకా కలుగును. ఉభయతారకముగా నుండును చూడు ఒకముద్దు

(లేచుచున్నాఁడు.)

లలి—లేచినారు. మందు పట్టుచేసినదిగదా?

సీతా—కాలు తిమ్మిరియెక్కినది (నేల నడచును)

లతి—తకాలుతిమ్మిరియెక్కి దేవులాడుచుండఁగా నిప్పుడు ముద్దెందులకు?

సీతా—దానిదారి నదియుండును. మందు పట్టియకపోలేదు. ఇఁక ముద్దున కభ్యంతరమేమి? లలితా! ప్రపంచధోరణి యంతేకాదా? సుఖము దుఃఖము చెఱియొక ప్రక్కను మనసును సదా యావరించి యుండకతప్పదు

గీ. కొడుకు త్రైమాసికపుటేడ్పు ♦ గొడవలోన
నాలి కప్పుడె నెలతప్పె ♦ ననుచు ముదము
భార్య పదియవనాటి శూ ♦ ర్పములవెతను
గన్నె పదునాలుగేండ్లది ♦ నన్న కులుకు.

ఆ. వె. ఒక్కచేత దర్భ యొకట ♦ నత్తరుబుడ్డి
యొక్కకంటఁ జినుకు ♦ నొకట నెండ

యొక్క చెవిని మరణ ♦ మొక చెవి జననంబు
జగతిలోనఁ బ్రదుకు ♦ సరణి యిదియె.
జాలిగుండెవాఁడు ♦ జను లేమియందురో
యనుచు భీతిఁ జెందు ♦ నట్టివాఁడు
బిడియమునను గొంకి ♦ వెనుకాడువాఁడును
ధరణిలోన నెపుడు ♦ దక్క లేరు.

గీ. పరుగులిడుచుండఁ గ్రిందను ♦ బడియుఁ గెరలి
మొండిఁ ద్రోపుగ ముందుకుఁ ♦ బోవువాఁడు
తనొకఁడుఁ గొట్ట బదుగురఁ ♦ దాను మంచి
చెట్టుఁ గాంచ కెవ్వరినైనఁ ♦ గొట్టువాఁడు
నేడ్చుచునె పెండ్లి విందార ♦ గించువాఁడు
సిగ్గుబిడియంబులను విస ♦ ర్జించువాఁడు
స్వార్థమే పరమార్థమై ♦ యలరువాఁడు
బ్రదుకదగినట్టివాఁడీ ప్ర ♦ పంచమునను.
సౌఖ్యజీవను లిద్దఱే ♦ జగతియందు
మొండియొకఁడు వేదాంతియొ ♦ కఁడుసుమ్ము
నడిమివారల బ్రదుకు వి ♦ నాశకరము
గడియగడియకు మృతికంటె ♦ ఘనతరంబు.

లలిత—మీరు మొండియైనట్లా ? వేదాంతియైనట్లా !

సీతా—వెట్టిదానా ! వేదాంతినిగానఁటే !

గీ. మంచుముత్తెంబుల గులాబి ♦ మాలవలెను
నిన్నుఁ దలమీఁద నిడుకొందుఁ ♦ గన్నులందు
బెట్టుకొందును మెడచుట్టుఁ ♦ గట్టుకొందుఁ
జేతనిడుకొందు నెదపైనిఁ ♦ జేర్చుకొందు
బ్రసవఫలబంధురోద్యాన ♦ వనములందు
గల గుహాలఁదూటి మృదుగాన ♦ కలనఁదేటి
కృతకశైలాళినెక్కి కొఁ ♦ గిళులఁజొక్కి
పొన్నగున్నల కెగఁబ్రాఁకి ♦ పూలుకోసి

ప్రసవకందుకములఁ గుండ ♦ బంతులాడి
యలసి పన్నీటికొలఁకుల ♦ జలకమాడి
తేనెటీఁగల నెగఁద్రోలి ♦ తేనెఁగ్రోలి
కోకిలరవంబులకు మాఱు ♦ కూఁతలిచ్చి
కెరలి పురివిప్పి నటియించు ♦ కేకులకును
బోరిపోరిని గుబాళించు పా ♦ వురములకును
బూవుటంగీలుదాల్చి పు ♦ ప్పొడినిబూసి
సరసనాటకములు ప్రద ♦ ర్శన మొనర్చి
చిట్టిముద్దులు వెడవెడ ♦ పొట్టిముద్దు
లలధవళగిరికంటె నె ♦ త్తైనముద్దు
లబ్ధికంటెను మిగుల లో ♦ తైనముద్దు
లమృతముసకంటె రుచిమంత ♦ మైనముద్దు. (అఁగిదగ్గును.)

లలిత—(తనలో) ఉన్నప్రయోజకత్వ మంతయే!

సీతా— లెన్నొరోదసినిండెడు ♦ నన్నిముద్దు
లట్టె యెడమైనలేకుండఁ ♦ బెట్టుకొనుచుఁ
దనువుతనువునఁ గరఁగిపోఁ ♦ బెనచికొనుచు
దేహభారంబు విడనాడి ♦ తేలికగుచు
పూలతేకులపై యట్టె ♦ బూర్గుదూది
పింజపింజలముగ మాఱి ♦ వింటికెగిరి
చంద్రగోళంపు టమృతవ ♦ ర్షమునఁ దడిసి
మెఱుపుఁదీఁగలు మనచుట్టు ♦ మేళమాడ
తారకలు తలఁబ్రాల ము ♦ త్యాలుగురియ
గప్పుమను తేజమున నెట్లొ ♦ కలసిపోయి
యద్వితీయము నేకమై ♦ యలరియలరి
బ్రహ్మమై పోవుదుముగాదె ♦ పద్మనయన.

లలిత—సీతారామసింగుగారూ! మీతో నొకసంగతి మాటలాడుటకు వచ్చితిని. ఇంతకుఁబూర్వ మెంతసేపో మీరు కునికిపాటులుపడుచుండుటచేతఁ జెప్పలేదు. ఇప్పటిస్థితిఁజూడ—నల్లమందుపట్టిచ్చుటచేత నక్షత్రమండలములు, చంద్ర

గోళములు, అమృతవర్షములు బ్రహ్మపదవులతో మీరున్నారు. మీరు దిగి మనుష్యప్రపంచమునకుఁ దిరుగ వచ్చి కునికిపాట్లు పడకుండునెడల మీతో నొక ముఖ్యాంశము మాటలాడవలసియున్నది.

సీతా—నీకంటె ముందుగా నే నొకముఖ్యాంశము జెప్పెదను. ఈ యెడమచేయి నీ కుడిభుజమున వైచితినా ! ఇదియొకసొగసుగానున్నది కుడిచేయి నీయెడమభుజమున వైచితినా ? ఇది మఱింత సొగసుగానున్నది ఈ రెండుచేతులు నీరెండు భుజములపై వైచితినా యిది ప్రపంచాతీతమైన సొగసుగానున్నది రమ్ము ! నా యొడిలోఁగూర్చుండుము ఒక్కముద్దు (చేయిలాగి ముద్దుఁగొనఁబోవును.)

లలిత—(ముద్దుపెట్టుకొననీయకుండ నాతనిదౌడలు నొక్కును.) అదేమిముద్దులమ్మా ? శ్రీరాములు మొదలు చిత్తగింపవలెనను వఱకు నొక్కటే ముద్దులైన యెడల నెట్లు దేవులాడవలసినది వలదు. వలదు,

ఉండు ఉండు. కట్టుడుపండ్లూడిపోవుచున్నవి. (సర్దుకొనఁబోవును)

లలిత—ఇదియొకకర్మమా ! నీముద్దులలో గొరగేదెకో దప్పికో కూడ భాగమున్నదా ? నాకర్మము సరిసరి ? ముద్దు లిఁక నక్కఱలేదు. సింగుగారూ ? నేను వావని మీఁద రాలేదు రాణిగారిసెలవుపైని వచ్చితిని.

సీతా- ఆలాగా ! అటులైన నవహితుఁడనై యున్నాను. ప్రసంగము వచ్చినది కావున నొక్కమాట చెప్పుచున్నాను. విను. రాజుగారు భార్యావశుఁడై రాజ్యము నాకు వదలివైచెను. నేను నీకు వశుఁడనై యీరాజ్యమును నీకు వదలివైచెదను. ఇందులోనున్న పరమార్థమిది—సరే—యిఁక నీవు చెప్పఁబోవునదేదో కానీ !

లలిత—నాకు మీరాజ్యములు, బిరుదములు నక్కఱలేదు. రాజ్యములున్నవారేమి సుఖపడుచున్నారో నేనెఱుఁగనిదా ! నాకు సంపదలందు లేశమైన యాశయు లేదు గౌరవము పాతివ్రత్యము ప్రధానములైన కుటుంబములోని దానను. మీమూలమున మర్యాదగాఁ గాలక్షేపము చేయవచ్చునుగదా యని మిమ్ముఁ జేరితిని రాజ్యపదవులందు నధికారసంపదలందు నపేక్షయుండెడిదాననే యైన యెడల మీవఱకు రాకయేపోయియుందును.

సీతా—నీవుచెప్పినదేదో నాకు బోధపడలేదు.

లలిత—ఈసారైన బోధపడునేమో యిది చూచుకొనుము. (పైఁటచాటుననున్న హార మాతనిచేతఁ బెట్టును.)

సీతా—ఈహారము నీకెవరిచ్చిరి ?

లలిత— ఎవరిచ్చిరో హారమే చెప్పును. బాగుగా నిదానింపుము.

సీతా—ఆఁ. ఆఁ. దీనిపై జగద్దేవుఁడని పేరున్నదే.

లలిత—ఔను. అతఁడే యిచ్చినాఁడు,

సీతా—నీవు నావశమైయుండి నీ కాతఁడేలయీయవలయును ? అతనికి నీకు—ఆ—

లలిత—ఆతనికి నాకు సంబంధమున్నయెడల నీతో నేలచెప్పియుందును? నీచెవికి గాన సేవయగునని చెప్పితినని కొంటివి కాఁబోలు? ఆతఁడిచ్చినహారమును నీచేత నేల పెట్టియుందును? నాకంటెఁ గన్ను జేతి గలవాఁడవు కావున నాకుఁ బైసరముఁ డిచ్చినహారముతో నీ ఋణముఁ దీర్చుకొని బాగుపడుమని నే నిచ్చితినను కొంటివి కాఁబోలు నేమి? ఈమాత్రమైన నాలోచించుకొనవైతివేమి? మంత్రి పదవి యిట్లే నిర్వర్తించుచుంటివాయేమి?

సీతా—నీయధిక్షేపణమునకేమి? అమ్మగారిదాసియైనది మంత్రిని దిట్టకుండ నుండినదె వతె? ఆతఁడిచ్చిన హారమనుచున్నావుగదా! ఆతఁడిచ్చిన హారమనుచున్నావు గదా!

లలిత—ఇచ్చినప్పుడు దొంగిలించితినని చెప్పుటకు నోరాడునా?

సీతా—ఆతఁ డేల యీయవలయును?

లలిత—ఏలయనుప్రశ్న మెందులకు? కోపములేనితిట్టు, ప్రేమలేని పెట్టు నెచ్చటనైన నుండునా?

సీతా—అందుచే నాతఁడు నీయందు ప్రేమగలవాఁడు. అంతేకాదా?

లలిత—సందేహమేమి?

సీతా—అట్లయిన నీకు నాతనికి సంబంధము లేదని చెప్పితివే?

లలిత—ప్రేమయున్నచోట సంబంధ ముండకతప్పదని వ్యాసప్రోక్తమున్నది కాఁబోలు నేమి?

సీతా—లేదులే! సంబంధమున్నచోటఁ బ్రేమకూడ నుండకపోవచ్చును. మనస్సంబంధ మైన ప్రేమసంబంధమే సంబంధము కాని దేహసంబంధ మేమిసంబంధము?

లలిత—ఆతనికి నాకు మనస్సంబంధ మున్నదని నీ వెట్లెఱుంగుదువు?

సీతా—ఆతనికి నీయెడల ననురాగమని చెప్పితివికాదా?

లలిత—అంతేనా? ఆతనియెడలఁ బ్రేమ నాకున్నదని చెప్పితినా? ఒక చేతితో నమస్కారమగునా? ఒక్కముక్కుఱముతోఁ బ్రాణాయామ మగునా? నాలుక యంగిటికిఁ దగులకుండ రుచి పుట్టునా? చేయిచేయి కలియని మల్లయుద్ధ మెట నైనఁ జూచితివా? చందమామా రావే యనఁగఁ జంద్రకళ క్రిందికిదిగునా?

సీతా—నేను టక్కుటిక్కున నడుగుచుండ నీవు టక్కుటిక్కునఁ జెప్పవలసినదే కాని, అట్లు చదివెదవేల? నీకట్టియనురాగము లేనియెడల నీహారము నేల తీసికొంటివి?

లలిత—నీమనస్సునకు నచ్చుట కంతచదివితిని. నే నింటియొద్ద లేనప్పుడు మాయింటికి పొట్లము కట్టి పంపినప్పుడు నే నేమిచేయవలసినది?

సీతా—పోనీ! ఇంటికి వచ్చి చూచినతరువాత నాతని మొగమునఁ బాఱవేయింపక పోయితివా?

లలిత—నేను హారమును జూచుసరికే యాతఁడూరనుండి లేచిపోవ నేను జేయవలసిన దేమి?

సీతా—సరిసరి! అతఁడత్తవారింటికి భాగ్యతోఁ బోయినాఁడని యిప్పుడే విన్నట్లు జ్ఞప్తికి వచ్చినది.

లలిత—అత్తవారింటికే పోయినాఁడో, వల్లకాటికే పోయినాఁడో నాకెట్లు తెలియును?

సీతా—సరే! నీ వీహారమును నాకేల చూపితివి?

లలిత—ఆతఁడు హారమును బంపెనను సంగతి రాజుగారికిఁ దెలియఁబఱచునెడల నాయనమనస్సున కిబ్బందిగా నుండును అమ్మగారితోఁ జెప్పునెడల నామె నామాట నమ్మదు. నీవాహారమును దొంగలించితివని మీఁదుమిక్కిలి నన్నల్లరిచేయునేమో! నాకు రాజవైన నీవే! రాణివైన నీవే! మగడవైన నీవే నీవే యాతఁ డెక్కడనున్నాఁడో కనుఁగొని యాతనికిఁ బంపివేయుము. అట్లు చేసినయెడల నాతనిని జెప్పుఁదీసికొని కొట్టినట్లగును. అదిగాక యాతనికి నాపైనున్న ముందాశ లన్నియు నేలమట్టమగును.

సీతా—నీపై నింక నాశలున్నవా!

లలిత—కావలసినన్ని, మగవానిబ్రదుకు వట్టి పనికిమాలినబ్రదుకు కాకపోవునెడల నొకసారి ఛీ! యన్నపిమ్మట నింకఁ గూడఁగూడఁ దిరుగుటెందులకు? పురుషులని మీకు బ్రహ్మాండమంత పేరు మీపౌరుష మిట్లు భగ్నమగుచున్నది, కట్టితే యని యొక్కసారి యఱవఁగఁ గుక్కసయితము తిరుగ మొగముఁ జూపదే! మీకాసిగ్గు లేదే! మాసౌందర్య మెవ్వఁడైనఁ బరాభవించుచున్నట్లు మాకుఁ దోఁపనీ! వానిని బురుగుక్రిందఁ జూతుమో లేదో! మాకున్న పౌరుషము మీ కెక్కడిది? పౌరుషప్రకటనముకొఱకు దుప్పికొమ్ము పండ్లుకట్టించుకొని మీసాలకు కరకకాయరంగు వేసికొని దేవులాడుటయే కాని నిజమైన మగటిమి మీకులేదు. ఆఁడుది మగవాఁడు. మగవాఁ డాఁడుది.

సీతా—అయ్యయ్యో! ఆతనితోఁబాటు నన్నుఁగూడఁ దిట్టెద వెందులకు?

లలిత—నీవు మగజాతిలోఁ జేరినవాఁడవని భ్రమపడితిని క్షమింపుము. ఆతనితోపాటు నన్నుఁగూడఁ దిట్టెదవెందులకని నీకింత రోషము వచ్చినదికదా! నా శరీరము నీది. నా మనస్సు నీది. నా యాత్మ నీది. నా సర్వస్వము నీదని నీవిప్పుడేకదా చెప్పితివి నీవు నన్నొక్కటియన్నను దప్పులేదు. నేను నిన్ను నాలుగన్నను దప్పులేదు, మనకది విధి, సహజము. భార్యాభర్తృపరిపాటి. ముద్దుపెట్టుకొన్నను మనమే, గ్రుద్దుకొన్నను మనమే. మనకభేదమైనప్పు డఱమర యేమున్నది? అభ్యంతర మేమున్నది? కాని యాతఁడు నిన్నెన్నితిట్లు తిట్టినాఁడో నీ వెఱుఁగుదువా? ఆతిట్లు వినఁగ నాప్రాణ మెంతకొట్టుకొనిపోయినదో! ఛీ! యెందులకు బ్రదికియుంటినిరా యని యెంత యేడ్చితినో! నీసహవాసము చేయు

బట్టికదా, నీయందింత మమకారముతోఁ బ్రాఁకులాడుచుంటఁబట్టికదా నేనింత బాధపడవలసివచ్చినది ఎంతవానికైన సరే మనస్సీయఁగూడదోయి! భగవంతుఁడా!

సీతా—అతఁడు నన్నేమనెనో చెప్పుము.

లలిత—ఏమనెనో చెప్పుమనుటకాదు. ఏమనలేదో యది చెప్పుమనుము. ఆ పొగరుబోతాడినమాటలు నాకు వచ్చునా!

సీతా—పోనీ! అభిప్రాయముఁ జెప్పుము.

లలిత—జ్ఞప్తియున్నంతవఱకు నాతనిమాటలే చెప్పెదను. "నేను నీకెన్నిసారులో వార్త నంపితిని. నీవు నన్ను లక్ష్యపెట్టలేదు. నేను సిద్ధపడియుండఁగ నాపాదములు కొలువవలసిన నామంత్రిగాని చేతఁ గన్నెచెఱఁ బాపించుకొంటివి. నేను మహారాజపుత్త్రుఁడను భవిష్యన్మహారాజునను భయమైన లేకుండ నాతఁడు నిన్నుఁ జేపట్టినాఁడు నీకేమి కన్నులులేవా? బుద్ధిలేదా? పండియైన నెఱుఁగఁగల పడుచుముసలిభేద మెఱుఁగవా? పదునెన్మిదేండ్ల భర్తృదారకుఁడను. సర్వసన్నద్ధుఁడనై యుండఁగ—కడుపులో నల్లమందు, గొంతులోఁ బిల్లికూఁత, కడుపుక్రింద వాతము, నెత్తిపై బట్ట, కాలిపై సొట్ట, నోటిలో లొట్ట గలిగి కాటికిఁ గాళ్ళుచాచుకొన్న ముసలి—

సీతా—చెప్పుము. ఆతనిమాటలుగద!

లలిత—ముసలిగాడిదకొడుకును జేరఁదీసితివి. అతఁడు పరమదుర్మార్గుఁడు. మాతండ్రిగా రాతనియందుఁ బరిపూర్ణవిశ్వాసులైయుండ నాతఁడు స్వామిద్రోహియై ప్రవర్తించినాఁడు. అనేకలక్ష లన్యాయముగ నార్జించినాఁడు. నేను ద్వరలో నాతనిశిరమును ఖండించి కోటగుమ్మున వ్రేలాడఁగట్టించెదను ఆతనియిల్లు కొల్లఁగొట్టి యాసొమ్మంతయు మహాకేళితోఁగూడ నీకిప్పించెదను ఇది ముమ్మాటికి సత్యమైనమాట నేను నిన్నుంచుకొందును. నీవులేనిదే నేను బ్రదుకను. నన్నుఁగాదని నీవు బ్రదుకలేవు ఈసంగతి బాగుగా యోజించుకొనుము." అని యిట్లు శల్యకృంతకములగు హృదయచ్ఛేదకములగు మాటల నాడినాఁడు.

సీతా—అప్పుడు నీ వేమంటివి?

లలిత—నేను వట్టి మాటలదానను గాను చేతిలో బాకు లేకపోయినది ఏమిజరిగి యుండునో? లలితపేరు రాజపుత్రచరిత్రలో నెక్కియుండకపోవునా? లలితనుగూర్చి కవులు నాటకములు వ్రాయకుందురా? లలిత మహాపౌరుషమును గూర్చి పాతివ్రత్యమునుగూర్చి భావిభారతీయకాంత లుపన్యాసము లీయకుందురా? ఏదీ! అంతపని జరిగినదికాదు.

సీతా—నీకు నాయందలిప్రేమకు సంతసించితిని. జగద్దేవుఁడు మంచివాఁడునుమా! ఎంతలో నాతనికి దుర్బుద్ధిపుట్టినది?

లలిత—పసుపుఁదనమున నాఁడుదానియందము, బాల్యమున మగవాని మంచితనము శాశ్వతములఁటయ్యా? ఆ రవంత మెఱుఁగుమాసినతరువాత నాఁడుది పెంట చేఁట. మగవాఁడు తుట్టెపురుగు. డెబ్బదియేండ్లు గడిపిన మీ కెఱుఁగని యంశమా? ఎంతమంచివాని కెట్టిదుర్బుద్ధి పుట్టినదోయని యాశ్చర్యపడినారు మంచివానికి పుట్టకపుట్టక పుట్టినదుర్బుద్ధియే మహాఘోరమైనది. విద్వాంసుఁడో కవియో యున్నాఁడే వాఁడేదో కక్కుఱితిచేత భోగమువీథి కెగఁబడినయెడల నంత విటాధముఁడు, నంత పంకిలాత్ముఁడు మఱియొక్కఁడుండఁడు విప్రనారాయణుఁడు చెసినంత గందరగోళము గాడిదెగత్తర తరువాతి వారకాంతా విటుఁ డెవఁడైనఁ జేయఁగలిగెనా? మంచివాఁడే జనుల కెప్పుడు మహాపకారి. మతవ్యాప్తిలో మహాత్ములు చేసినంత జననాశనము మహాయుద్ధములందైన జరిగెనా? శాపములచే జనబాధ లొనర్చినవారందఱు మహాతపస్వులేకాదా? భారతయుద్ధములో భీష్ముఁడున్నాఁడే అతఁడు విజయుని గాండీవమునకు జడియలేదు. కృష్ణమూర్తి చక్రములకు జడియలేదు. కాని ధర్మరాజు శాపమునకు మాత్రము గడగడలాడుచుండెడివాఁడు. మంచివానిలో నున్నంత మహాపకారశక్తి మఱియెచ్చటను లేదు.

సీతా—నీవయస్సు తక్కువయైనను వార్తలుప్రబలముగనున్నవే. ఉన్నవి లేనివి చుట్టఁబెట్టి చెప్పుచుంటివే?

లలిత—మా పెదతల్లి 'లలితకళ' యని యొక ద్వ్యర్థికావ్యము వ్రాసినది. అది మన యూరిలోని తాళపత్రిగ్రంథసంచయమున నున్నది. ఆమె నన్ను దగ్గఱఁ గూరుచుండఁబెట్టుకొని యేవో పూర్వగాథలు చెప్పుచుండెడిది.

సీతా—సరే. ఇఁక జగద్దేవునిసంగతి యేమియాలోచింపవలసినదా యని మన మింకఁ జూడఁదగినది కాదా?

లలిత—జగద్దేవునిసంగతి మన మాలోచింపనక్కఱలేదు. అతఁడు చేయవలసినపనియేదో యాలోచించుకొని స్థిరపఱచుకొనియే యున్నాఁడు. మనసంగతి యేమాయని మన మాలోచించుకోవలసి యున్నది జగద్దేవునివలన మృతి మీకు రాకుండ నాత్మరక్ష చేసికోఁదలచినయెడల మీరు నన్ను వదలిపెట్టవలయును.

సీతా—నిన్ను వదలిపెట్టకుండ నే నాత్మరక్ష చేసికొనుటకు సాధనమేమియు నుండదా?

లలిత—మీరు నన్నుఁ జంకను బెట్టుకొని యేదేశమైనఁ బాఱిపోఁ దలఁచితిరా యేమి?

సీతా—ఛీ! ఛీ! అది పౌరుషహీనత కాదా?

లలిత—మరణముకంటె మంచిదికాదా? సింగుగారూ! పర్యవసానమున నేఁ జెప్పబోవు మాటను మీరు బాగుగాఁ బరిశీలింపఁదగినది. మీకు సేవచేయుచు మీ పోషణములో నుండుటకు నాకెంత మహావాంఛయున్నను నా మూలమున మీరు మృతినొందుట నా కిష్టముకాదుగదా? మీరు నన్నుఁ ద్యజించిబ్రదుకుఁడు. మీరు నన్ను వదలివైచినతరువాత నేను జగద్దేవునితోఁ జేరి యాతనితోవి

హరెంపుమ "నంతచమత్కారియు నంతవన్నెకాఁడును నంత యనుభవశాలియు నంతయారముగ్గిన సాహసుఁడునైన మంత్రిస్వార్థి పోఁ గడతేర్చిన జాణ నేఁడీ గొప్పైకాయలోఁ గులుకుచున్నాఁడ"ను నప్రతిష్ఠసూత్రము నేను దెచ్చుకొనను మీకు రానీయను ఇది సప్రమాణముగాఁ జెప్పినమాట అందువలన నాతని బారిని మాత్రము మీరు పంపవలదు. నాకిగ్గి మెటులుండునో నట్లు జరుగును. అగ్నిసాక్షిగా మీరు మెడలో మూఁడుముళ్లు వేయలేదుకాని భగవంతునిదృష్టి చేత మీభార్యకంటె నే నెట్టితక్కువ? అట్టి ప్రేమసంబంధ మటుండుఁడు. మంత్రికొఱకు దాసి ప్రాణములు విడుచుట ధర్మముకాని దాసికొఱకు మంత్రి ప్రాణముల విడువఁదగునా!

సీతా—వాఁడేమి నన్నుఁ జంపులయేమి! వానిమొగము వానిమోగ నీ కా భయము వలదు.

లలిత—మాటలదర్పమే మీకున్నబండారమని నే నెఱుఁగనా? ఆఁడు ప్రాణముల్లు ధైర్యముతో నుండఁగలదా?

సీతా—అటులైన నీధైర్యముకొఱకు పలుకుచున్నాను ఆతనిని నేనే చంపించెదను.

లలిత—(తనలో) అమ్మయ్య! ఇప్పటికి సూయమ్మగారి కోర్కె నెఱవేఱునై యున్నది. (ప్రకాశముగా) మీరింత సాహసకార్య మొనర్పఁగలరా?

సీతా—నాప్రాణముమీఁదికి వచ్చినప్పుడు నేనేమి చేయవలసినది? నా ప్రాణమును గూర్చియైన నేనంత లక్ష్యపెట్టనుగాని నాకుఁ బ్రాణాధికయైన నీకు నామూలమునఁ జిక్కువచ్చునట్లు కనఁబడుచున్నది

లలిత—నాకుఁ జిక్కువచ్చునని యెంచి మాత్ర మీరాతనిని జంపింపవలదు.

సీతా—నాచిక్కే నీచిక్కు. మనచిక్కే రాజ్యపుఁజిక్కుకూడను ఆతఁ డున్నందు వలన ననేకబాధలున్నవి. మహారాజా పెద్దవాఁ డైనాఁడు. ఈసంవత్సరమో పై సంవత్సరమో యాతఁడు పండ్లగిలింపక తప్పదు. అటుపైని—

లలిత—మీమాట కడ్డువచ్చితిని. మీరాతనికంటెఁ బెద్దవారుకదా? ఆతనికంటె మీరే ముందావులింతురేమో! ఎవఁ డెఱుఁగును?

సీతా—ఆలాగున నెన్నటికి జరుగదులే. శుక్రనాడీగ్రంథములో నింకను బందొమ్మిది సంవత్సరములు నా కాయుష్యమున్నదని స్థిరపడినది అది సిద్ధాంతవాక్యము కాని మఱియొకటి కాదులే అదిగాక యీపందొమ్మిదేండ్ల శనిదశయున్నదే యిందున నాకు మహారాజవైభవముగా జరుగవనియున్నది డెబ్బదేండ్లు దాఁటిన పిమ్మట మహారాజయోగ మేమని నాకుఁ గొంత సంశయము వెనుకఁ గలిగినది కాని యిప్పుడు నీవు మాటలాడిన సన్నివేశము నాసందేహములో నివృత్తి యైనది.

లలిత—నాకేమియో తెలియకున్నది.

సీతా—మహారాజా లేనట్లే యెంచుకొనుము రణధవళుఁడు వెఱ్ఱివాఁడుకదా! ఎటు వచ్చినను జగద్దేవుఁడు అపఅపలాడుచున్నాఁడు. అతఁడు రాజ్యము కొఱకు మామగారు బిరజానిసాహాయ్యముచే యుద్ధమొనర్చును ప్రజానష్టము ప్రబలముగాఁ గనఁబడుచున్నది. ఇందఱు ప్రజలు వృథగ చచ్చుట మంచిదా? ఒక్క జగద్దేవుఁడు నకారణముగఁ జచ్చుట మంచిదా? ప్రజాసంరక్షణార్థము సూత్రమార్గమున జగద్దేవునిఁ జంపింపక నాకుఁ దీఱనే తీరదు సరి. ఇక్కడికి జగద్దేవుఁడుకూడా లేఁడనియే యెంచుము ఉన్నవారు రణధవళుఁడు తల్లియుం- తల్లి పెద్దది. మంచి మాయలాడిరయే యగును. నిన్ను వారికి సంరక్షకురాలిగ నియమించెదను గావున నీవు తలఁచుకొన్నయెడల నామెను మూఁడు నిముసములలో సాగనంపవచ్చును. ఇఁక నున్నవాఁడు రణధవళుఁడు వాఁడు లేని వాఁడే. ఇంక శనిదశామహారాజయోగము సిద్ధాంతమైనదికదా! నీకు మహా రాజ్ఞియోగము!

లలిత—సింగుగారూ! మిమ్ముఁ బట్టుకొన్నశని నన్నుఁగూడఁ బట్టుకొన్నదేమండి? ఇదిగో నావంటి చక్కనిచుక్క, నావంటి యొయ్యారి, ఇదిగో నావంటిది, అయ్యో! నావంకనైనఁ జూడరేమి? చూపులకేమి గోపము? ఇదిగో నావంటిది మీకీయుత్తరవయస్సులో భార్యగా నుండునని మీజాతకములో నున్నదా? చెప్పరు—?

సీతా—అన్నియు నున్నవి. అనుభవములోనికి రాఁబోవునప్పటికి నిదర్శనముగా నుండును.

లలిత—నామాట నేను జెప్పకొనఁగూడదుకాని నే నొకతెను మీకుఁ బదునెనిమిది రాజ్యముల పెట్టు కాదా?

సీతా—నిజమే ఆసంగతి నామనస్సులో లేకపోలేదు ఇఁక మాటలేల? నీవు నాయింటఁ బాదము పెట్టుటచేతనే నాకు మహారాజయోగము సిద్ధించునని నా నమ్మకము.

లలిత—నేను బుట్టినప్పుడు మాపెదతల్లి మాయింట మహాలక్ష్మి యవతరించినదమ్మాయని యన్నదఁట నాకు మహాలక్ష్మియను పేరే మాతల్లి యుంచుటకు నిశ్చయించెను గాని రాణిగారు నాకు లలితయని పేరిడెను.

సీతా—చూడు లలితా! రాణిగారి పనిమీఁద నీ విటకు వచ్చితినని చెప్పితివి కాదా! ఆమాట యేదియుఁ జెప్పనేలేదే?

లలిత—చెప్పఁదలఁచియే యున్నాను కొడుకు జగద్దేవుఁడు, కోఁడలు వీరమతితో నత్తవారింటికిఁ బోవుచున్నాఁడు. ఆతనికి మార్గమున మృగబాధ యేమియు రాకుండఁ గొందఱు భటులను సాహాయ్యార్థము పంపుమని మీతోఁ జెప్పుమని యమ్మగారు నాతో సెలవిచ్చినారు.

సీతా—నిజముగా యమ్మగారి కాతనియం దిష్టమేనా?

లలిత—ప్రభువుల యిష్టానిష్టత లెట్లు చెప్పవచ్చును?

సీతా—అతఁ డత్తవారింటికే పోవునా?

లలిత—ఆసంగతి యెట్లు తెలియును? పట్టణాస్థానమునందలి పట్టణమునకుఁ బోయి యక్కడఁ గొంతకాలముండి వచ్చునని కొందఱ యభిప్రాయము.

సీతా—ఇఁక వచ్చుట యెక్కడిదిలే. చంపుట కేర్పాటు చేయవలయును.

లలిత—ఎప్పుడు?

సీతా—ఎప్పుడోనా? ఈప్రయాణములోనే. మనరాష్ట్రపు హద్దులు దాఁటినపిమ్మటఁ జంపించిన మంచిది. వాడు మనకెందులకు? అమ్మగారాతని రక్షణార్థము భటుల నంపుమనిరి కాదా? నరహంతలనే భటులవేషముతోఁ బంపెదను. ఎప్పుడుఁ గూడనేయుందురు కావున నవకాశము ననుసరించి వారు చంపుదురు.

లలిత—వా రమ్మగారు పంపిన భటులని తెలియఁగూడదు. అట్లు తెలిసిన యెడల వారు వారిని నమ్మరు. మీరుపంపిన భటులే జగద్దేవునిఁ జంపినయెడల మీకొంప మునఁగునని మీకు భయమున్నదా?

సీతా—నాకాభయములేదు. పై రాజ్యమున మనభటుఁడెవఁడో దొంగ యెవఁడో యెట్లు తెలియును అడవిలోఁ జచ్చినవాఁ డెవనిచేఁ జచ్చెనో దేనిచేఁ జచ్చెనో యెవనికిఁ గావలయును?

లలిత—పాపము జగద్దేవుఁడు వధింపఁబడునుగాఁబోవునని నాగుండెలు దడదడలాడుచున్నవి.

సీతా—పాపము నీది బేలగుండె. నీలాగున గడగడలాడినయెడల మేము రాజకార్యములు నిర్వహింపఁగలమా?

లలిత—ఏదో మాటవచ్చినదికావునఁ జెప్పుచున్నాను. ఒక్కసారి చూయమ్మగారేమన్నారో విందురా? నాకెంతో వింతమాటలాగునఁ గనఁబడినది.

సీతా—ఏమన్నారు?

లలిత—కావలసినవారు గతించినప్పుడు ప్రజ లూరక యేడ్చెదరు. నా కందుల కేడ్వవలయునో నా కాశ్చర్యముగా నుండునని యన్నారు.

సీతా—ఆమె యంతటిదే యగును. ఇప్పుడు నీమీఁద యిష్టమెట్లున్నది.

లలిత—అధ్వాన్నము, నల్లమడుగు.

సీతా—నేనుండగ నీ కొఱరిదయతోఁ బనియేమి? చావఁదలఁచినవానికీ హారమును బంపుట యెందులకు? నే నిచ్చితినిగాదా మెడలో వైచికొనుము. చూడు. భటులను బంపుదునని యమ్మగారితో మనవిఁ జేయుము.

లలిత—నేను బోయెదను.

సీతా—ఇదిగో! ఆగదిలోనుండి పోవచ్చునులే—

ఆ. వె. గూటిలోనఁజిలుక ♦ గుహలోన సారంగి
పద్మపుటములోన ♦ భ్రమరకాంత
సుదక మందుఁగప్ప ♦ యొరయందుఁ దరవారి
(కౌఁగిలించుకొని)
పడుచుదాసి నాదు ♦ బాహువుల్లను.

లలిత — (తనలో) అందుకు నీసంతోష మెంతయో నాయేడుపంత.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



# వీరమతి



## పంచమాంకము

ప్రదేశము — దండకారణ్యము

ప్రవేశము — వీరమతి యొకచేత విల్లును గొని మఱియొకచేత జగద్దేవుని బట్టుకొని నడిపించుచు ప్రవేశించును

జగ — వీరమతీ! అన్వర్థనామధేయవైతివి. నీపుణ్యమున నేను బ్రదికితిని. పెద్దపులి నోటిలో నెంతసూటిగా నెంత ప్రతాపశాలినివై పొడిచితివి?

వీర — దానికేమిగాని మీచేయి సలుపెట్టున్నది? నాథా! మీబాధ నాకు రాఁగూడదా!

జగ — నాబాధ నీకు రావచ్చునుగాని మెఱుపుమెఱయు నంతకంటె శీఘ్రముగ నేను నీవలెఁ బులినోటఁ బొడిచి నిన్ను రక్షింపగలనా? అందువలన నీవట్లు కోరుకొనఁదగదు. చూడు వీరమతీ! పెద్దపులి మొదట నెదుటఁబడగ నేను బలమైన నారాచమును వింటఁ దొడిగి దానిపై వైచితిని

వీర — నే నది కనిపెట్టితిని. ఆబాణము దాని కుడిజబ్బకుఁ దగిలినది. దెబ్బతగులుట యేమి. అది యెగిరివచ్చి మీకుడిచేతిని బట్టుకొనుటయేమి? అబ్బ! అప్పపాటంత వ్యవధిలేకుండ నది యెంతశీఘ్రముగా మీపైఁబడెనో?

జగ — అంతకంటె శీఘ్రముగ నీవు దానిని బొడిచితివి. బల్లె మెప్పుడు పట్టితివో ఎప్పుడు మోపెట్టితివో ఎప్పుడుంకించితివో ఎప్పుడు పొడిచితివో ఆహా! వీరమతీ! నీభర్తనగుటచే ధన్యుడను. నీవుచేసినంత శీఘ్రముగా నీవు చేసినపని యేదో నేను జెప్పలేకుంటినే! చెప్పుటకేమి? సులభము, చేయుట దుర్లభమని కదా యందురు? నీకుఁ జేయుటయే సులభమయ్యెను. నాకది చెప్పుటయే కష్టమయ్యెనుగదా!

వీర — నాథా! ఈగాయ మెప్పటికి మానిపోవునో?

జగ — గాయము లోఁతైనదికాదు. త్వరలోనే మానిపోవచ్చును. వెడలుపైన గాయమగుటచేత మచ్చ కొంచెము పెద్దదిగామాత్ర ముండునని యనుకొందును.

వీర — అయ్యో! ఆమచ్చచే మీ ముంజేయి యందము కొంత తగ్గిపోవునేమోకదా?

జగ — కాదు. ఆమచ్చయే యీచేతికలంకారము. క్షత్రియునిచేతికి శౌర్యమే యలంకారముకదా? నాభార్య శౌర్యముకూడ నాచేతియందే ప్రకాశించుటచేత నిదియే ధన్యతమమైనది.

వీర—ఈగుడ్డపై నింకను రక్తము చిమ్ముచున్నది. కావున మీరొకచోట విశ్రమింపఁ దగినది. అలసియున్నారు. ఈశిలాఫలకముపైఁ బండుకొనుఁడు.

జగ—అటులే.

వీర—మనకు సహాయులుగాఁ బంపబడిన యిద్దరుభటులు కనఁబడకుండ నున్నారేల? పాపము! వారికిఁ గ్రూరసత్త్వము లవలన బాధయేమియుఁ గలిగియుండదుగదా!

జగ—ఏమో! పాపము! వారేమైన మన సాహాయ్యమపేక్షింపఁదగినస్థితిలో నున్నారేమో!

వీర—అయ్యో! మనల రక్షించుటకు వచ్చినవారుకదా! వా రాపదలలో నున్నారేమో. మన ముపేక్షించుట ధర్మమా? నేనొక్కసారి పోయి వారిజాడ కనుఁగొని వత్తునా?

జగ—పుణ్యాత్మురాలా! ఉపకారశీలవైన నీయుద్యమమునకు నే నడ్డుచెప్పుదునా?

వీర—నేను మీకిప్పుడిక్కడఁ జేయు సేవ యేమైన నున్నయెడల నది యాచరించి పోవుదును.

జగ—ఒక్కనిమసమైన యాలసింపవలదు నీవు నాకిక్కడఁ జేయున దేమియులేదు. నీవు దీనులగు ప్రజలకుఁజేసిన సేవయే నాకుఁ జేసిన సేవకంటె శతగుణము అధికము భగవంతుని సేవింపఁదలఁచిన వారికిఁ బ్రజాసేవకంటెఁ బరమసాధనము లేదు. కావునఁ బొమ్ము. నీవు వచ్చులోపల రవంత విశ్రమింతును, నీవు నా చింతను వదలి శీఘ్రముగఁ బొమ్ము.

వీర—నాథా! పోయెదను. (వీరమతి నిష్క్రమించును)

జగ—దుర్బలత్వము హెచ్చుగా నున్నది. వీరమతి భటసంరక్షణార్థము పైకిఁ బోవ దేమోయని నాయదారస్థితి నామెకు వెల్లడింపలేదు. మొత్తముమీఁద స్థితి యేమియు బాగుగా నున్నట్లులేదు హా! భాగ్యదేవతా! ఎంతశక్తిగలదానవు!

గీ. లలితకును నాకు నేదియో ♦ కలదఁటన్న
వార్తయా? దానిపై భ్రాతృ ♦ హార్తననుచు
హా! సవతితల్లి నిందయా? ♦ యందుఁమీఁదఁ
దండ్రి నను ద్రోచివైచుటా? ♦ దానిమీఁదఁ
గన్నతల్లిని బెడఁబాసి ♦ కానలకును
వచ్చుటా? పైని పులివేట? ♦ భటులకొఱకు
సతిని బంపుటా? శక్తిహీ ♦ నతను బ్రాణ
గతిఁగుఱిచి సంశయించుటా? ♦ కాలమహిమ!

(ఇద్దఱుభటులు, రామసింగు, శివప్రసాదుఁడు ప్రవేశింతురు.)

రామ—శివప్రసాదా! అదిగో పులిదెబ్బఁదిని యలసిపోయి యొక్కఁడే యట పండు

కొన్నాఁడు. ఆమె యెటకో పోయినదిరా. ఇంతకంటె మంచిసమయము దొరకదు. ఈతనిని జంపుదమురా.

శివ—రామసింగూ! ఇంకను మేలుకొనియున్నట్లగపడుచున్నది. కునుకులోఁ బొడిచినయెడలఁ బొడిచినవానికిఁ బొడువఁబడినవానికిఁ గూడ సుఖము తెలియు లేదా? అందువలన రవంత శాంతింతము.

రామ—ఈలోపల వీనిమతి వచ్చినయెడల మనయాట సాగదు. పొడుతము రారా!

శివ—ఉండు. ఏదో మాటలాడఁబోవుచున్నాఁడు.

జగ—పరమేశ్వరా!

గీ. కాన నేమైరొ భటులు లింక ♦ గాన రారు
వారి నిద్దఱఁ గృపను బ్రో ♦ వంగదయ్య
కష్టములు మాకొసంగుము ♦ కాని మమ్ము
నాశ్రయించినవారి కీ ♦ యంగవలదు,
ఈశ్వరా! యొక్కవరము నా ♦ కీయవలయుఁ
బ్రాణముండునో యుండదో ♦ యనుచు నెంతు
భార్యరాదయ్యె యిటకామె ♦ వచ్చువరకు
బ్రాణములు నిల్పుమయ్య! యో ♦ పరమపురుష.
గుండె యేమొకో గొంతులోఁ ♦ గొట్టుకొనియె
గ్రుడ్డు లేమొకో లోనికిఁ ♦ గ్రుంకఁదొడఁగె
రామ రఘురామకోదండ ♦ రామ ...
రామ ... ... ...

(మూర్ఛపడును)

(రామసింగు శివప్రసాదుఁడు నాతని సమీపింతురు.)

శివ—అరరే! ఇంతలో నీతని కింతవఱకు వచ్చినదే.

రామ—మనకు మాటఁదక్కుయోగము లేకపోవుటచేత—

శివ—ఇఁకఁ జేయవలసినదేది?

రామ—ఇంకను మరణింపలేదు. ఒక్కవిసరు విసరుదమా?

శివ—(మాటలాడక యూరకుండును.)

రామ—మాటలాడక వెఱ్ఱిమొగము వైచుకొని యట్లు చూచెదవేల?

శివ—నేను వెఱ్ఱిమొగము వైచితినని నీవధిక్షేపించితివి కాని నీ మొగము వెఱ్ఱివ్వర మొగము లాగున నున్నదని నీవు గ్రహింపలేకుండ నున్నావు.

రామ—ఏమో—నాస్థితికూడ నంతవరకు వచ్చినట్లే కనఁబడుచున్నది. ఎక్కడనో పనికిమాలిన దైవప్రార్థనఁ జేసినాఁడేమి? దానిమూలమున మనస్సున కేదో బింకము తగ్గినట్లగపడుచున్నదిరా

శివ—ఆప్రార్థనలో మంత్రియొక్క యవకతవక—లన్నిఁగూర్చి తనభార్యనుగూర్చియు నేమి ప్రార్థించుకొన్నను నేనంత గణింపకపోయినను తనకేయాపదవచ్చినసరే కాని మనకేయాపదయు రాకుండ రక్షింపవలసినదని భగవంతునిఁ బ్రార్థించినాఁడురా. అది నాకొంపతీసినది

రామ—నేనామాట లక్ష్యము చేయలేదు. రాము రామయని పలచివర నేడ్చినాఁడే—అది నన్ను బాధించినది. మాతల్లి తండ్రి రామభజన చేయుటచేత నేను బుట్టితి నఁట. నాకా మాట జ్ఞప్తికివచ్చినదిరా! తల్లిదండ్రుల పాట యొకటి రామభజన మాట యొకటి ఈరెండుకలిసి యేకీభవించి నాకీలునకే పట్టులేకుండఁ జేసిన దేమిరా! దీనిసిగదరగ—ఏదో క్రొత్తరోగములాగున నిదియేమోయి చూడు శివప్రసాదా! మనలఁగూర్చి ప్రార్థించినాఁడని పదోక గొప్పగాఁ జెప్పితివి. ఆమాట నాకు నచ్చలేదు అందులో నొక్క తిరకాసున్నది. మన మాతని హితులమనుకొని యాతఁ డట్లు ప్రార్థించినాఁడు మేము తన గొంతుకోఁతకై వచ్చినవారమని తెలిసియుండినయెడల—అబ్బో! ఒకవ్రేటు వ్రేయువాఁడేకాని మానువాఁడుకాఁడు. నేను మనుష్యతత్త్వముల నొక్క నిమిషములోఁ గని పట్టఁగలను. చూడు శివప్రసాదా! ఎప్పుడు నెఱుఁగనికర్మము వచ్చినదేమిరా? వేఁటకుక్కకుఁ దోఁక ముడుపేమిరా? ఛీ! కడపటిమాట యొక్కటి చెప్పుచున్నాను విను. ఒక్కవిసరు విసరిపోవుదమఁటరా! నీవు 'ఊఁ' యన్నయెడల నేను సిద్ధముగా నున్నాను

శివ—నేనాజోలికింకఁ బోను నామనస్సు తిరిగిపోయినది.

రామ—ఎక్కడనో వెఱ్ఱిముండకొడుకులాగున నన్నావు నాకుమాత్ర మిష్టమని చెప్పి నానఁటోయి? తీఱ వచ్చితిమి కావునఁ గనులు మూసికొని యొక్కదెబ్బ తీసిన యెడల నాలుగుకాసులు చేతిలోఁ బడునేమోయని యాసచేతఁ జెప్పినాను. పోనీ—మనమెవరము చేయిచేసికోవలదు రవంతసే పూరకుండునెడల నాతఁడే చచ్చును. అప్పుడు మంత్రియొద్దకుఁ బోయి మనము చంపితిమని యొప్పు కొందము. కష్టపడకుండ మనసొమ్మదో మనచేతిలోఁ బడును.

శివ—ఛీ ఛీ! అది మఱింతతప్పు.

రామ—నీమనస్సు మంచి పరిపాకమొందినట్లున్నదే నీగొంతుకగోయ. అదృష్టవంతుఁడ వోయి! నేనింకను రవంతయూఁగులాటలోఁ దటపటాయించుచున్నాను గాని నీవప్పుడే—పై కెక్కి బిఱ్ఱబిగిసికొని కూరుచుంటివఁటరా! శివప్రసాదా! నీమనస్సులో నిప్పుడేలాగునున్నదో చెప్పఁగలవఁటరా!

శివ—ఏదోమాత్రము పితేరుగంతులాగునఁ దలక్రిందుగాఁ దిరిగినటు కనబడినదిరా.

జగ—నీవు వెడలినపిమ్మటఁ జాలఁ దొందరచేసినది దేహ మనఃప్రకృతు లొక్కసారి లోయేటఁబడి దించుకొనిపోవునట్లుగ పడెనుకాని వెంటనే మఱలఁ బైకుబికినవి.

వీర—మహాసంతోషము మీమనశ్శరీరప్రకృతులు బలసంపన్నము అగుటచేఁ బులి వ్రేటు మిమ్ము లొంగఁదీయలేకపోయెను ఇప్పటివఱకు మహాదృష్టవంతులము. లేవఁగలరా?

జగ—ఇప్పుడేమియు బాధలేదు లేవలేకేమి? (లేచికూర్చుండును) రామా శివా! మీరు మంత్రిచేఁ బంపఁబడి మాకు మహోపచారములు చేయుచున్నారు. మీ మేలు మఱవలేము

శివ—బాబూ! పొందికగా మాటలాడుట యెట్టిదో నేనెఱుఁగను. మంత్రిగారు మిమ్ములఁ జంపుఁడని మమ్ముఁ బంపినారు వీలు దొరకకపోవుటచే నింత వఱకుఁ జంపలేదు. మీకు జబ్బుగా నున్నప్పుడు చంపుటకు సిద్ధపడినాము కాని మీప్రార్ధనమూలమునఁ జంపలేకపోయినాము ఇది సంగతి. మీరేమిచేసిన మంచిదే

జగ—మంత్రికి నాయెడల ననురాగమేకదా! అతఁడు నామృతి నపేక్షింపనేల?

శివ—అది నాకు తెలియదు.

రామ—మంత్రిని మీసవతితల్లిగారిందులకుఁ బ్రోత్సహించియుండి రనుకొనవలయును.

జగ—శివా! రామ! నన్నుఁ జంపినందువలన మీకు గొప్ప బహుమానము లభించి యుండునే. అయ్యో! మీకాశాభంగ మైనదికదా!

వీర—శివా! రామా! మీకిప్పుడైనఁ బశ్చాత్తాపము పూర్తిగఁ గలిగినదా?

శివ, రామ—కలిగినది

వీర—అటులైన భగవంతుఁడు మీకు మేలొనర్చును నాథా! నాకడియములను వీరికిఁ జెఱియొకటి నిచ్చుట కనుజ్ఞ నీయవలయును.

జగ—మనము పేదవారము. మన కంతకంటె నెక్కువ నిచ్చుటకు శక్తి లేనప్పు డేమి చేయఁగలము?

వీర—ఇదిగో! తీసికొనుఁడు. అదిగో! చేయి వెనుకకుఁ బెట్టుము నద్దు చెప్పఁబోవుచున్నారు తీసికొనకతప్పదు.

శివ, రామ—(తీసికొందురు)

జగ—మీరు మాయందు దయయుంచి పొండు.

శివ—మేము మీయొద్ద నుండఁగూడదా?

జగ—శివా! [illegible] నేపో ప్రరమును జేరి యట వసింతుము. మీరు మాకింకఁ జేయవలసిన దేదియులేదు.

శివ, రామ—చిత్తము, నమస్కారము. సెలవుతీసికొందుము. అమ్మా! సెలవు.

జగ, వీర—సరే. (రామసింగు, శివప్రసాదుఁడు పోవుదురు.)

ర—నాథా! చూచితివా! మంత్రికూడ నెట్లు చేసినాఁడో!

గ—హుఁ.

గీ. జనకుఁ డగువాఁడె సాధింప ♦ శత్రుఁడగుచు
మిగులువారలు రక్షించి ♦ మిడుకువారె?
తల్లివేరూఁత తప్పిన ♦ ధరణిజమును
బంచభూతములైనఁ గా ♦ వంగఁగలవె?

అదిగాక ప్రాణకాంతా! రాజాశ్రయస్థితి యట్టిదే!

గీ. ధరణినాథుని కరుణ యే ♦ సరునియందు
వఱలు నతనకే యన్ని సౌ ♦ భాగ్యములును
నతఁడె గౌరవపాత్రుఁ డౌ ♦ నఖిలజనుల
కతఁడె పూజార్హతను గాంచి ♦ యలరువాఁడు.

విభుని వెలయాలి వేవిళ్ళ ♦ వేడుకలకు
ప్రెగడసతి సూడిదలను బం ♦ పించుచుండు
దేంద్రసేనాని తండ్రి త ♦ ద్దినమునందు
తర్క-వేదాంత మణులె పౌ ♦ త్తరలకడను.

నాథు తార్ప్యకాని శ్వా ♦ నంబు మృతిని
జెంద మంత్రి పరామరి ♦ సించు నతని,
హాస్యకరు మఱఁదలు సమ ♦ ర్తాడునాఁడు
రాజ బంధుల విందులు ♦ రాత్రిపూట.

రాజు చిఱునవ్వు లేవంకఁ ♦ బరిఢవిలునో
యఖిల జనదృష్టు లావంక ♦ నతిశయిల్లు
రాజు బొమముడి యేవంకఁ ♦ బ్రజ్వరిలునో
పేఁడపురుగైన నావంక ♦ వెడలఁబోదు.

ప్రభుని దయవేళఁ గాళులు ♦ పట్టు భటులు
ప్రభు కరుణ దప్ప గొంతుకఁ ♦ బట్టుకొంద్రు
ప్రభుని కాగ్రహాపాత్రుని ♦ బాధపెట్టి
ప్రభుదయావృద్ధిఁ బడయుట ♦ ప్రజలవాంఛ.

గలకలనినాదకలనల ♦ వెలయుపక్షు
లఱపురికలేక వ్యాధినే ♦ మఱవఁజేయఁ
బ్రాణదంబైన నీకర ♦ స్పర్శముననె
ద్వరగ నారోగ్యపదవినేఁ ♦ బడయువాఁడ.

అదిగాక, వీరమతీ! పరమార్థమైన యొకమాట—

గీ. ఇంట బ్రదుకువారు ♦ నిటను జచ్చెడివారు
గలరటంచుఁ జెప్పఁ ♦ గలమె మనము?
ఎవని కెప్పు డెదక ♦ ఋణము తీరునో యప్పు
డాతఁ డెచట నున్న ♦ నంతమందు.

వీర—నాథా! మీయిష్టము మీ రారోగ్యవంతులగు మూఁడునాల్గుదినములు మాత్రము కదలకుండ నిటనే యుండుఁడు.

జగ—అట్లుపై నెట్లైనఁబోయి ధర్మమార్గమునఁ బరోపకారశీలమున జీవింతము.

వీర—స్వార్థపరిత్యాగమున ననికూడఁ జెప్పవలయుఁగాక.

జగ—సెబాస్ ధర్మస్వరూపురాలా! తథాస్తు. ఇంత యుత్తమురాలవగు సతీమణికి భర్తనైన నాకంటె మహాభాగ్యశాలి యెవ్వఁడు! పూర్వరాజేంద్రులు భార్యల సాహాయ్యమునఁ గష్టములు నిస్తరించిరని చెప్పినారు నీసన్నిధిని నిస్తరించుటకు నాకుఁ గష్టములే కానఁబడకుండ నున్నవే—

వీర—నాథా! అప్పుడే యేమైనది. ముందింక నేమిరానున్నదో యెవ్వఁడెఱుఁగును?

జగ—రానిమ్ము. తోంబదిరానిమ్ము నీవుచెప్పినమాం దెంతముందు! అరకోసుముందు. ఎక్కువయగునెడలఁ గ్రోసుండును అంతేకాదా? ఈమాత్రపుముందును గణింప వలదు ఇంతకంటెముందు, మఱి యింకనుముందు, మఱిమఱి ఇంకనుముందుఁ గనఁబడుననిర్వచనీయమైన మహాపదవివంక నిశ్చలదృష్టి పెట్టుకొని నడువుము. నడుమ నడుమనున్న యీచిన్న ముంగులబాధ నీకేమైన నుండునేమో?

వీర—ప్రాణనాథా! అంత ముందున్న మహాపదవిని నేను జూచుట కసమర్థురాలను. మీరే దానివంకఁజూచి నడువుఁడు. నాకు మహాతేజము మీరేకావున మీచేయి పట్టుకొని కూడవత్తును. నాథా! ఇక్కడ ఆశీఫలకముచే మీదేహము మిగుల నొత్తుకొనును ఆచెట్టుక్రింద శీతయాకులతోఁ బ్రక్క వేసెదను. అక్కడఁ గొంత ప్రాశన మొనర్చి పండుకొందురుగాని రండు ఇఁక నట్టిమాటలాడుట మీకాయాసముగా నుండును. నిమ్మళముగ లెండు

(ఇద్దఱు కలసి నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

శ్రీరామ

# వీరమతి

## షష్ఠాంకము

ప్రదేశము—పట్టన ప్రాంతము.

ప్రవేశము—వీరమతి, జగద్దేవుఁడు.

వీర—ఎంతసేపటిలో వచ్చెదరు?

జగ—మన నివాసమునకుఁ దగినబస యేదైనఁ జూచి త్వరలో వత్తును.

వీర—బస త్వరగఁ గుదురునని యేమి నమ్మకము? ఎంతసేపాలసించెదరో యని భయముగా నున్నది.

జగ—మహారణ్యమధ్యమున మహాక్రూరజంతుమధ్యమున నాకు జబ్బుగా నున్నప్పు డొక్కర్తెవు తిరిగినదానవుకదా! ఇప్పు డూరిబైట చెఱువుగట్టుమీఁద జనములు నీటికై వచ్చుచుఁ బోవుచున్న సమయమున రెండుబారల ప్రొద్దెక్కిన వేళను వీరమతీ! భయముగాఁ నున్నదని చెప్పుచుంటి వేల?

వీర—అడవిలోఁ దిరిగినంతసేపు నేదియో యుత్సాహముగానే యుండెను అమాయకములై నిష్కళంకములయిన సాధుమృగములతోఁ జెలిమి చేయుటచేతను ఫలాహారములలోఁ బాలిపంపులకుఁ బక్షులతోపాటు భాగస్వాములమై ప్రవర్తించుటచేతను, ప్రకృతి సౌందర్యదర్శనానంద నిమగ్నులమై యుంటచేతను మనకు జరిగిన కీడును బరాభవమును మఱచియే పోయితిమి. మనము బాధపెట్టఁబడినది పరాభవింపఁబడినది మనుజులచేతఁగాని వనమృగముల చేతఁగాదు. తిరుగ మనుజుల మొగములు కనఁబడుటచే వెనుకటి యవమానము అన్నియు మనస్సును బొడుచుచున్నవి. ఈ పడుచు దెవ్వతెయో యీ చెఱువుగట్టునఁ దటపటాయించుచున్నదని యీ వచ్చుపోవు వారెవ్వరైన గుజగుజలాడుదురో! వంకబారున నవ్వుదురో యని నా కెంతయైన భయముగానున్నది. నా కీభయ మడవిలో లేదు. మనష్యులకు మహామృగములకంటె మనుష్యులే ప్రబలబాధకరులుగాదా?

జగ—(తనలో) ఆహా! స్థిరముగాఁ గాపురముండుటకు మొదట నేర్పాటుచేసికొన్న పట్టణము చేరితిమికదా! ఇఁక మనకేమిబాధయని నేను సంతోషించుచుంటిని. ఈమె మనస్సులో నింతబాధ పడుచున్నదని యెఱుఁగకపోయితినే. ఆఁడుదాని

యంతరంగవైఖరి యభిమానప్రకృతి యెంత సహవాస మొనర్చినవానైన మగవాఁడు తెలిసికొనఁజాలఁడు. అవలీలగఁ బెద్దపులిని బొడిచిన వీరురాలే. ఆమె యెవ్వతెయో యని యొక రెవ్వరైన ననుకొందురేమో యని గడగడలాడుచున్నది. అహా! కాంతాచిత్తవైచిత్రీమహిమము! అందులో నాఁడుదానిమర్యాద! అది యనిర్వర్ణ్యము. అది పరమాణువుకంటె సూక్ష్మమైనది; పర్వతముకంటె స్థూలమైనది. అది శిరీషకుసుమముకంటె మెత్తనైనది. చంద్రహాసముకంటె వాఁడియైనది. అది గాజుకంటె పెళుసైనది. కనకముకంటె సాగుడుకలది. దాని తత్త్వ మెవఁడు గ్రహింపఁగలఁడు? గోనెగుడ్డమీఁదఁ గుచ్చుతోఁగాని కాగితముమీఁదఁ గలముతోఁగాని మగవాఁడు గీచిన యాఁడుబొమ్మలున్నవే! అవి యన్నియు మగతనము చెడిన మగబొమ్మలుకాని యాడుబొమ్మలు కావు.

గీ. ఆఁడుదానికంటె ♦ నజ్ఞాతమైనట్టి
చిక్కు వేఱెకలదె ♦ సృష్టిలోన?
నది గ్రహింపఁగలుగు ♦ నతఁడు పరబ్రహ్మ
తత్త్వమును గ్రహింపఁ ♦ దగినవాఁడు

వీర—నాథా! నేనన్నమాటలకు మీరు ప్రత్యుత్తరమిచ్చుటకుఁ జిక్కుపడుచున్నట్లున్నారు. ఈయనకక్కఱలేదు. నే నిటనుందును, మీరు పట్టణములోనికిఁ బోయి బసచూచి వేగరండు.

జగ—బసచూచుటకుఁగూడ నిన్ను నా వెంటఁ దీసికొనిపోవుదునాయని చూచుచున్నాను.

వీర—అదితగదు. దానివలన మఱింత బాధయున్నది. నే నిట నే యుందును. చేతిలోఁ గత్తియుండఁగా నాకు బాధయేమియు లేదుగదా! ఎవరైనా వచ్చి యేమైన హానిచేయుదురని నేను జడియుచుండుటలేదు. కాని యేయమ్మయైన వచ్చి నీవెవ్వతెవు? ఎటనుండివచ్చితివి? నీభర్త యెవ్వరు? ఇక్కడకు రాఁబనియేమి? యని నన్నడుగునెడల నేనేమి చెప్పవలసినది?

జగ—అసత్యము చెప్పుమని నిన్ను నేను ప్రోత్సహింతునా?

వీర—అబ్బే! అట్లు నే ననుకొందునా? ఎవతయైన వచ్చి యట్లడుగునెడల "నీ కెందులకమ్మా నీ వావలికిఁ బొమ్ము. నీతోఁ జెప్పవలసినదేమున్న దని" నే ననునెడల మంచిదేమో?

జగ—ఆమె యప్పటికి కావలికిఁ బోయి మఱినల్వురతోఁ దిరిగివచ్చును. మూసిపెట్టినది పైకిఁ దీయుటకు, మాటుపఱచినది చూచుటకుఁ, జెప్పనిది తెలిసికొనుటకు వాంఛ జనులకు మహాధికమై యుండును. మనకు దాఁపఱిక మెందులకు? బాహాటముగ సత్యమే పలుకవచ్చును. మన మెవ్వరికైనఁ దప్పొనర్చితిమా? మనకు భయమేల?

వీర — నాథా! అదృష్టహీనతకున్న భయము మఱియేమున్నది? అయిన నీమాట లెందులకు? మీరు త్వరలోఁ బొండు.

జగ — అటులే. భద్రముగనుండుము త్వరగలోవత్తును. ఈ చెట్టుక్రిందఁ గూరుచుండుము.

(జగద్దేవుడు నిష్క్రమించును.)

వీర — పరమేశ్వరుఁడా! అత్తమామలచేఁ బరాభవింపఁబడితిని. తల్లికంటె నెక్కువగఁ గనిపట్టుచున్న యత్తగారినుండి వేఱుచేయఁబడితిని. రాజ్యమునుండి బహిష్కరింపఁబడితిమి. దూరదేశమునఁ బొట్టకూటికొఱకు కల్లలాడుచుంటిమి. భర్త కూడనున్నాఁడుకదా యని వెనుకటి యాపదల నేమియు లక్ష్యపెట్టలేదు. మహాప్రభూ! నాభర్తనుండి మాత్రము నన్ను వేఱుచేయకుమా! ఇదియే నా ప్రార్థనము.

(జగద్దేవుఁడు ప్రవేశించును.)

ఏమి నాథా! మాటలోనే తిరిగివచ్చితిరి?

జగ — ఇంకను వెడలనిదే- ఎందువలననో కాని వెడలుటకుఁ గాళ్లాడకున్నవి. మఱియొకసారి చూచిపోవలయునని వచ్చితిని.

వీర — ఒకకంటివ్యాధి రెండవకంటికి వ్యాపించినట్లు నామనస్సులోని యారాటము. మీమనస్సునఁ గూడ నావరించినది. మఱేమియు భయములేదు. వేగపొండు

జగ — (తనలో)

గీ. కతములేకయె మతిలోనఁ ♦ గలఁత గలుగఁ
గీడు రానున్న దనుచు శం ♦ కింపవలయు
వార్థిపై నేడ్పుఁబోలు రా ♦ వములు గలుగ
నుప్పెనను బ్రతీక్షించుట ♦ తప్పుగాదు.

(ప్రకా) ప్రాణకాంతా! మన విడ్డిఱియుఁగూడ బస చూచితిమి నన్నుం.

వీర — ఎంతలకాలయూహము? ఆజానుబాహుల్లలు, ఆకర్ణాంతనేత్రులు నైన మీరే పాదచారులై బసకొఱకు వీథివీథిని సందుసందున నెక్కుగుమ్మముగ దిగుగుమ్మముగఁ బోవుచుండ మిమ్ముఁ గాంచియే పట్టణప్రజలు "ఈతఁ డెవఁడు? మన రాజునకు మిత్రుఁడా శత్రుఁడా" యని గుజగుజలాడుచు గుబ్బెటలుపడుచు మీకుఁ బోవుటకు దారియైన నీయకుండ మీచుట్టు మూఁగుచుండిరే— అట్టియెడల మీతోఁ గూడ నేనుండు నెడల నిఁక నసుగనక్కఱలేదు నాకేమియుభయము లేదు. నన్నెవ్వరైనఁ జూచినను వింతపడి నిలువున స్తంభించిపోరు. మీసౌందర్యములో నట్టి యాశ్చర్యజనకమైన ధాటి యున్నది. ఫాలము చెక్కులు రవంత కానఁబడనీకుండ మీరు గ్రామములోనికిఁబొండు. ఇక్కడనే యాలస్యమగుచున్నది. మీరు పోవుట యెన్నఁడు? బస కుదిర్చి నన్నుఁ దీసికొని పోవుట యెన్నఁడు?

జగ—(తనలో) ఇదివఱకుఁ బడిన యాపదలు మఱల నొకసారి రాఁగ నాందోళన పడుచున్నాము. అంతేకాని క్రొత్త యాపదలు వచ్చుచున్నవా? కగపడుచుండెనా! రానీయకుము అవనిలో నున్నంతకాలము యాపదలే యెఱుఁగక, తేఁట బఱచను నకుఁ వచ్చినపిమ్మట నాపదలని జడియుచుంటిమి. ఇది బుద్ధిహీనతయేమో? (ప్రకా) ప్రాణకాంతా! నేను బోవుదును.

(తనలో)

గీ. వర్షశాంతికిఁ బూర్వము ♦ వారిదంబు
బడబడలు సేయు; దిగఁబోవు ♦ జ్వరము తుదకు
నూపు నొకసారి, యారిపో ♦ నున్నదీప
మట్టె మండు, నాఁదలఁపు ♦ నిట్టెవిధము.
బాహిరప్రకృతికి సరి ♦ పడిన సూత్ర
మంతరంగ ప్రకృతికిని ♦ నదుకు సరిగ.
నంతరము బాహిరంబని ♦ యనుటకాని
పైని లోపల నొక్కటే ♦ ప్రకృతికాదె?

ఈయుల్జడి నాయాపద లింతటితో శాంతించుటకే యని తోఁచుచున్నది

(జగద్దేవుఁడు నిష్క్రమించును.)

వీర—తప్పున్నదో లేదో తెలిసికొనకుండ బహిష్కరించుటా? మహారాజే—అందు మీఁదఁ దండ్రియే - ఇది ధర్మమా?

(నేపథ్యమున) ధర్మము - ధర్మము.

వీర—ఛీ! ఛీ! ఇక్కడఁగూడ మాకు శత్రువులున్నారు కాఁబోలు!

(జంబుకి ప్రవేశించును.)

జంబు—అమ్మా! ధర్మము. ధర్మము.

వీర—ఇదిగో! ఈ కాసు తీసికొని పొమ్ము.

జంబు—(కూరుచుండి) (తనలో) ఈ కాసుతో నాకేమిపని? ఈమె యెవతెయో మోసమునఁ దెలిసికొని నన్నుఁ బోషించుచున్న యామె కప్పఁజెప్పెదను (ప్రకా) అమ్మా! నీయమ్మకడుపు చల్లఁగా—నీయత్తకడుపు చల్లఁగా—నూ రేండ్లు వర్ధిల్లుమమ్మా! నాతల్లీ! మహాలక్ష్మిలాగున నాకంటఁ బడినావు. ప్రొద్దుటినుండి తిరుగుచున్నాను. ఇందఱయ్యకొయ్యలున్నారు. ఇందఱమ్మలక్కలున్నారు. ఒక్కరుగవ్వ చేతఁబెట్టినపాపమున నెవ్వరును బోలేదమ్మా? మావరాలతల్లి—మాకాసులతల్లి—

వీర—నీదయకు సంతసించితిని. పోయి యుదిమార్చుకొని సామగ్రి తెచ్చుకొని భుజియించి సుఖముండుము. పొమ్ము

జంబు—పోవుచునమ్మా! కాళ్ళలోఁ గీళ్ళకన్నిటికిఁ బట్టమ్మా—నడుము లేదమ్మా—కూరుచున్నపెమ్మట నెంతసేపటికోకాని తిరిగి లేవలేనమ్మా— ఈప్రక్కనుండి యిప్పుడే పోవుచున్నాఁడే—ఎండలాగున వెలిఁగిపోవుచున్నాఁడే—ఆయనేనా అమ్మా నీమగఁడు—నీపసుపుకుంకుమ నిత్యము వర్ధిల్లవలెనమ్మా—

వీర—అమ్మా! ఆసంగతి నీకెట్లు తెలిసినది?

జంబు—(నవ్వుచు) నే నెంతముసలిదాననైనను నెంతమ్మగారి కెంతయ్యగారుమగఁడుగా నుండవలెనో యప్పుడే మఱచిపోయితి ననుకొంటిరా. సత్యప్రమాణముగా నతఁడు మహారాజు కొడుకుగాని మఱియొకఁడుగాఁడమ్మా

వీర—(తనలో) అయ్యో! ఇది యీసంగతికూడ గనిపట్టినట్లున్నదే. (ప్రకా) అమ్మా! నీపేరు.

జంబు—(తనలో) ఎందులకైన మంచిది నాపేరు జంబుకియని చెప్పను. (ప్రకా) అమ్మా! సత్యభామ.

వీర—సత్యభామా! ఆయన మహారాజకొడుకని నీ వెట్లుగుర్తించితివి?

జంబు—(తనలో) అద్దీ! కాకి గిఱగిర తిరిగిపడినది. (ప్రకా) అమ్మా! ఎన్నియంతఃపురములలో మసలినదానను ఎందఱు రాణులయొద్ద నెంత తలలోనాలుకలాగునఁ దిరిగినదానను. సత్యభామసాటి దీకలియుగములో లేదనిపించుకొన్నదానను గానా అమ్మా! ఎన్నినగళులలోఁ బాలిచ్చినముండను- అయ్యో- పిచ్చితల్లీ- మీబొట్టన్నకుఁ బాలిచ్చినదానను గానా అమ్మా!

వీర—ఆఁ ఆ నీవు ధారానగరమునకు వచ్చి మాభవానీ అత్తయ్యయొద్దఁ గొంతకాలము పాలదాయిగా నుంటివా? నాభర్తకుఁ బాలిచ్చితివా?

జంబు—(తనలో) సెబాస్! మంచు విడిపోవుచున్నది. (ప్రకా) ఓసి నా వెఱ్ఱితల్లి! భవానమ్మ నాకుఁ గ్రొత్తయా? ఎన్నిపాలిచ్చిననైన బొట్టన్నకుఁ గడుపునిండలేదన్నమాటయేకద! అఅమ్మ- ఏమి యిల్లాలమ్మా! ఎంత మంచితల్లి అమ్మా!

వీర—ఎంతయుత్తమురాలు కానియేమి నంత సవతిపోరు పడఁగలదా?

జంబు—(తనలో) అద్దీ! మఱియొకసంగతి! (ప్రకా, గుండెలు కొట్టుకొని) అమ్మ- అమ్మ- నాతోఁ జెప్పకమ్మ- ఆతల్లి పడినబాధ తలఁచుకొనఁగఁ కడుపు నీరైపోవునమ్మా. అయ్యో! అయ్యో! ఎంతపగదానికైన నంతకోఁతవలదమ్మా. అంత కత్తెరబోను కాపుర మాతల్లి చేసినదికాని, ఓనూరన్నతండ్రీ! మఱియొవ్వతె పలదుబాబూ- ఆమెమూలమున నే మీ కింతవఱకు వచ్చినదికాఁబోలు. చెప్పనేమి మాతల్లీ!

వీర—ఆమెచేసిన దేమున్నది? మాకర్మ మిట్లున్నది.

జంబు—ఇల్లాలవమ్మా! నీవత్తగారిమీఁద నాడిమాట చెప్పవేవమ్మా. నే నెఱుఁగుదును మాతల్లీ! బాబూ! ఎక్కడకు వెళ్ళుచున్నావని మాబొట్టనాయన నడుగవలయునని యనుకొన్నాను, బాగుగా నప్పటికి గుర్తింపలేక గొంత, అపశకున

మని కొంత, సందేహించి యూరకుంటినమ్మా.

వీర—ఇంక మేమీయూరనే కాపురముందుము. బసచూచుటకు వెళ్ళినారు.

జంబు—ఎంత చల్లనిమాట చెప్పినావు మాఅమ్మా! మీ రిచ్చటనే యుండునెడల మీయొద్ద నేను సేవకురాలుగ నుందును. వంట మొదలుకొని యింటిపని యంతయుఁ జేసెదను. అమ్మా! కడుపేమైనఁ గాలినదా?

వీర—లేదు.

జంబు—వచ్చిరైనఁబోలేదా.

వీర—లేదు.

జంబు—మాబొజ్జన్న కట్టి చూపుల గుజ్జుమేనా? అమ్మా! కడుపునకేమిలోపమమ్మా. ఈయూరఁ గాళికమ్మగుడిలోఁ గప్పస్తంభమును గౌఁగిలించుకొన్నవా రెందఱో పిల్లల నెత్తికొని యింటికిఁ బోయినారమ్మా!

వీర—సత్యభామా! ఆమాటలెందులకు? కాని నీవు వంట బాగుగాఁ జేయఁగలవా?

జంబు—అబ్బోఅమ్మ! మాచిట్టితల్లి! నీయొద్ద లాలాగున నలయునిచ్చెదనేమో. నిన్నుఁ బువ్వులాగునఁ గూరుచుండఁబెట్టనియెడల సిగదఱిగించు. ని న్నెంత సుఖ పెట్టుదునో చూతువుకాని. వంట బాగుగాఁ జేయఁగలవాయని యడిగినావా? ఆవడలు - అప్పరీలు, పాలముంజెలు - పకోడీలు, బాతులు - పలావులు, మండిగలు - మదనపురులు, గడబిడలు - గపుచిప్పలు— ఒక్కటియేమి? నూటాఱు పిండివంటలు వేయాఱు రుచులతోఁ జేయఁగలనమ్మా.

వీర—ఆహా! నాభర్త యింకను రాలే దెందువలననో ?

జంబు—ఊరివారి సాహాయ్యము లేకుండఁ బై యూరివాఁ డిక్కడ బస కుదుర్చుకొనఁ గలఁడా? అందుచేత నేనుబోయి—అమ్మా! రవంతయూఁతనిమ్మ—ఆ. ఆ. అదిగో అది. ఇఁకఁజాలు - బసకుదిర్చి మాబాబుతో నరగడియలో నిచ్చటకు వత్తును. ఇంతటినుండి నాబొందిరో నాబొందిరో యని దేవులాడవలసిన దానను నేనేకాదా? అమ్మా! యిప్పుడేవచ్చెదను. నీకు మఱేమియు భయము లేదమ్మా! శ్రీరామరక్ష. శ్రీరామరక్ష.

వీర—సరే. పొమ్మా.

జంబు—(పరిక్రమించి తనలో) వెన్నపూసవంటికున్నది. బుజ్జగుంజావంటిపడుచు. లేఁత మొవ్వు. కమ్మని పొంకఁ జీడిపప్పు. వేఱుపనసతొన. దీనిని వేశ్యాచక్రవర్తిని కప్పఁజెప్పి నా రొక్కమేదో రెండురెట్లు చేతిలో వేయించుకొందును. రంభ వంటి రాచబిడ్డ నప్పఁజెప్పినప్పుడే పదికాసు లీయకపోయిన యెడల దీనిపాలన పాముగఱువను! నాకెందులకు? (నిష్క్రమించును.)

వీర—పోనీ. పెద్దది. నాభర్తయం దభిమానముగలది. సేవకు దొరకినది. ఎవతెయో యొకతె యుండవలయును గాదా? అభిమానమున్న యాఁడుది యైనయెడల మంచిదికాదా? నాభర్త యింకను రాలే దెందువలననో! ఒక్క యరనిముస

మొక్క మాసముగాఁ గడచుచున్నదే! నా మనస్సదియేమి దిక్కుమాలిన మనస్సో! ఎంతసేపు నీతనే సంశయించుచున్నది, ఎంతసేపు నాపదనే యనుమానించుచున్నదికదా! బసకుఁ రుసని భర్త వచ్చునని సుఖపడుదునన్న యూహానే మనస్సునకు రాకుండనున్నదే! ఎంత పాపాత్మురాలను నాదుష్ట చిత్తమే నాభర్తకింత దురదృష్టముం గలిగించెనేమో? ఎంతసేపు కష్టమో కష్టమో యని స్మరించుచున్నప్పుడు కష్టముకాక సుఖము వచ్చునా? అనవసరముగఁ గీడెన్నఁడు సందేహింపరాదు భగవంతుఁ డున్నాఁడు. మనలరక్షించును. అనన్యపూర్ణవిశ్వాసముతోడనే యుండవలయును ఓపరాత్పరుఁడా! ఓహో! భగవానుఁడా!

(నేపథ్యమున) ఓభాయీ! ఓహోభాయి.

వీర—(తొంగి చూచి) అదేమి? ఎవరో సవారినెక్కి యిక్కడకు వచ్చుచున్నారు నానాథుఁడే యైయుండునా? పాదచారియై బసకొఱకుఁ బోయిన యాతఁ డింతలోఁ బల్లకినెక్కి వచ్చుట సిద్ధించునా? ఏమో! సవితృమండలస్వరూపము గలవాఁడు సార్వభౌమ సర్వమంగళ సద్గుణసమంజసుఁడు అట్టియాతని నీయూరి మహారాజో మంత్రియో గుర్తించి యిట్లు బహూమానింపఁగూడదా? అట్లు జరుగుట యాశ్చర్యమా? ఆయన కేమిలోపము? వాగ్గౌరవలోపమా? రూపసౌందర్యలోపమా? అభిజాత్యలక్ష్మీలోపమా? అదృష్టదేవత—అగత్యాగతి తెలియఁగక, యాతనియెడల నవహేళనముగ వర్తించిన యదృష్టదేవత—తన తప్పు తాను గుర్తించుకొని యింకనైన లెంపలు వైచుకొనకపోవునా? అదిగో, తగుమాత్రపుఁ బరిజనముకూడ సవారివెంట వచ్చుచున్నది ఒకటికాదు పల్లకులు రెండు వచ్చుచున్నవి

(నేపథ్యమున) ఆఁపు. సవారియాఁపు. నేను దిగి యిఁక నడవవలయును పల్లకులు నాకూడ రానిండు.

వీర (తనలో) అయ్యయ్యో! నాభర్త కాఁడు ఆఁడుదాని కంఠరవము వినఁబడుచున్నది. ఓ పనికిమాలిన చిత్తమా! ఎంతసేపటిలోఁ బొంగిపోయితివి ఎంతసేపటిలోఁ జల్లారితివి! తుపానుకరడుకంటెఁ బాలపొంగుకంటె లఘుతరముగ నుంటివి. కొఱవిదయ్యపువెలుతురుకైన గప్పమని మాయమైనట్లయ్యెనే ఈపనికిమాలిన చిత్తమునకు బానిసయైనవానికంటె భాగ్యహీనుఁడు ప్రపంచమున నుండఁడు. దాని గంగవెఱ్ఱు లడఁచుటకే మహాత్ములెన్నిపాటులో పడినారు. నావంటి మందభాగ్యురాలిమాట లెక్కయేమి?

(నేపథ్యమున) ఆకానుగుచెట్టుక్రింద నొక రాచబిడ్డ కూరుచుండి యున్నది భటుఁడా! అక్కడకు దారిచూపుము.

వీర—(తొంగి చూచి) ఆమె యెవ్వతెయో ప్రసిద్ధస్త్రీవలె నున్నది. నాకొఱకు వచ్చుచున్నట్లు స్పష్టము భర్తవచ్చి భార్యను దీసికొనిపోవుట యనుచితమని యెంచి

యుచితమగు పరివారముతో నొక కాంతను నాకొఱకుఁ బంపియుండెననుట నిస్సంశయము. మనస్సా! తిరుగ నెంతయొ కలఁగితివి! ఈనాఁటి పేకచువ్వవలెఁ గ్రిందఁబడెదవా? జైనుల ముక్తాత్మవలె నెప్పుడు పైకే పోవుచుందువా? కాక యూపకసల్లి తలయూపులవలె బాధించి చంపుదువా?

(నేపథ్యమున) నే నొక్కతెనే చెట్టుక్రిందికిఁ బోదును. మీరందఱు కొంతదూరమున నుండుఁడు. పల్లకులు మాత్రము చెట్టుప్రక్క నుంపుఁడు. వాహకులు చాటున నుండవలయును తెలిసినదా?

(జాంబవతి ప్రవేశించును.)

జాంబ — జంబుకిముండ నేఁటికిఁ గలభకన్యను బట్టినది నన్నుంచుకొన్న దండనాథుని పుత్త్రునితోఁ జెప్పి రాజశత్రుఁడను మిషమున నీమె భర్తను కారాగృహమున నుంపించితిని ఈ రాజకన్యకను దీసికొనిపోయి నా పడుకగదిలో బంధించి నన్నుంచిన యాతని కొడుకునకుఁ దార్చి పదివేల బంగారునాణెములు తీసికొందును. వహ్వా ధనమునకేమి కాని—ఓ-దేవకన్యకను మించిన పూవుఁబోఁడి సిద్ధించినది ఈమె పాతివ్రత్యమును భ్రష్టమొనర్చుటయే ప్రయోజకత్వము. అబ్బ! అబ్బ! సంసారిణులకు వేశ్యలనఁగా నెంతలోఁత—నెత్తిపైఁ బెట్టిన చిల్లిగవ్వయంత విలువసేయని నిర్భాగ్యురాలైనను మాయనుపఁ బెట్టెలలోని లక్షలకంటెఁ దనమెడలోని పసపుకొమ్మున కెక్కువ విలువ యని తెగనీల్గి తెగనీల్గి తెగటాఱును అందులో రాజకాంతలకు వ్యభిచారిణులనఁగ లోఁకలి బండకంటె నెక్కువలోఁత- గొంగళిపురుగులకంటె నెక్కువ జలదరింపు నాచేతఁబడిన యీక్షత్త్రియకాంత సాధ్వీత్వము క్షీణమొనర్చి రాజకాంతలందఱు తల నేలకు వంచుకొనునట్లు చేసెదను. అట్లు సేయక మానుదునా? ఇదివఱ కెన్నివందల సంసారిణులను భ్రష్టపఱచితినో? సంసారిణులఁట—సానులకంటె నెక్కువయఁట—థూ! ఎక్కడెక్కడనున్న వేశ్యలను నిక్కడకు దండనాథపుత్త్రునిచేఁ దొప్పడుచేయుటకుఁ బిలిపించితినిగదా! ఇక్కడ సానిసంఘ మొకటి యేర్పాటుచేసెదను సంసారిణుల సాధ్వీత్వమును జంపుటయే మాసభాముఖ్యోద్దేశము. సానికి బ్రాహ్మణకాంత కాళ్లుపట్టు దినములు, క్షత్త్రియకాంత వీవనవిసరు దినములు, వైశ్యకాంత మడుపు లందిచ్చు దినములు- అట్టి మహోన్నదినము అచిరకాలములోనే రానైయున్నవి. అప్పుడుగాని జాతి బాగుపడనేరదు అప్పుడుకాని దేశమునకు మోక్షముండదు ఇఁక నట్టె యాలసింపఁ దగదు. (తన్నుఁజూచుకొని) పచ్చిబోగము వేసము తీసివైచి రాజకాంతా వేషము ధరించితిని. రాచబులాకిముక్కునఁ బెట్టి జాల్వములుకట్టి, నడికట్టున బాకుపెట్టి యిటకు సిద్ధపడితిని. కులకాంత మగనాలితనము మంటఁబెట్టుటకు సంకల్పించుకొన్న నేను గులకాంతావేషమే వేయవలసి వచ్చినది. ప్రారబ్ధము. సానినెవ్వరు నమ్మరు. మాదుర్గతి యిప్పటికిట్లున్నది. స్వకార్యనిర్వహణమునకు నేనేమిచేసిన

నైనఁ దప్పులేదు ధర్మరాజసత్యమాడినాఁడు, వసుదేవుఁడు గాడిదెకాళులు పట్టుకొనినాఁడు రావణుఁడు సన్యాసియైనాఁడు నేను సంసారిణినైతిని. కానీ! దాని జాతివేషముతోడనే దానిని గ్రహింపవలయును వేఁటకాఁడు పక్షిని బట్టుకొనుటకుఁ బక్షికూఁత కూయఁడా! ఇఁక నాలస్యమేల? ఆమెను సమీపింతును. (సమీపించి, కౌఁగిలించుకొని) తల్లీ! ఏంపని చేసితివమ్మా! మీరాకనుగూర్చి కాకిచేనైనఁ గాసంతవార్త నంపలేకపోయితివా? దాసదాసీజన పరివారముతో నొకయోజన మెదురుగ వచ్చి సర్వబంధు మర్యాదలతో సమస్త గౌరవములతో మిమ్ముఁ బట్టణములోనికిఁ దీసికొనిపోవుదుమే?

వీర — (కౌఁగిటిని వదల్చుకొని) కాంతామణీ! మీరెవరో నే నెఱుఁగను నన్నిట్లేల బహుమానించుచున్నారో యంతకంటె నెఱుఁగను.

జాంబ — పోనీ! నీకుఁ దెలియకపోవచ్చును గాని నా మేనల్లుఁడైన నెఱుఁగఁడా?

వీర — మీ మేనల్లుఁ డెవరు?

జాంబ — ఎవరా? నీమగఁడే! నాయన్నకొడుకు నీమామ యుదయాదిత్య మహారాజు నాపినతండ్రికొడుకు. నే నిక్కడ బ్రదికియుండఁగా నీభర్త పాదచారియై బసమోచుకొనవచ్చుటా? ప్రమాదవశమున నాతఁడు జయసింహరాజేంద్రుని కంటఁబడుటా? నీవిచ్చట నూరిబైటఁ జెఱువుగట్టునఁ గూరుచుండుటా! నీభర్త చెప్పిన యానవాళ్ళఁబట్టియు నెవతయో యూరిలోని ముష్టిముండ చెప్పిన మాటలఁబట్టియు నేను నిన్ను వెదకుకొనివచ్చుటా! ఏమిసరసముగ నున్నదే! నడునడు పల్లకినెక్కు. అమ్మా! నోటికిఁ జేతికి నెంగిలి లేని వారమే- అంత కావలసినవారమయ్యును నీభర్త యిట్లుచేయుట బాగుగా నున్నదా? అయినదేదో యయినది. నల్వురు మూఁగుచున్నారు. పోవుదము.

వీర — అమ్మా! నాభర్త గ్రామములో సుఖముగనున్నారా?

జాంబ — నాయల్లునికేమి తీఁపుతీసినదాయేమి? టింగురంగాయని రాజుగారితోఁ జిలుకలాగున నుబుసులాడుచున్నాఁడు.

వీర — బంధుఁ డిట్లు సేయవచ్చునాయని నాభర్తను మీరంటిరి. మీరిక్కడనున్నారని యాతఁ డెఱుఁగఁడేమో? మిమ్ముఁగూర్చి నాతో నెప్పుడు చెప్పియుండలేదు. ఆతఁ డొకవేళ మిమ్ముఁగూర్చి యెఱిఁగియుండినను నాపదలలోఁ బడియుండుటచేత బంధువుల మొగములు చూడలేక యాతఁ డట్లు చేయవలసివచ్చెనను కొందును. ఆతనిని మీరు క్షమింపవలయును. తల్లిదండ్రులచేఁ బరాభవింపఁబడితినను దుఃఖమున మేనయత్తమాట మఱచిపోయియుండునేమో!

జాంబ — నాయన్న యుదయాదిత్యునకుఁ గ్రమముగా మతిపోవుచున్నట్లున్నది. దేవులాడినట్లే యున్నది. ఆతనిని మొగము వాచునట్లు చీవాట్లుపెట్టి నిన్ను నీభర్తను బతిమాలుకొని ధారానగరమునకుఁ దీసికొనిపోవునట్లు చేయకుందునా?

వీర — మామగారి నేమియు ననవలదు. ఆయన పూజ్యులు.

జాంబ — ఎంతనంగనాచివే! మామగారు మంచివారనుటవలన నత్తగారు దుష్టురాలని తెల్పితివా?

వీర — హరిహరీ! అట్లుకాదు. మా ప్రారబ్ధము ననుసరించి మాకు జరిగిన పరాభవమునకు మమ్మే మేము నిందించుకొనఁదగినది. అత్తగారుకూడ వంద్యురే.

జాంబ — నీకు వంద్యురేకావచ్చును. నావదినెగారిని నేను బరిహసించుటకుఁగూడ నీయాజ్ఞ కావలయునా? అమ్మా! ఇఁక నాలస్యమేల? ఎవఁడురా అక్కడ— సిద్ధముగనున్నారా.

(నేపథ్యమున) చిత్తము

వీర — ఇప్పుడు నేనెక్కడకు రావలయును?

జాంబ — మనము కోటలోనికిఁబోయి యక్కడ నిభర్తనుగలసి యన్నిసంగతులు మాటలాడుకొందము రా

వీర — నాభర్తయొద్దకే నన్నుఁ దీసికొనిపోవుచున్నావు కదా. నీవు తల్లివంటిదానవు కావునఁ జెప్పుచున్నాను, నన్నేమూలనో కూరుచుండఁబెట్టి నాభర్త నాకెప్పటికో కాని కనఁబడకుండునట్లుమాత్రము చేయవలదని ప్రార్థించుచున్నాను ఒక్కనిముసమైన—

జాంబ — ఎప్పుడొకరినొకరు చూచుకొనుచుండునట్లే చేసెదను దీనికింత మనవి కావలయునా అమ్మా—(తనలో) నీగొంతుకగోయ! భర్తను వదలి యుండలేవేమి? మహాపతివ్రతవు. ఊరుందటింక మగలే. బహుపతివ్రతవగుదువు.

వీర అటులైన నిదిగో పోవుదమురమ్మ. నామనస్సిట్లు సంతోషపెట్టిన నీకు మిగులఁ గృతజ్ఞను

జాంబ — (వీరమతిని గాఁగిలించుకొని) అమ్మా రమ్మా. (తనలో) చిత్తమానందమునఁ దాండవించుచున్నది. ఒకదెబ్బకాతోఁ బదివేల మొహరీ లొడిలోఁబడును. భర్తను బద్ధునిఁజేసితిని సంసారిణిని హానినిజేసెదను. వీరఁట—మహాపతివ్రతలఁట—భర్తృవిరహమును సైఁపరఁట మహాతపశ్శాలినులఁట—సూర్యగతినడ్డుపెట్టినవారు. దావానలమును హిమాలయమును జేసినవారు. యము నొక్కటి యీడ్చికొట్టి చచ్చినభర్తను బ్రదికించుకొన్నవారు పగిలినకుండతో నీళ్ళు మోసినవారు ఇట్టివారేకారా? అంతర్ముఖులైనవారు- దిక్కుమాలినపురాణములు భోగిమంటలలో బూడిదకావలసినతుక్కు, సానులయాధిక్యమునుగూర్చి క్రొత్త పురాణము లాధునిక కవులచేత వ్రాయించెదను భర్త కారాగృహమున నున్నాఁడు ఇప్పుడీమె సంతోషించుచున్నదే ఈమె యంతర్ముఖయేయైన రొమ్ములఁ దలఁగొట్టుకొని యేడువవలసినదికాదా? నేను జేసినద్రోహమున కీమె నన్నుఁ బొడువవలసినదికాని యిట్లు కౌఁగిలింపవలసినదా! ఈపెద్దమ్మలు

మందఱి యాపదలు పసికట్టుదురఁట—థూ! వీరు పతివ్రతలఁట—చావఁగొట్టి పాతివ్రత్యమును బరశురామప్రీతి యొనర్చెదను.

వీర—అమ్మా! ఏమియాలోచించుచున్నారు.

**జాంబ**—ఏమియులేదు రమ్మా.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.

---

శ్రీరామ

# వీరమతి

# సప్తమాంకము.

ప్రదేశము — పట్టనమందరి వేశ్యావీధి,

ప్రవేశము — లాలుదాసుఁడు, జాంబవతి

లాలూ — జాంబవతీ! పదునాలువేల బంగారునాణెములతో పదియనఁగూడదా. ఇరువది యనఁగూడదా? పదునాలనుట కుపపత్తి యేమి? ఏఁటికి వేయిలెక్కను బదునాలెండ్లకుఁ బదునాలంటివేమో యని నే ననుకొంటిని.

జాంబ — అదియుఁ గొంత నిజమే కాని దానికి మఱియొక కారణమున్నది.

లాలూ — హే హే హే! ఆలెక్క నఱువదియేండ్లదాని కఱువదివేలు తీసికొందువా యేమి?

జాంబ — వచ్చినట్లిచ్చువాఁడున్నప్పుడు తీసికొనకయేమి? నిజమైన రసికుఁడైనయెడల నిచ్చునా యిచ్చితీఱునా? యథార్థమైన సౌందర్యము వయసు హెచ్చిన కొలఁది హెచ్చును. ప్రాఁతబంగారమునకు వన్నెతగ్గునా? పూర్వహీరములకున్న జిలజిల యిప్పటివానికున్నదా! దక్షిణదేశమున నొకమహారాజు అఱువది యేండ్ల వేశ్యామణికి లక్షబంగారునాణెము లిచ్చినాఁడు, అతఁడు రసికుఁడు. అది సౌందర్యవతి. ఆతనిచరిత్రమును గాంచి లోకము సిగ్గుఁదెచ్చుకొనఁదగినది. లోకమనఁగ రసికలోకమని నాయభిప్రాయము. మిగిలిన యెద్దుమొద్దుస్వరూపములకు సిగ్గేమి బిడియమేమి! అబ్బ! ఎంతమాటనాడితివి. సౌందర్య మనిపించుకొనఁదగిన సౌందర్య మెంతవయస్సునదైన జంకునా? అయ్యయ్యో! ప్రాఁత సూర్యునికిఁ గాంతితగ్గినదనువాని నున్మత్తశాలలో వేయఁదగినది కాదా, ప్రాఁత గంగానదికి మునుపటిపరిశుద్ధి లేదని యను వానిని గట్టిఁగట్టి సముద్రమునఁ బాఱవైవఁదగదా? సృష్టికంటెఁ బ్రాఁతదేదైన నున్నదా దీని వైచిత్ర్య మేమైనఁ దగ్గెననుట కవకాశమున్నదా? సృష్టులన్నిటిలోని కాఁడుదాని సృష్టియే సృష్టి. అందులో వేశ్యాసృష్టి యెంతటిదో చెప్పఁదరమా? దానికేమి ప్రాఁతయేమి? పటిమ తగ్గుటయేమి? లెంపలు వైచుకొనఁదగిన మాటనాడితివి అపరాధము కాదా? రసికుఁడవని భ్రమపడితిని. ఇంతకాలమునుండి నేను జేయించిన శృంగారవిద్యాసాధనము వెలితికంఠమువాని గానసాధనమువలెనే యయ్యెనా!

లాలూ — తెలియక యటులంటిని. క్షమింపుము. పదునాలనుటకు మఱియొక కారణమున్నదంటివే!

జాంబ—ఔను, షోడశకళాపరిపూర్ణయైన యమృతకరమూర్తి యది యగుటచే నట్లంటిని.

లాలూ—నే నెంతయదృష్టవంతుఁడను కాని పమునాలు వేలిచ్చుకొనుటకు శక్తిలేక దేవులాడుచున్నాను.

జాంబ—సొమ్మియకుండఁ దేఁ తేరగ నప్సరసను బ్రక్కలో వైచికొనఁ దలఁచితివేమి? నడునడు.

లాలూ—కోపపడకుము అంతసొమ్ము సమకూడుటకు సాధనము నీవే చెప్పుము.

జాంబ—మీతండ్రి కొట్లలో ధనము మూలుగుచుండ నేనా నీకు సాధనము చెప్ప

లాలూ—మాఅత్తాళము పెట్టి యెన్నిచాటులో పడితిని. స్వాధీనపడలేదు ఇఁక నొక్కటియే సాధనమున్నది.

జాంబ—ఏదది?

లాలూ—నిన్ను మాతండ్రి యుంచుకొనుటచే సందేహించితిని గాని దమ్మిడి వత్స నాభితోఁ దండ్రి తల్లికూడ—

జాంబ—లాలూ! నీయిష్టమైనయెడలఁ గానీయలేకపోయినావా? నేను నీకు వలదని చెప్పితినా? వలదనుటకుఁగాని కలదనుటకుఁగాని నే నెవతెను? నాకొఱకుఁ బడి దేవులాడెద వెందులకు? నేను నీతో వలదని చెప్పిన నాఁగుదువా? నీతండ్రిపై నీకు స్వతంత్రతగాని నడుమ మంతరసానిగండము నాకేల? మీతండ్రి ననొక్కదాసినే చేరఁదీసినాఁడా? ఎల్లకాలము మీతండ్రియే నన్నుఁ బోషించెనా? పణ్యవీథిలో మట్టునకుఁ—బరవపదములోవలె నెవరిమట్టునకు వారేకాని యనుబంధాలమాటమాత్రము స్మరింపకేమి? తెలిసినదా పరమార్థమైన మాట యిది.

లాలూ—అటులైన - ఆమాత్రపుధైర్యము నీవిచ్చినయెడల—పువ్వుత్రుంపినట్లు—దీప మార్పినట్లు లిద్దఱినుగూడ—అపటికిఁ గడతేర్పకున్నయెడల రసికచక్రవర్తి శిఖామణిని గానసుకో. తరువాత మాతండ్రిసొత్తు నాల్గుకోటులుండనీ—పదికోటు లుండనీ—అంతయు నీకొట్టులోఁ జేర్చెదను.

జాంబ—పో! పో—ముందెప్పుడో జరిగి రేద్వఁబోవుమాట లెలచెప్పెదవు. కాని యీరాజకాంతమాటయేమి?

లాలూ—అంతయు నీసొమ్మేకదా! అయినను నీపేరట పత్త్రము వ్రాయించుకొనుము.

జాంబ—చేసేఁబిం. ప్పిటిమాటకదా. సరే పత్త్రము వ్రాయుము (వ్రాతకుఁ బత్త్రము సిరా కలము నిచ్చును)

లాలూ—సరే.

జాంబ—ఎన్నివేలనాణెములకు వ్రాసెదవు.

లాలూ—పమునాలింటికని చెప్పితివికాదా?

జాంబ—కాదు. ముప్పదిరెండింటికి వ్రాయుము.

లాలూ—సరే. నీయిష్టమువచ్చినంతకు వ్రాసెదను. ఒక్కసారి యాకాంతనుముందుగాఁ జూపనిచ్చెదవా? పెట్టెలో వజ్రములు బెట్టి బేరమాడుచుంటివా? మూఁత రవంత యెత్తరాదా?

జాంబ—నీ విప్పుడాడినమాట వట్టిపసికిమాలినమాట. సౌందర్యవతినైన సౌందర్య సరగ్రహణ పండిత ప్రకాండమునైన నాకెంత శిరచ్ఛేదకరమగుమాటయో యోజించితివా? నీకిట్టి గుర్బుద్ధి యిదివఱకు లేదే. ముప్పదిరాజ్యములు విలువచేయఁగల నిక్షేపమును నీపాలు చేయఁదలఁచి మూఁడుగవ్వలు నీయొద్దఁ బుచ్చుకొనుచున్నానే. అదియైనను జేతఁబడిన రొక్కముకాదే— నాపరోపకారశీలతను జూడఁబోయితివి. నాస్వార్థపరిత్యాగమును గుర్తింపక పోయితివి నీకు బుద్ధి లేదా? కృతజ్ఞతలేదా?

లాలూ—జాంబవతీ! ఇఁక దిట్టకుము. చూడు నాకు నీయొక్కతెయొద్దనే భయము. మఱి పరబ్రహ్మమునైన లక్ష్యపెట్టువాఁడను గాను. నిజముగాఁ జెప్పెదను. నీమాటకు బ్రత్యుత్తరముగ నేను నోరు మెదల్పుటకైనను శక్తిగలవాఁడను గాను. రవంత కనుచాటగుము. ఓ తుపానుగాలివలె నుపన్యసింతును. అంత శక్తి నాయొద్ద నున్నది కాని నీయొద్ద గప్పకమాఱగు అది యేమిపాపమో.

జాంబ—లాలూ! అది నీపాపముకాదు పుణ్యము. నీయెగురునకు నీ పొంగునకు నీ మిడిసిపాటునకు నేనే లేకుండునెడల నీవీపరికి రూపుమాసియుందువు. నాబోధన మూలముననే యిప్పటివఱ కింక నిల్లని, వాఁకిలియని, తనదని, పరులదని రవంత యెఱిఁగియుండి బట్ట కట్టుకొని తిరుగుచున్నావు. నీకింత యుపకారిణి నైన నాకేమైనా నిచ్చుటకు నీకుఁ జావు తెంపులగుచున్నది.

లాలూ—సరే నీయెడలఁ గృతజ్ఞతతో నుండ నేయున్నాను. తీవ్రప్రకృతులను దిద్దుపాటుసేయుటకు భగవంతుఁడే యొక్కనికి వేఱొక్కని నంకుశముగా నిర్మించునని నా యభిప్రాయము. కొందఱ కీయంకుశము భార్యలచేతిలో నుండును. కొందఱకు వేశ్యలచేతిలో నుండును. కొందఱకు భటులచేతులలో నుండును.

జాంబ—మొత్తుకొనినట్లు చెప్పినావు. భగవంతుని కిందులో సంబంధ మేమున్నది? తీవ్రప్రకృతులను దిద్దుపాటు సేయుటకు భగవంతుఁడని యేమో నీతులు చెప్పినావు తీవ్రప్రకృతులను సృష్టించినవాఁడు భగవంతుఁడేనా? దిద్దుపాటు చేయువాఁడు భగవంతుఁడేనా? మొదటఁ దీవ్రప్రకృతులను సృష్టింపనేల? తరువాత దిద్దుపాటుచేసికొనేల? బురదలోఁ బడుట— కాళులు కడిగికొనుట. చెంపకాయ కొట్టుట— క్షమాపణకోరుట. తప్పుచేయుట దిద్దుకొనుటయేనా భగవంతునిపని? భగవంతుఁ డున్నాఁడో యేడ్చినాడో యెవఁ డెఱుఁగును. ఉన్నప్పటికి నీవంటి బుద్ధిహీనుఁడా— పత్త్రమింక వ్రాయలేదా?

లాలూ—మాటలాడుచుండగ నెట్లు వ్రాయఁగలను? నేనేమి యష్టావధాన మొనర్పఁ

గలదా ? చూడు. నిన్ననే యొక్కఁడని నాపై గ్రంథము వ్రాసినాఁడుసుమా! లాలూలీలాకమో లీలాలాలూకమో దానిపేరు చిత్రమైనగ్రంథము. ముప్పది రెండువేలకే వ్రాయుచున్నాను. ఇదిగో ముప్పదిరెండు వేలు

జాంబ—ముప్పదిరెండు వేలకు మూఁడుసున్నలే వ్రాసితివేమి?

లాలూ—ఓస్. అంతయొకలు తెలియకుండ నుండలేను. ఇప్పటికి నాల్గుపర్యాయములు మాత్రమే వ్రాసితిని

జాంబ—ఎందుచేత?

లాలూ—ఉండు - వ్రాయనీ -

జాంబ—"అక్షరాల" యన్నమాట వ్రాయకుము.

లాలూ—అబ్బో! అన్నిఅక్షరము లెవఁడు వ్రాయును. నీవు వ్రాయమన్నను నేను వ్రాయలేను.

జాంబ—(తనలో) ఒకటిగాని రెండో సున్నలు స్థలమున్నంతవఱకు నేను జేర్చెదను. (ప్రకా) వడ్డి నూటికి యథాపూర్వకముగా ముప్పదియైదు వేసిన నేనొప్పుకొనను. ఈసారి నలుబదియైదు వేయుము,

లాలూ—ఆలాగే. వ్యత్యాసము పదియేకాదా? నన్నుఁ గనిపెట్టుకొన్న నీవదనముగా సంవత్సరమునకుఁ బదినాణెములసొమ్ము తినఁదగవా యేమి? ఇదిగో వ్రాసితిని.

జాంబ—ఇటు తెమ్ము

లాలూ—ఇదిగో—

జాంబ—(చెంగున మూఁటగట్టును.)

లాలూ—అట్లు చెంగున మూటఁగట్టుచుంటివేల? పెట్టెలోఁ బెట్టుము. జాఱిపోవునేమో - ఎవనిచేతనైనఁ బడునేమో?

జాంబ—అబ్బ! ఈరాత్రి యెన్నితాళములో తీసి పెట్టెలోఁ బడవైవలేను. ఇంతలో నేమైపోవును సరేకాని- ఈవేళ నీవు నాల్గు పర్యాయములే వ్రాసియుంటివేల?

లాలూ—ఈరాత్రి సరిక్రొత్తసరసమున్నదికదా! హెచ్చు వ్రాఁగినయెడలఁ దగిన రక్తి చేయలేకపోవుదు నని భయపడినాను.

జాంబ—పిచ్చినక్లైయున్నది నీవీరాత్రి యింటికిఁ బోకుము. ఇక్కడనే నా పంక్తిని భుజియింపవలెను నీతత్త్వము నే నెఱిఁగినదానను గావున మధ్యమకాలక్రమితివలె మోతాదుగ నిన్నుఁ ద్రావించెదను అంతేకాని భయపడి తక్కువత్రాగి నాపసుపు చెడఁగొట్టకు సాయంకాలము కావచ్చినది. వంటయింటిలోనికిఁ బోదమురమ్ము.

లాలూ—సరే- (ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది సప్తమాంకము

రావయ్యా!" యని నీభర్తతో నంటిని, వచ్చెదనని యాతఁ డొప్పుకొని నాఁడు.

వీర—అమ్మా ! నన్ను రక్షించితివి.

జాం—అబ్బ ఉండు ! రాజుగా రతనిని వదలనన్నారు. అందుచే భోజనమొనర్చి యాతఁ డిక్కడకు వచ్చును కావున మనము త్వరగ భోజనమొనర్చెదము రా.

వీర—భోజనమైనపిమ్మటనైన నాభర్త వచ్చునా ?

జాం—అది శిలాక్షరమైనమాట.

వీర—ఎన్నిగంటలకు ?

జాం—వారప్పుడే భోజనమునకు లేవఁబోవుచున్నారు ఒక్కగంటలో నీభర్త రాఁగలఁడు. నీవుకూడఁ ద్వరగ భుజియింతువుకాని రమ్మ.

వీర—అమ్మా ! నన్ను క్షమింపుము. అతనిని జూడకుండ నేను భుజింపనొల్లను.

జాం—అదేమమ్మా ! మధ్యాహ్నముకూడ ముక్కునకు నాల్గుమెదుకు లంటించుకొని లేచిపోయితివి. అమ్మా ! మేము బడుచుదనములు, మమకారములు, విరహవేదనలు, వేచియుండుటలు నెఱుఁగుదుము. కాని నీవలె యుపవాసములు చేసి యుంటిమా ? ఏదో యింతకొట్టుకొని తినినతరువాత నేడ్చినవారముకాని కడుపు కట్టుకొని కొక్కిరపోవుచుకొని కూరుచుండినవారము కాము.

వీర—అమ్మా ! నన్ను మందలింపక క్షమింపుము.

జాం—మందలింపవలదేమి ? చాలులే. నేర్చుకొనిపోయినావు. నేను బెద్దదానను. నా బిడ్డను నేను దిద్దుకొనుట తప్పుకాదులే. మందలింపకూడదేమి ? పుణ్యస్త్రీవి. ఒంటిప్రొటతిండి. ఓగాయిత్యమని చెప్పఁగూడదా ? నీకింత తెలియదేమి ? అట్టె వెఱ్ఱిపట్టు పట్టక రమ్మ.

వీర—అమ్మా ! నన్ను క్షమింపుము. నేను దినను

జాం—నీవు తిననియెడల నేనును దినను.

వీర—అమ్మా ! అట్లనవలదు. నాభర్త యొకగంటలో వచ్చునుగావున నాతఁడు వచ్చినతరువాత నేను దిందును. రవంత యన్నము నాకుంపుఁడు.

జాం—అటులైన నీవడ్డన ప్రక్కగదిలో నుంపించెదను. నీకెప్పు డవకాశమున్న నప్పుడే తినుము. ఇఁక నా మేడకు నేను బోవుదును.

వీర—అమ్మా ! దయయుంచుము. శ్రమకు మన్నింపుము

జాం—క్రింద సేవకులు కిటకిటలాడుచున్నారు. నీకేమియు భయములేదు.

వీర—నాకు భయమేమి ? అదిగాక నానాథుఁ డొకగంటలో వచ్చునుగాదా ?

జాంబ—పల్లవి యందుకొనినట్లు తిరిగి మొదటికి వచ్చుచున్నావా ? మహారాజార్హమైన విందారగించి చందనాది చర్చలతోఁ బుష్పమాలికలతో నమూల్యనూతన వస్త్రములతో నత్యుత్సాహముతో నిన్ను సేవించుటకు నీభర్త వచ్చును. ఎంత

ప్రమాణము చేయుటకైన సిద్ధముగ నున్నాను. (చేతులెత్తి) సూర్యభగవానునితోఁ జేయనా ?

వీర — అమ్మా ! ప్రమాణము చేయవలదు. అది తప్పు

జాం — సరే. నీయిష్టము. నేను వెళ్ళనా ?

వీర — దయ యుంచుము. (జాంబవతి నిష్క్రమించును.)

వీర — ఈమె లఘుస్వభావము కలదిగాఁ గనఁబడుచున్నది. ఈమెతో నేను ప్రొద్దున నేమి యిప్పుడేమి రెండుగంటలకంటె నెక్కువ సేపు మాటలాడినదిలేదు. అయిన నిఱువదేండ్ల ప్రాఁత స్నేహ మున్నట్లు మాటలాడినది ఆమాటలలో — మందలింపులు - సాధింపులు - నాజ్ఞలు - బతిమాలుటలు - హాస్యములు - నధిక్షేపణలు - కోపములు - ప్రసాదములు - నొకపాకము కాదు. ఒక రసము కాదు వింతగా గన్పట్టుచున్నది. వింత యేమున్నది? ఆమె ప్రకృతియే యట్టిది కాఁబోలు ఉత్తమవంశకాంతలలో మాత్రము లఘుస్వభావ లుండకూడదా? వ్యక్తిస్వభావములు ప్రారబ్ధపరిపాకము ననుసరించి యుండునుగాని వంశము ననుసరించియుండునా? ఒక్క మేఘమునుండియే యమృతధార పడుచున్నది. పిడుగుపడుచున్నది ఒక్కవంశమునుండియే తారయు తపస్వినియుఁ బుట్టుచున్నవి (లెంపలు వైచుకొని) భగవంతుఁడా! ఆమెను నిందించినందులకు నన్ను క్షమింపుము. ఆమె యథార్థముగా నాయందలి యనురాగముననే యింత చనవు తీసికొనుచున్నదేమో! ఇంతవఱకు నామె మేలుచేసినది కాని కీడు సేయలేదు చెరువుగట్టుమీఁదినుండి దానిని దెచ్చి మేడలోఁ బెట్టినది నాభర్తను విడుచుటకు రాజుగారియొద్దకు రెండుసారులు పోయినది. నాభర్త తప్పకుండ నొక గంటలో వచ్చునని ఘోరప్రమాణము చేయుటకు సిద్ధపడినది. భోజనమునకు రమ్మని యెంత పట్టో పట్టినది. ఇవి యన్నియు రాగాభిజ్ఞానములు కావా? కాని యీమె రాజుగారి కేమగునో కనుఁగొనకయే పోయితిని ఈమె పేరే దియో తెలియదు. పోనిమ్ము. తెలిసినప్పుడే తెలియును గాక. తెలియకున్న మాత్రము బాధయేమున్నది? ఆమె వెడలి యెంతసేపైనది గంటలో నానాథుఁడు వచ్చునని చెప్పి పోయినదే. ఇంక గంటయే కాలేదా? కాలమా కాలికి సంకెలలు దగిలించుకొని కుంటుచుంటివా యేమి? నీకెక్కడికైనవి! కష్టముననున్నవారి కొక్కరూపమునను సుఖముననున్నవారి కొక్కరూపమునను గనఁబడుట న్యాయమా? అట్లు కనఁబడుటలోఁ గూడఁ బెద్ద యసందర్భ మొనర్చుచుంటివే! సుఖమున నున్నవారి సుఖమునా తగ్గించుచుంటివి. కష్టపడుచున్నవారి కష్టమునా వృద్ధిచేయుచుంటివి రెండువిధములఁగూడ లోకమున కపకృతి చేయుచుంటివను నిందకుఁ బాలైతివి. నీవు లోకోపకర్తవు కాఁదలచునెడల నీకాలుకుంటితనము సుఖవంతులయెడఁ గానఁబఱుపుము నీ రెక్కల రెపరెపలు కష్టవంతులయెడల నగపఱుపుము. అది నీకు గష్టమైనపని

కాదు. అట్లొనర్చినయెడల బరీక్షాపత్రములకుఁ బ్రత్యుత్తరములు వ్రాయుచున్న బాలిక పావుగంటలో మూఁడుగంటలైపోయెనే యని యేడువనక్కఱలేదు. మగని కౌఁగిటఁ గనిపెట్టుకొని యున్న నేఁగు నిముసమే గంటయైపోయెనే యని యేడువనక్కఱలేదు తలుపు త్రోయుచున్న వారెవరో—నాథా! నాథా! వచ్చితివా? (ఎదురుగఁ బోవును)

(లాలూదాసుఁడు ప్రవేశించును)

లాలూ—(తనలో) తలుపుగొళ్లెము వైచెదను. (అట్లు చేయును.) కన్నులు దిరిగి పోవుచున్నవే ఇది కల్లుమత్తా. కాంతమత్తా. ఈదినమునఁ బుచ్చుకొన్న సురయు నట్టిదే తెచ్చుకొన్న సుదతియు నట్టిదే మొదటిరకపుది- అనుపమానమైన దీప్తికలది - వరములలో మెఱుపులను గలిగించునది మధువునకుఁ దగిన వధువు, వధువునకుఁ దగిన మధువు, వహ్వా! నేను సమకూడినవి. ఇఁక నుత్తరలోక మొక్కమెట్టులో నున్నది. (ప్రకాశముగా) బాలామణీ!

గీ. వ్రేళ్ళనడుమను వ్రేళ్ళను ♦ బిగియనదిమి
చిఱుతచుబుకంబు క్రిందను ♦ జేరమోపి
వింతపడి వెలవెల్లవై ♦ వెఱ్ఱిచూపు
వైచితివదేల? భయమేల? ♦ బాల! బేల!
నాస్వరూపము గాంచిన ♦ నారులెల్ల
జెక్కుగలుపాటుఁ జిఱునవ్వ ♦ సెలవి బాఱఁ
బ్రేమ జెలలూర బిగియుంబు ♦ వెనుకఁ జేరఁ
బైఁబడినవారె భయమేల? ♦ బాలబేల!

వీర—(పెద్దనిట్టూర్పువిడిచి తనలో) ఆహా! జగద్దేవా! హా! ప్రాణప్రియా! నీభార్య యసహాయురాలై యిచ్చటనున్నది. రావా? ఇంకను రావా? బస కుదిర్చి యింతలో వచ్చెదనంటివే! అసత్యమాడినవాఁడవుకావే. భార్య నెడఁబాసి యొక్కయరగడియయైన నుండఁజాలవే! నీవు రాకపోవుట కేమికారణము? నావలెనే నీవేమైన నాపదను బడియుంటివా? ఇద్దఱ మొక్కచోటనుండగ నాపదలు మనల నేమిచేయఁగలవెకదా నీవంటివి. హా! అదృష్టదేవతా! పుష్పము దానిసౌరభమువలెను దీపము దానికాంతియువలెను వస్తువు దాని భారమువలెను బ్రహ్మకైన వేఱుచేయుట కవకాశములేదని నేననుకొనిన నాభర్తను నన్ను వేఱుచేసితివా? ప్రపంచము నేలువాఁ డీశ్వరుఁడుకాఁడు. నీవే. నీయాధిపత్యసౌభాగ్యమే యిది. నన్నేలువానినుండి నే నెడఁబాసిన పిమ్మటఁ బ్రపంచపుటేలికగాఁడవ నాకెందులకు? అత్తా! నీకొడుకు గానఁబడకుండ నున్నాఁడు. నే నెంతబిగ్గఱగఁ బిలిచినను రాకుండ నున్నాఁడు. అత్తా! గొంతెత్తి యొక్కసారి నీకొడుకును బిలువవా? అమ్మపిలుపులోనున్న

ప్రకృతి బల మాలిపిలుపులో లేదు హృదయమా! తుపానుచేఁ గొట్టఁబడిన భూజమువలెఁ దూలిపోవుచుంటి వేమో? మనిద్దఱము కలసియున్నవ్వా డాపదలు వచ్చునేమో యను భయము కాని యింక నాపద లేమున్నవి? పరమావధియైన యాపద రానేవచ్చినది కావున హృదయమా! తూలిపోయెదవేల? ఇఁక భయమేమి? సముద్రతరంగ సంతాడితమగు పగడపుగుట్టవలె నిలువఁబడెదను. నిజముగా మనుజున కాపదయే మహాబలము. సంపత్తు వట్టిపిఱికిది. పొదలోఁ బ్రాణభయావిలహృదయమైన చెవులపిల్లి కొండప్రక్క నెండ్రగాగుచు హాయిగఁ గునికిపాటులుపడు సింహశాబకముకంటెఁ దక్కువపౌరుషము కలదికాదు. ఒక్క పౌరుషమందేకాదు ఆపద సంపదకంటె బుద్ధిలోఁగూడ నెక్కువయే. సంపద వట్టిమందమతి. కవులయుత్కృష్టగ్రంథములు కడుపుమంటలో వ్రాయఁబడినవే ఏడ్పువలనఁబుట్టిన గానమునకున్న రక్తి యద్వితీయము. ఈగొడవకేమి కాని యీతఁడెవఁడో యెందులకువచ్చినాఁడో యీతని నిచ్చటికిఁబంపిన యాకాంతి యెవ్వతెయో నిర్భయముగాఁ గనుగొనెదను. (ప్రకాశముగా) నీవిదివఱకేమోయుంటివి. నేను దిన్నఁగవినలేదు. నీవెవఁడవు! ఇక్కడికెందులకు వచ్చితివి?

లాలూ — నే నెవఁడనని యడుగుచున్నావు. సూర్యుఁ డెవఁడని యడుగరాదా? శృంగారరస జగతియంతయు నా చుట్టు తిరుగుచున్నది నావలన జీవమును దేజమును బొందుచున్నది.

వీర — నీకేదో బ్రాంతిరోగమిచి మాటలాడుచున్నావు నా కర్థమగుటలేదు.

లాలూ — ఈపట్టణరాష్ట్రమందేమి పరసరాష్ట్రములందేమి పురుషోత్తముఁ డనిపించుకొనినవాఁ డెవఁడు? నేను. ప్రతి కుగ్రామమునందుకూడఁ దార్పుడుకాండ్రనుంచి ధనాకర్షణమున వేశ్యల నేమి, మోసమునను బలాత్కారమునను సంసారిణుల నేమి, యిటకుఁ బిలిపించి గడియగడియకు నవనవకాంతానుభవ మొనర్చువాఁ డెవఁడు? నేను.

వీర — (చెవులుమూసికొని అంతటితో నాఁగుము.)

లాలూ — ప్రతిక్షేత్రమునందును స్వామితటాకమునొద్ద గాలిమేడ గట్టించి గవాక్షములనుండి కంటిగొట్టములలోనుండి పుష్కరిణీ స్నానలాలసలగు పూవుబోడుల యవయవసౌభాగ్యము నవలోకించి యానందించి యాకర్షించినవాఁ డెవ్వఁడు? నేను- లాలూ మందిరమందలి యుద్యానవనములోని బంగారునీటి కోనేటిలో స్త్రీలతో జలక్రీడలను దినదినము నాడువాఁ డెవ్వఁడు? నేను- కళావతులకుఁ గళాశాస్త్రమును నేర్పుటకుఁ గళాశాలలను స్థాపించి పోషించుచున్నవాఁ డెవఁడు? నేను.

వీర — (చెవులుమూసికొని) శాంతమ్ పాపమ్ శాంతమ్ పాపమ్. ఇఁకనీగాథ చెప్పకుము. నన్నిటకు మోసమునఁ దెచ్చినయామె యెవతె?

లాలూ—ఆమెరయే మాశృంగారాస్థానమున నాతరువాత సర్వాధికారిణి ఆమె వేశ్యాచక్రవర్తిని ఆమెచేతిక్రింద నెంతలేదన్నను నైదువందల రాయబారులు పరిపరి విధములఁ బనిచేయుచున్నారు.

జీతములవారు. బత్తెములవారు. వార్షికములవారు. తాత్కాలిక బహుమానముల వారు. గృహదానములవారు వస్త్రభూషణాది దానములవారు. ఓ! ఏమని చెప్పను. రాకలు పోకలు బసలు నాటకశాలలు గానశాలలు గరిడీసాలలు, వైద్యశాలలు. ఓ! ఎంతలెక్క. ఎంతగొడవ. ఈపట్టనమున నాయీశృంగారాస్థానమునకు రెండవ దివాణమనిపేరు ఈయాస్థానప్రభుఁడు జయసింహుఁడనునాతఁడు శక్తిహీనఁడు. వ్యవహారదక్షతకలవాఁడుకాఁడు, అతనియొద్ద మాతండ్రి దండనాథుఁడు మాతండ్రి పెద్దవాఁడగుటచే నేనే సమస్తము నిర్వహించుకొనుచున్నాను. ఈయాస్థానమునఁ బరమార్థమైన ప్రభుఁడను నేను ఇట్టిరాజ్యానికై తేఁబడినరాణివి నీవు

వీర—నీగాన కౌంతవలకు వింటిని నీచర్యలగుల వెగటుగానున్నదోయి నాయనా! నాయెడల నీవొనర్చిన ద్రోహమునకు నాకుఁ గోపములేదు నిన్నుఁజూడ నాకు మిగుల జాలియగుచున్నది. దుర్లభమైన మనుజజన్మ మెత్తితివే! ఎంతమూఢుఁడవై ప్రవర్తించుచుంటివోయి నాయనా—అయినదేదో యైనది ఇప్పటికైనఁ బశ్చాత్తాపమొందిచి లెంపలువైచుకొని చేతులు జోడించుకొని భగవంతుని ధ్యానింపరాదా? నీపాపశాంతికొఱకు నేనుగూడ దైవధ్యానమొనర్తును అతఁడు దోషభోగ్యత్వము ప్రధానుఁడగు పరమకృపాళుఁడు ఎంతకాల మీలంపటత ఈ పోరలాట- ఈ ప్రాకులాట- పందికుంటలోనిపురుగే నీకంటె మేలుఁగగా నాకగపడుచున్నది నీకథ వినినపిమ్మట నాకుఁ గల్గిన రోఁత యింతంతకాదు. అయ్యయ్యో! నాటిమనుజుఁడవు చెడిపోవుచుంటివని యింతమారము నీతోఁ జెప్పవలసివచ్చినది.

లాలూ—నా మనస్సెట్టిదో చూచినవాఁ డెవఁడు? పైపై వేసముచేఁ బైపైమాటలచేఁ బైపైచర్యలచేఁ బడిపోవువాఁడేకాని పట్టుమని నాహృదయమును బరీక్షించినవాఁ డెవఁడు? నీవు బుద్ధిమంతురాలవగుదానవు నీకుఁగూడ నాగాథలోని వెగటే కనఁబడినదికాని నాలోలనున్న జ్ఞానము నీకుఁ గనఁబడలేదు నాచేష్టలరక్తియే కనిపట్టితివి కాని నాచిత్తమందలి భక్తిని గ్రహింపలేకపోయితివి నీకు భక్తియో జ్ఞానమో యున్నప్పుడుకదా నాభక్తినో జ్ఞానమునో కనిపట్టుట? నేను మహాభక్తుఁడను. మహాజ్ఞానిని. పరమావధిదిశలో భక్తిజ్ఞానము లొక్కటే తత్త్వము.

వీర—సహస్రకాంతాలంపటుఁడవైన నీవు భక్తుఁడవా?

లాలూ—వేశ్యాసంపర్కమున విప్రనారాయణుఁ డాళ్వారులు కాలేదా? గోపికాలాలనమునఁ గృష్ణుఁ డవతారపురుషుఁడు కాలేదా? రక్తి రక్తియే భక్తి భక్తియే. దాని దారిదేదు దీని దారిదేదు. ఒకటి పైది రెండవది లోనిది. పైదానివలన లోనిది చెడుట యెచ్చటనైన నున్నదా? తాటికాయ పీఁచువలన

ముంజేరుచి తగినదా? ఆకాశగంగాలహరివంటి సంతతభక్తి నామనః ప్రవాహమునఁ బ్రవహించుచున్నప్పుడు నన్నుఁగీకరింపక శాంతిలను దిగుడుబావిలోఁ బాఱవైచుట నాకు దోషమా? అల్లన్నపాలిగి మూసికొండి గొల్లనా? నీను భగవత్స్వరూపిణివే లోకోద్ధారార్థము ధ్యానము చేయుచున్నాను లాలూదాసుఁడఁ డిఁకఁ గొన్నివర్షములు పిమ్మట లాలూమహాప్రభుఁడో లాలూదేవుఁడోనై దేవాలయములలోఁ బూజాపూజలఁ గలవాఁడ నయ్యెదను

వీర—అటులైన నీయిష్టము కాని నాభర్త యెక్కడనున్నాఁడో నీవెఱిఁగియుండ వచ్చును గావునఁ జెప్పుము.

లాలూ—నాయిష్టమని నీవు వేఱే చెప్పనక్కఱలేదు నీవు నాకు స్వాధీనవైయున్నప్పుడు నాయిష్టము కాక నీయిష్ట మెట్లు జరుగును? నీనాథుఁ డెక్కడ నున్నాఁడని యడిగితివి. (రెండడుగులు ముందునకు నడచి) యిదిగో యిక్కడ— ఇప్పుడిక్కడ—

వీర—ఆహా! అసంతుష్టికరమైన మాటలాడుచున్నావు జాగ్రత్త నేను నీకుస్వాధీనవయితినని పొంగుచుంటివిగా బుద్ధిహీనుఁడా! నీగొంతుక నుత్తరించు నీవే పోసికొనుచున్నావు నీయింటి మారికి నీవే నిప్పంటించుకొనుచున్నావు నన్నుఁ దెచ్చుకొనుట యొకటి మృత్యుదేవతను దెచ్చుకొనుట యొకటి యనా? దుర్వాంఛాలోలుఁడవై చెడిపోకుము నేనే—నీకు స్వాధీనవగుటే! అగ్నిజ్వాలను గ్రహింపఁగలవా?

లాలూ—ఏమి నీవెఱ్ఱి. ఈ నాల్గుగోడల నడుమ నన్నుఁదాఁటి నాకు స్వాధీనవేల కావు? అభిజ్ఞాన శాకుంతలములో శకుంతలవలెఁ బైకెగిరిపోదువా? రామాయణములోని సీతవలె భూమిలోనికిఁ దిగిపోదువా?

వీర—రామాయణమును జదివియుండియు నీకీదుర్బుద్ధియేల? సీతచే రావణుఁ డేమయ్యెనో యెఱుఁగుదువా?

లాలూ—ఆమాట కేమిగాని రావణునిచే రంభ యేమయ్యెను? నాకుఁ గావలసినదట్టిది ముందిది చెప్పుము

వీర—రంభ వేశ్యకాదా? దాని కేమంత తపస్సంపన్నత యుండును!

లాలూ—హే! హే! నీకు సీతవంటి పాతివ్రత్య సంపన్నత యున్నది కాఁబోలు నేమి? నేనీకాలపుఁ గాంతల పాతివ్రత్య మెఱుఁగక పోలేదు. నీకంటె బిఱ్ఱబిగిసినవా రిప్పుడు గరిటెజారు పాకములో నున్నారు. సింహాతల్లి కలవలె బొబ్బరించినవా రిప్పుడు పిల్లికూనలవలె గావుమనుచున్నారు జెలగలవలెఁ దెగసాగినవా రిప్పుడు లక్కతీఁగెలవలె నెక్కడి కక్కడికే విరుగుచున్నారు. వెఱ్ఱికుక్కలవలెఁ బైఁబడి కఱచినవా రిప్పుడు వేదాంతులవలెఁ దన్నినను దలయెత్తకుండ నున్నారు. కాని వారి నందఱను జేసినట్లు నిన్నుఁ జేయను. నీ సౌందర్యములోమాత్ర మొక్క యనన్యసాధారణమైన విశేషము

నేను గనిపట్టితిని. నీ సౌందర్యమునందు మెత్తనలో వాడియున్నది: వెన్నెలలో వేడియున్నది. శాంతిలో తీవ్రతయున్నది. వర్షధారలోఁ బిడుగున్నది. రసికజనచక్రవర్తి నగుటచే నాకీభేదము తెలిసినదికాని యితరులకుఁ దెలియదు.

వీర — ఎందుల కీచదువు? ఎటనుండి వచ్చితివో మాటలాడకుండ నటకుఁ బొమ్ము.

లాలూ — ప్రాణములతో మాత్ర మావలికిఁ బోవువాఁడను గాని నమ్ముము. నీసందేహ మెక్కడనో నాకుఁ దెలియకపోలేదు. నిన్ను సామాన్యస్త్రీవలెఁ జూతునేమో యని నీవు సంకోచించుచున్నావు. నీవు మహారాజకాంతవగుటచే నిన్ను మహారాజకాంతవలెనే యాదరింతును. అనేక దాసీజనముచే నీకు సేవచేయింపవలసినదే కాని వారు నీకు సంతృప్తికరమైనసేవ చేయఁజాలరుకావున, నేనే నీకు సమస్తపరిచర్య చేసెదను నీయందు నాకెంత భక్తియున్నదో నీవు గ్రహింపలేకుండనున్నావు. ఈ శృంగారాస్థానమునకు నేను మహారాజను; నీవు మహారాజ్ఞివి నాసేవయే నీకగ్రాహ్యమగునుగాని దాసీసేవ కాదు. ఆసేవాసౌభాగ్యమిదివఱ కెవ్వఁగనది కాదు.

గీ. రాణి కెదుటను దాసి న ♦ మ్రతను జూపి
మొగముచాటైనయంతలో ♦ ముక్కువిరుచు
రాణిమొగమున కెదుట ద ♦ ర్పణముఁ బట్టి
నక్కి ముకురంపుఁజాటున ♦ వెక్కిరించు.
దొరను దొరసాని చిఱునవ్వ ♦ తోడఁజూడఁ
దనదుసఖివంకఁ గనుగీటి ♦ దాసిచూపు
భూధవుఁడు రాణిపై మోహ ♦ ముడుచుకొనఁగఁ
గెరలి పైటచాటున దాసి ♦ కిసుకుమనును.
సణగు సేవ లోలోపల ♦ గొణగుసేవ
మ్రొక్కుదీర్పుసేవ మొగము ♦ ముడుపుసేవ
వెక్కిరింపుసేవ మెటికె ♦ విరుపుసేవ
దాసికాసేవ వట్టి దం ♦ భనపుసేవ.
రాణిపైఁగన్ను మిండని ♦ పైనిమనసుఁ
జేర్చి యొనరించుదాసిదా ♦ సేవతగదు
అసువుతోడను మనసుతో ♦ నాత్మతోడ
నేనుజేసినదే సరి ♦ యైనసేవ.

వీర — ఇంకఁజాలును. ఇఁకఁజాలును, పో. పో.

లాలూ—నీకుఁ జాలునుగా వారుఁ డనా? నీ ప్రత్యక్షసేవ నా కా స్వప్నములలోఁ జేసినగాని నా జన్మమునకుఁ దృప్తి తీరదు.

ఆ వె జాజిపువ్వుతురాయి ♦ పైమట్టునఁ గ్రుత్తు
కజ్జలంపురేఖఁ ♦ గనులకెంపు
కొదమునగడ్డమ్మునందు ♦ ముంగురులు సవరింతు
నలికమందు జిప్ప ♦ తిలకమిడుక.
రైకకూడలన్ని చేకొప్పి ♦ ముడివైతు
సర్దుచుండుఁ బైట ♦ జారినపుడు
అలుతమౌక్తికముల ♦ హారంబులుంతును
బుగ్గలానఁ బానుగు ♦ ఫ్రుణుకుచుండు.
ముడుతలప్పియడఁచి ♦ మొలహాలు బిగియింతు
విడెపుమడపుఁజిలుక ♦ లిడుదు నోట
విరులసురటి బూని ♦ విసరుదు మెలమెల్ల
మెత్తమెత్తఁ బదము ♦ లొత్తుచుందు,
కాలిగ్రేళ్ళక్రింద ♦ గాగరాముందంచు
పడకయుండ నెత్తి ♦ పట్టికొందు
నెత్తుకొల్లమంచ ♦ మిదా వెకు–నెడ వంగి
మెట్టుగాఁగ బుజము ♦ పెట్టుకొందు

(మీఁదిమీఁదికి వచ్చుచున్నాఁడు)

వీర—పో పో. దగ్గఱగ వచ్చుచున్నావు. దూరముగఁ బో. (తప్పించుకొని దూరముగఁ బోవును.)

లాలూ—దగ్గఱకువచ్చుట నాది తప్పా? నీ వాకర్షించుచుండ నేనేమి చేయవలసినది?

ఆ. వె. తొగరుమావిచిగురు ♦ తొందరపెట్టఁగా
నెట్లు పికము దాని ♦ నెనయకుండు?
పద్మగంధలహరి ♦ పట్టి యీడ్చుచునుండ
దాని దరియ షట్ప ♦ దంబుతప్పె?
దాహపీడితుండు ♦ దారిలో నదిఁ గాంచి
తోయధారఁ జేర ♦ దోషముగునె?
పారశాలలోని ♦ బాలకుం డింటికిఁ

బరుగులెత్తఁబోవఁ ♦ శాపముగునె
ఆగ్రహంబు నీగ్ర ♦ హంబు నాక
వాని నాతఁ డితఁడు ♦ వాని నీవు
ద్రవ్యమొకఁడు వేఱు ♦ ద్రవ్య మాకర్షించ
నొకఁడయాత్మ నీవు ♦ నొకఁడయాత్మ.
సృష్టిలోనఁ గలుగు ♦ నెల్లసంబంధంబు
లిట్టిపేఁకులాటఁ ♦ బుట్టినవియె
సృష్టిదోషమునకు ♦ నేనేమి చేయుదఁ
గౌఁగిలింతు సృష్టి ♦ గతినిబట్టి.

వీర — నిజమే. నీవు చెప్పిన యాకర్షణశక్తిచేతనే నీవు నాదగ్గఱకు వచ్చుచున్నావు. కాని నేనాకర్షించుచున్నాననట పొరపాటు (మొలలోని బాకుఁదీసి) ఈబాకుమొననున్న మృత్యుదేవత నిన్నాకర్షించుచున్నది. తెలిసినదా ? నిన్నుఁ జూడ నాకు మిగుల జాలియగుచున్నదని మఱలఁ జెప్పుచున్నాను. ప్రారబ్ధవశమునను, సత్సహవాసాభావముచేతను, దుర్జనప్రోత్సాహముచేతను, ధనమదాంధతచేతను గర్హ్యవాంఛాలంపటుఁడవైతివి. పశుత్వముకంటెను క్రిమిత్వముకంటెను నధమాధమమైన నీమనుజత్వమునకై మనుజజాతియంతయుఁ రోఁతపడుటయే కాక ప్రపంచ ప్రాణిప్రకృతియంతయు సిగ్గుపడునట్లున్నది. పడుచువానికి భార్యావియోగము కష్టముకాదు. ముసలివాని కేకపుత్త్రమరణము కష్టముకాదు. చనిపోవువాని కుత్క్రింతశ్లేష్మబాధ కష్టముకాదు. గ్రామ్యసుఖపంకనిర్మగ్నతయే కష్టములన్నిటిలోఁ గష్టము. నీవు మహాకష్టమునఁ బడియున్నావు. నిన్ను నీవు కాచుకొనుము.

లాలూ — నేను మహాసౌఖ్యమనుభవించుచుండ నింతకంటె మహాసౌఖ్యమనుభవింపనుండ నేనేమో మహాకష్టమున మునిఁగియున్నానని నీవందువేల ! నీకు మతిలేదా ? నీవు సంపూర్ణారోగ్యము నొందుచున్నావు. నీయొద్దకు వైద్యుఁడు వచ్చి నీవు మహావ్యాధియుక్తవై యున్నావని యాతఁ డనునెడల నీవాతని మాట విశ్వసింతువా ?

వీర — ఏల విశ్వసింపదగదు ? నేనారోగ్యసౌఖ్యమొందుచున్నాను నాకుఁ దెలియకుండ హృదయవ్యాధి యుండఁగూడదా ! నీకున్నది యాముష్మికకష్టము. దానినిగూర్చి యేమియుఁ దెలియకుండఁ గనకరాసులనడుమఁ గవిస్తోత్రముల నడుమ గానకలాపములనడుమఁ గల్లుకుండలనడుమఁ గాంతాబృందములనడుమ మహాసౌఖ్యయుక్తుఁడ నని యనుకొనుచున్నావు. పుష్పశయ్యపై పొంగి పొంగి బోరగిలఁబడుచున్నావు కాని తలగడక్రింద నున్న త్రాఁచుపామును గానతే

కున్నావు మదిరాపానవికారచేష్టలగు మగువలతో నొడలెఱుఁగక తాండవించుచుంటివే కాని కాలిక్రిందఁ గలుగఁబోవు భూకంపమును గుర్తెఱుఁగకున్నావు.

లాలూ— చదివిన చదువే చదువుచున్నావు మాటలతోఁ గాలక్షేప మొనర్చి తప్పించుకొనుట కిట్లు పాటుపడుచున్నావు. ఆలస్యమును భరింప నాకుఁ గష్టముగ నున్నది ఇఁక కౌఁగిలింపక మానను

వీర— ఆలాగా! పాపము. ఒక్కయరనిముస మాఁగుము (తనలో) పరమేశ్వరుఁడా! నీసృష్టిలో నొక్క మనుజుని నా బాకున కెరచేయవలసివచ్చినందులకు మిగుల విచారించుచున్నాను మహాప్రభూ! మానసంరక్షణార్థమై యిట్లు చేయవలసివచ్చిన ట్లగపడుచున్నది అంతపాపమునకు రాకుండ నాతని బుద్ధి మరల్పుము తండ్రీ! సర్వపాపసంహరణా! సర్వాభీష్టప్రదాయకా! రక్షింపుము రక్షింపుము. (ప్రకాశముగా) ఏమయ్యా! మఱియొక్కసారి చెప్పుచున్నాను ఇదిగో బాకు ఆఁక దానిచేఁ జచ్చితివా సత్ప్రతిష్ఠ నొందకుము.

లాలూ— నీబెదరింపులఁ గట్టిపెట్టుము

ఆ. వె. ఆఁడుదానిచేతి ♦ యాయుధంబున కెంత
కఱకుఁదనము గలదొ ♦ యెఱుఁగవేనె?
చుక్కకీరికోఁత ♦ సారికాయుకోఁతకు
సరిబిడూటకోఁత ♦ కర్హమగును.
షండుచేతిదీప ♦ మక్షర మెఱుఁగని
మూఢుచేతిలోని ♦ పుస్తకంబు
పుంస్త్వహీనుచేతి ♦ ముద్దులగుమ్మయు
నబలచేతి కత్తి ♦ యంతకంతె.
మందబుద్ధికి నాత్మసం ♦ స్తవనపటిమ
కుండలంబులపస యల్ప ♦ పండితునకు
పిఱికివానికి గల్పటా ♦ గఱుసుదనము
సరసిజాక్షికి మొలను గై ♦ జారుసొగసు.

నీచేత బాకే యున్నది కాని నాయువలగ్నమున ఖడ్గములేదా? కౌగిలింతల కేసుకలోఁ గత్తులప్రసక్తియేల?

వీర— నీదుర్నయము హెచ్చుగా నున్నది నీవు చావకతప్పునట్లగపడుచున్నది నా చేతిలో నీవేల చావవలయునని నేను మిగుల సందేహించుచున్నాను. నేను నిన్నుఁ జంపినయెడల నీతండ్రి యేడ్చును. నీభార్య యేడ్చును నిన్నుఁ గని పెట్టుకొనియున్న కాంతాసమూహ మంతయు నావలన మహాసంక్షోభ మొంద

వలసివచ్చును నేనింత సంఘదుఃఖమున కేల కారణము కావలయును ? భగవంతుఁడు తనయిష్టానుసారమున నిన్ను శిక్షించును. నాభర్త నాచేయి దాఁటి పోయినాఁడు. నేనొక్కతెను. అతని దర్శనము నాకగుట దుర్లభము. నాకొఱకేడ్చువారెవ్వ రక్కఱలేరు నీవు ఖడ్గమును ధరించిన వీరుఁడనని చెప్పుచున్నావు కావున నీకత్తితో నాతల నఱకుము నీఖడ్గధారియే నాకంఠమున కంటవలయును. తెలిసినదా ? నీవు బ్రదుకుట కింతకంటె సాధనము నాకు గోచరింపకున్నది. కావున మగవాఁడవై కత్తి పైకిఁదీయుము.

లాలూ—అదియెంతపని ? కాని నాయాస లింక వ్యర్థమేనా

వీర—భవలంపటునకు బ్రహ్మవిద్యవలె—

లాలూ—అటులైన నిదిగో (కత్తిదీయును)

వీర—ఊఁ. కానీ ఏలసందేహింతువు. (తనలో) ఓపరమేశ్వరుఁడా ! యీబుద్ధిహీనని క్షమింపుము. నన్ను నీలోఁ జేర్చుకొనుము. (ప్రకాశముగా) నీకత్తియే కాని నీకరము నాకుఁదగులఁగూడదు.

లాలూ—అభ్యంతరమేమి !

గీ. పసుపెట్టించి యంధకూ ♦ పము లదింపి
పడఁతినొకదానిఁ బదుగుర ♦ పాలుచేసి
వేగతుల మొండిస్త్రీల జం ♦ పించినాఁడఁ
గాని యెన్నఁడు దలఁకు ♦ కంగలేదు.

(నఱుకునట్లు నటించి కత్తి క్రింద నిమ్మళముగఁబెట్టి యామెను కౌఁగిలింప యత్నించును.)

వీర—ఆ ! దురాత్మా. ద్రోహీ నన్ను స్పృశించుట నీతరమా. (నేలఁబడిన కత్తి నిడీసి) ఇఁక నీవు చావకతప్పదు. (గట్టిగ) పరమేశ్వరా ! (కత్తితో నాతనిని నఱుకఁగ నాతనితల కిటికీలోనుండి నేలను బడును.) అహా ! తలయెగిరి వీధిలోఁబడినది వీథివారలు చూచి యిక నల్లరిచేయుదురు కాఁబోలు.

(నేపథ్యమున) అయ్యో ! అయ్యో ! దండనాథపుత్రుఁడు లాలూదాసుని తలయే యిది, ఆవేడపై కిటికీలోనుండి పడినది. అయ్యయ్యో ! యెంతదురదృష్టమో (నేపథ్యమున మఱియొకరవమున) ఈగాడిదకొడుకు చచ్చుటయే మంచిది.

వీర—అదిగో శిరమును దీసికొని కొందఱటు పరుగెత్తుచున్నారు. ఇఁక నేమైన నేమి చేయఁగలను ? హా ! భగవంతుఁడా ! భగవంతుఁడా ! నేను దోషమొనర్చితినా ? నీసృష్టిలోనున్న యనేకకాంతలను నీతఁడు హింసించుచుండ నింక హింసింపఁ దలఁచియుండ నెన్నివిధముల బోధించినను వినక మొండితనము వహించియుండ విధిలేక మర్యాదను సంరక్షించుకొనుటకై యిట్లు చేయవలసి వచ్చినది. క్షమింపుము అంద్రీ !

(నేపథ్యమున) హా తండ్రీ! హా లాలా!

వీర—అదిగో కొడుకుశవమును జూచి యేడ్చుచు దండనాథుఁడిటకు వచ్చుచున్నాఁడు. ఆహా! పుత్రశోకమును గలిగించిన పాపాత్ములారాలను గాఁబోలు.

(డుంగరసీ యిద్దఱు సేవకులతోఁ బ్రవేశించును)

డుం—ఎక్కడరా నా కొడుకు? ఒంపినవాఁడెవఁడురా. హా తండ్రీ! హా తండ్రీ!

వీర—అయ్యా! మగవాఁడాతని జంపలేదు. ఆతని జంపినదానను నేను నన్నాతఁడు బలాత్కరింపఁబోవ నేనాతని శిక్షించితిని.

డుం—(తల పైకెత్తి) నీవెవతెవు? అఁ. అఁ. నా కొడుకుపాలిటి మృత్యుదేవతవైన నీ వెవరెవు?

వీర—నేనెవతెనో నీకుఁ దెలియవలసినప్పుడు తెలియును.

1 సేవ—ఈ మేడమీఁదినుండియే బాబుగారిట్లు క్రిందఁబడినది.

2 సేవ—మొండెమింక మిద్దెమీఁదనే యున్నట్లున్నది బాబూ!

డుం—హా తండ్రీ! అతి వ్యాప్తి వలదని నెత్తినోరు కొట్టుకొంటినోయి బాబూ! ఆముండ యేదిరా? ఎక్కడను గనఁబడదేమిరా?

1 సేవ—జాంబవతమ్మగారేనా!

డుం—దాని గొంతుకోయ! దాని జుట్టుపట్టుకొని యిటలాగుకొనిరా!

1 సేవ—చిత్తము బాబూ! (నిష్క్రమించును.)

డుం—సేవకా! ఈ మేడలోపలికి దారియేదిరా? నేను లోనికిఁ బోవలయును.

సేవ—చిత్తము. ఇటు దయచేయుడు.

(డుంగరసీ సేవకునితో నిష్క్రమింప జాంబవతి ప్రవేశించును)

జాం—అమ్మయ్యో! నాకొంప మునిఁగినది. ఇది ఆముండకొడుకు చావుకాదు. నా చావోయి బాబూ! ఏమి చేయుదును? ఎక్కడికిఁబోదును? ఏది గతి? కాళ్ళుపడఁకుచున్నవి కవలలేను. ఇది యింత రాకాసిముండ యని యెఱుఁగకపోయితినోయి తండ్రీ!

(నేపథ్యమున) కొట్టుఁడు, తలుపుకొట్టుఁడు తన్నుఁడు గునపములు పుచ్చుకొని పొడువుఁడు పొడువుఁడు. చూచెదరేమి? రండు. రండు. (పెద్దధ్వనులగుచున్నవి.)

జాంబ—అయ్యయ్యో! అప్పుడే దండనాథుఁడు భటులతో వచ్చి మేడతలుపు పగులఁగొట్టించుచున్నాఁడు. ఈ ముండకొడుకు చెంగము నే నెట్లు చూతునోయి బాబూ! కాని తలుపులట్లు పగులునవి మాత్రము కావు. తనకొడుకు నిట్లు జంపించితినని వీఁడు నాతల పగులఁగొట్టునేమో! అయ్యయ్యో! ప్రళయము వచ్చినట్లున్నదే;

(నేపథ్యమున) హా! హా! పొడు. పొడు. తలుపులు విడునట్లులేదు బాబూ!

వీర—దండనాథా! తలుపులుగొట్టి లోనికి బలాత్కారమున రాఁదలఁచి యున్నావు కాఁబోలు. నీకొడుకును జంపినట్లు నిన్నుఁగూడఁ జంపెదను. వెనుక భటులున్నారుకాదా! నాకేమిభయమని యనుకొనుచున్నావుకాఁబోలు! నీభటులతోఁగూడ నిన్నుఁ జంపెదను ఇదిగో! నీకొడుకురక్తముచే నెఱ్ఱఁబడినకత్తి; ఈరాత్రి యెందఱు చావవలయునో? జాగ్రత్త!

జాంబ—అమ్మయ్యో! దీనిమాటలు వినఁగ నాకుఁ బంచప్రాణము తెగిరిపోవుచున్నవి అమ్మయ్యో! ఇది కాళికమ్మకాని మనుజకాంత కాదుబాబూ? నాకొంపలో బ్రవేశించినది నాయనా! ఇఁక నేమిచేయుదును! ఎంతయైశ్వర్యముతోఁ దులఁదూఁగుచున్నదాని కెంతలో నింత పుట్టిమునిఁగినదోయి నాతండ్రీ! ఈయమ్మ వారన్నియుఁ దుడిచిపెట్టుకొని పోనున్నదికాఁబోలు బాబూ!

(నేపథ్యమున) పొడుపొడు! హా! హా! (పెద్దధ్వనులగుచున్నవి)

వీర—దండనాథా! మఱియొక్కసారి చెప్పుచున్నాను వినుము. తలుపుగొట్టఁ బ్రయత్నింపకుము నీకొడుకు దుర్మార్గుఁడు కావున నాచే హతుఁడైనాఁడు దైవేచ్ఛ యట్లున్నది నీవిఁక విచారించిన లాభములేదు. అతని యాత్మశాంతికై దైవమును బ్రార్థింపుము నేనుగూడ నిటనుండి ప్రార్థింతును. నీకొడుకునకు శీఘ్రముగ నగ్నిసంస్కార మొనర్చుకొనుము. అతని మొండెము నీ గవాక్షమునుండి పడవైచుచున్నాను. కాసెముడిపట్టుకొని యాతనియొడలు తగులకుండఁబడవైతును. అక్కడఁ దలుపుగొట్టుటతో నేమి యాయాసపడెదవు. ఇటువచ్చి కొడుకుమొండెమును జూచి చేతులు జోడించుకొని దైవమును బ్రార్థింపుము.

(నేపథ్యమున) భటులారా! పడవైచుచున్నది కాఁబోలు. ఆకిటికి యొద్దకుఁ బొండు. ఆకిటికియొద్దకుఁ బొండు (పడవైచును)

జాంబ—అయ్యయ్యో! దండనాథుఁ డిక్కడకు వచ్చుచున్నట్లున్నాఁడు. నే నాతనికిఁ గానఁబడకుండఁ బోవుదును (పోవును.)

డుంగ—(ప్రవేశించి) అయ్యయ్యో! తలుపు లెంతకొట్టినను విడినవికావు. ఏమి సేయుదును? మేడమీఁది రాకాసిని జంపినఁగాని నాపగ యెట్లు తీఱును? సేవకా!

సేవకుఁడు—(ప్రవేశించి) అయ్యా తలను మొండెమును దగ్గఱగఁ జేర్చినాము. ఒక్కసారి మీరు వచ్చి చూచెదరా?

డుంగ—నేను జూడలేను నాకన్నులు కాలిపోయినవి. నాకడుపులో మంటలు బయలుదేఱుచున్నవి ఏది ఆముండయేది?

సేవ—ఆమె యింటియొద్ద లేదఁట. ఈసందులో నేమూల నున్నదో?

డుంగ—అది మూలఁగూర్చుండునది కాదురా. లోకాలను ముంపఁగల ముండరా. ఎక్కడ నున్నదో వెదకి తీసికొనిరా.

సేవ—చిత్తము.

(నేపథ్యమున) బాబూ! ముందుమాట యేమిసెప్పు?

డుంగ—పెద్దపెద్దనిచ్చెనలను దెచ్చి యాప్రక్కను నిచ్చెన వైచి గవాక్షముయొద్ద కెక్కి లోనఁబడి యారాకాసిని క్రిందకుఁ ద్రింపుఁ.

(నేపథ్యమున) ఆమాటకాదు బాబూ! చిన్నబాబు గారి సంగతి నడిగితిని.

డుంగ—మీరు ముందు కిటికీలలోనుండి లోనఁబడి యాసెగ బ్రాణములతో నాయొద్దకుఁ దెండు నేనామెను నాచేతులతోఁ బట్టుకొని మొదటి నెమ్మదిగా నిద్దఱను గట్టికట్టి యొక్కసారియే—

(నేపథ్యమున) చిత్రము బాబూ. పొండు. దగ్గఱకు పోవలదు బాబూ. బాంబు. ఇదేమి పండుగయా వేడుకయా? ఏమి చూచెదరు? పొండు.

డుంగ—ఏమది?

(నేపథ్యమున) పండలకొలఁదిజనము మూగుచున్నది బాబూ!

డుంగ—జనమునకు బుద్ధిలేదు. పెండ్లి కెల్లు మూఁగుదురో చావున కట్లు మూఁగుదురు. వచ్చినవారందఱపై తూటలు కొట్టుఁడు. దొంగముండకొడుకులు నా కొడుకు పోయినాడని పలుకుచున్నారా కాఁబోలు నే నేడ్చుచుండఁగ వారికిఁ జూడవలయునని ముచ్చట కాఁబోలు. ఈ నాల్గు దినములు దాఁటనిండు. డొక్కఁ జీల్చి తూటఁగొట్టెదను.

(నేపథ్యమున రెండువైపులనుండి) ఎక్కు. ఎక్కు. నిచ్చెనలను సరిగాఁ బట్టుకొనుఁడు బెసగనీయకుఁడు. అడుగు బింకముగా వేయవలెను. క్రిందికిఁ జూడకుఁడు. కన్నులు తిరుగును. కాగడా కఱ్ఱలు పైకెత్తుఁడు. అద్దీ. అద్దీ (ధ్వనులగును.)

వీర—ఓ మందభాగ్యులారా! ఎక్కకుఁడు. ఎక్కకుఁడు. ఇదిగో లాలూదాసుని తల నఱికిన కత్తి. ఇదిగో బాకు. నేను సురక్షితనై యున్నాను మీకాళ్లక్రిందఁ బట్టులేదు. కత్తివఱ కక్కఱలేదు కఱ్ఱతో నొక్కత్రోపు త్రోచినయెడలఁ గ్రిందఁబడి చచ్చెదరు రాకుఁడు. పైకిరాకుఁడు. అనావశ్యకముగఁ బ్రాణములఁ దీయుఁ పాపము నాకుఁ గట్టకుఁడు చెప్పుచున్నాను వినుఁడు. (ఈమాటలే మేడ కీవైపునఁగూడ వీరమతి పలుకును.)

డుంగ—భటులారా! ఆఁడుదానిమాటల కడలవలదు. ఎక్కుఁడు. ఎక్కుఁడు. లోనఁబడుడు ఊరకే మీరు క్రిందకు దిగినయెడల నేనే మిమ్ముఁ జంపెదను. తుట్టతుదకు మీశవములమీఁదుగ నేనే గవాక్షమునొద్ద కెక్కెదను.

(నేపథ్యమున) చచ్చితినిబాబూ! చచ్చితినిబాబూ!

డుంగ—ఏమిరాయది?

(నేపథ్యమున) పైకెక్కినవారీవైపున నిద్దఱు క్రిందఁబడిచచ్చినారు.

డుంగ—ఈవైపున నెక్కినవా రెందఱుచచ్చినారురా?

(నేపథ్యమున) నల్వురు.

డుంగ—ఇంతేకదా. ఇంకొకవరుస నెక్కించు. ఎక్కించు.

వీర—జనులారా! ఎక్కఁడెక్కఁడని దండనాథుఁడు మిమ్ముఁ బ్రోత్సహించు చున్నాఁడు ఆతనికేమి? చచ్చువారుమీరు ఆతనికొడుకు చచ్చినందుల కాతఁ డెంతయేడ్చుచున్నాఁడో మీరిట్లు వృథగఁ జచ్చినందులకు మీతండ్రు లట్లేడ్వరా? లాలూదాసుఁడు చచ్చినందుల కాతనిభార్య యెంతయేడ్చు చున్నదో మీరు చచ్చినందులకు మీభార్య లట్లేడ్వరా? ఆఁడుది యేమిచేయఁ గలదని యాతఁడు లఘువుగఁ బలికినాఁడు. ఏమిచేసినదో కనఁబడుచుండఁగ నింకసందేహమేల? ఆతఁడు చావకుండ మీరెందఱు చచ్చినను నాతనికిష్టమే. నిర్భాగ్యులారా! కూలికై యేల ప్రాణములు పోఁగొట్టుకొందురు? అదిగాక యిదియేమి యుద్ధమా? మీరాజుపై నెవఁడైనను దాడివెడలెనా? మీసొత్తు నకుఁగాని మీప్రాణములకుఁగాని మీయాఁడువారి మర్యాదలకుఁగాని యేమైన నాపద వాటిల్లెనా? మీరెందుల కిట్లు ప్రాణములు పోఁగొట్టుకొనవలెను? అనేకసంసారములు చూపిన యొకతుచ్ఛుడు నావలన నేఁడు మృతినొందినాఁడు వాని మహాపాపఫలము వాఁడనుభవించినాఁడు. ఈతనిచావువలన మీకు మీదేశ మునకుఁ గూడఁ బీడ వదలినదని సంతోషింపవలదా? పొండు. పొండు. జనకంటకుఁడు చచ్చినాఁడు. హరినామస్మరణ మొనర్చుకొనుచు నింటికిఁ బొండు.

(నేపథ్యమున) నిజమైనమాట చెప్పినదిరా! ఈమె నరకాసురుని జంపిన సత్య భామరా! మనకు నిచ్చెనలు వలదు. త్రాళ్ళువలదు. క్రిందఁ జిసనువలదు. పొండు. పొండు.

వీర—భటులారా పోవుచున్నారా! ఊరక పోవుటకాదు. రామ్‌రామ్‌రామ్ సీతా రామ్‌రామ్‌రామ్ అని పాడుఁడు.

(భటులు పాడుచుఁ బోవుచున్నారు)

డుంగ—భటులారా పోవుచున్నారా! వీఁపులు చిట్లగొట్టించెదను. గ్రుడ్లు పీకించె దను నాలుక లూడలాగించెదను. మక్కల కింద ఖండించెదను. కదలకుఁడు

(నేపథ్యమున) గోడనెక్కి చావుమందువటయ్యా! ఇంతవఱకుఁ బండ్రెండుగురు కాఁబోలు చచ్చినారు చూచుచు నెట్లు చావఁగలము? మావలనఁగాదు. మాకధికారి రాజుగారుగాని మీరుకారు. మేముపోయి రాజుగారితో మొఱ్ఱ పెట్టుకొందుము

డుంగ—అయ్యయ్యో! నాయధికారము మంటమయ్యెనా? నాయదృష్టము తొలఁగి పోయెనా? నాకొడుకు చచ్చిపోయెనా? నావంశ మంతరించెనా? నా భటులు నన్ను దిరస్కరించిరా? ఇఁక నేమున్నది! తలపెంకెగిరి పోవుచున్నది. అయ్యో! ఇంతేనా! నేనినామకుఁడనా. అపుత్రకుఁడనా. అగతికుఁడనా. అయ్యయ్యో! ఇంతే? ఇంతే? ఇఁక నశించిపోవలసినదే? సేవకులారా! ఒక్కఁ

డైన నక్కడనున్నాఁడా!

(నేపథ్యమున) అయ్యా! జాంబవతినమ్మను లాగుకొనివచ్చుచున్నాను.

డుంగ—రానీ మాయముండను రానీ కొప్పు కోసెదను. గోయితీసి గొంతువఱకుఁ బూడ్చెదను.

(జాంబవతి సేవకునితోఁ బ్రవేశించును.)

వచ్చితివా? తన్ను. (ఎగిరి కాలితోఁ దన్నును.) చెప్పు. చెప్పు. చెప్పెదవా లేదా? చెప్పవేమి? చెప్పవేమి? (కొట్టును)

జాంబ—ఏమిచెప్పవలయునో అడుగకుండ నేమిచెప్పుదు?

డుంగ—కావలసిన అడుగనా? ఇంక నిన్ను యాచింపవా? బతిమాలనా? పలుగాకీ! ఏ వేమియెఱుఁగుదువో చెప్పు. చెప్పు. (నెత్తిపైఁ గొట్టును)

జాంబ—అయ్యయ్యో! (ఏడ్చును.)

డుంగ—ఈముండ యెక్కడదొరకినదిరా!

సేవ—జంబుకియింటిలో దొరకినది.

డుంగ—ఆముండెనుగూడఁ దీసికొనిరాకపోయితి వేల?

సేవ—అది తొందరచే నటునిటు పరుగెత్తబోయి నూతిలోఁబడినది?

డుంగ—చెప్పవేమి? (నెత్తిపైఁ గొట్టును)

జాంబ—(ఏడ్చుచు) ఈ యుదయమున నుదయాదిత్యమహారాజుకొడుకు నాతని భార్యయుం నీగ్రామమునకు వచ్చిరి భార్యను చెఱువుగట్టుపైఁ గూరుచుండఁబెట్టి భర్త బసచూచుటకుఁ బట్టనములోనికి వచ్చెను నాకీసంగతి తెలిసి నీకొడుకు చేత నాతనిని గారాగృహమునం దుంపించి యాతనిభార్యను మోసమునఁ దెచ్చి యీ మేడలోఁ బెట్టి నీకొడుకున కామెను దార్చితిని. తరువాత నేమిజరిగెనో నాకుఁ దెలియదు.

వీర—హా జగద్దేవా! హా ప్రాణనాథా! ఈ దుర్మార్గురాలిమూలమున నీవు కారలో నుంపఁబడితివా నాథా! నే నీతలుపు తీసికొని వీధినిఁబడి కారాగృహము నొద్దకు వచ్చి నిన్ను విడిపింతును. నీకారాగృహపుదాళ మీకత్తిమొనపై నున్నది. ఇక్కడిగోడవరయేదో యైనవెంటనే దిగెదను. నాథా! త్వరలో వచ్చు చున్నాను.

డుంగ—తరువాత నేమిజరిగెనో నీకుఁ దెలియనే తెలియదా? పాంసులా! నీమూల మున నావంశ మంతరించినది. నీమూలమున నాతలలో నగ్నిపర్వతము పగిలినది. నిన్నేమిచేసిననైనఁ బాపమున్నదా! అదియేమి? పైఁటచెఱఁగున నాముడి యేమి?

జాంబ—ఏమియులేదు.

డుంగ—ఏమియుఁలేనప్పుడు ముడియేల? (విప్పును) ఇదియేదో కాగితము (చదువును.) ఆఁ! ఆఁ! ఆఁ! నీసిగదరఁగ నాకొడుకుచే నీరాత్రి మూఁడులక్షల యిరువదివేల బంగారునాణెములకుఁ బత్త్రము వ్రాయించుకొంటివా? ఈ మృత్యుదేవతను దార్చినందులకా? మూఁడులక్షలకుఁ బత్త్రమే. (చింపును.) చచ్చినవాఁడు చావనేచచ్చినాఁడు. నిన్నెందులకుఁ జంపవలయుననుకొనుచున్నాను. నాకొడుకును గోతఁబెట్టుటయేకాక నాకొంప కొల్లపెట్టఁదలఁచితివా? ఇఁక నీవు చావకతప్పదు. చావు. చావు. (వీపుపైఁ గొట్టును.)

జాంబ—నీలక్షలు నాకేమి కావలయునా? నా కంతయాసలేదు. భయముచేర కీపత్త్రమును వ్రాయించుకొంటిని. జాముజాముకుఁ గ్రొత్తదానిని దెమ్మని నన్ను బాధించినయెడల నేను జావనా?

డుంగ—చావు చావు. (కొట్టును)

సేవకా! రెండు నూలుత్రాళ్ళిటకుఁ దెమ్ము.

సేవ—చిత్తము. (పోవును.)

వీర—దండనాథా! ఆఁడుదానిని శిక్షించుచున్నావు తప్పు.

డుంగ—సిగ్గుబిడియములు లేక యేమి వదరుచున్నావు? మగవాఁ డాఁడుదానిని శిక్షించుట తప్పా? ఆఁడుది మగవానిని జంపుట ధర్మమని స్థాపించిన మహావీర కాంతవు! ఓహోహో! ఇఁకఁ బ్రపంచము నీమూలమునఁ దల్లక్రిందగుట కేమైన సందేహమా? ఏ మగముండకొడుకైన నాఁడుదానిచేతిలోఁ దక్కఁగలఁడు? నీ నీతి మండిపోను. సమీపముననుంటివికావు. రోమరోమకూపమునఁ బొడిచి చంపియుందును. పరమేశ్వరుఁడా! ఒక్క నిమేషమాత్రము నాకు నెక్కలను గటాక్షింపవా?

సేవ—(ప్రవేశించి) ఎక్కలను విఱిచికట్టుమని సెలవా?

డుంగ—కానీ—

జాంబ—అయ్యయ్యో! (ఏడ్చును.)

డుంగ—అత్రాటి కుచ్చుపోసి మెడకుఁ దగిలించుము.

సేవ—చిత్తము బాబూ. (అట్లుచేయును)

డుంగ—నీవొకకొస తీసికో. నే నొకకొస తీసికొందును.

సేవ—చిత్తము బాబూ.

డుంగ—లాగు. గట్టిగ లాగు. (తాను లాగును.)

సేవ—చిత్తము బాబూ!

వీర—హరిహరీ! దండనాథా! ఆమెబుద్ధితెచ్చుకొని బాగుపడునేమో? చంపుచుంటివా? అయ్యయ్యో! ఈమృత్యువులన్నింటికి నేనే మూలకారణమైతిని గాఁబోలు! ఎంత పాపము సిద్ధించినది! నేను గ్రిందికిఁ బోయి యీ యాపద నామెకుఁ దప్పించెదను. ఇదిగో! వచ్చుచున్నాను (గొందెమును దీయఁబోవును.)

(నేపథ్యమున) కొట్టుఁడు. తలుపుకొట్టుఁడు. అమ్మా! అమ్మా! రాజుగారు వచ్చుచున్నారు (తలుపు కొట్టిన ధ్వనులు విశేషముగా నగును.)

వీర—అయ్యో! క్రిందకిదిగి యామెను రక్షించుట కడ్డువచ్చెనుగదా!

సేవ—బాబూ! రాజుగారు వచ్చుచున్నట్లున్నారు.

డుంగ—ఇది చచ్చినట్లేకదా!

సేవ—ఆ!

డుంగ—ఈఘటము నిక్కడనే యుంచవలయును. నే నిప్పుడు రాజును జూడను. రమ్ము పోదము. ఎప్పటికైనసరే నేను నీమతి జగద్దేవులను జంపకుండ వదల నేను బడాలాలూఁ కొడుకను గాను (నిష్క్రమింతురు.)

(ఇద్దఱు సేవకులతో రాజు ప్రవేశించును)

జయ—ఎంత దారుణకృత్యములు జరుగుచున్నవి! ప్రజలలో భయసత్తులు నంచినవి. ఎవనికి వాఁడే స్వతంత్రుఁడు. ఎవని యిష్టము వానిదిట్టము. అయ్యయ్యో! జాంబవతి యిక్కడఁ బడియున్నదేమి! అయ్యో! గొంతున కురిపెట్టి యెవ్వరో చంపియుండిరి. సేవకా! చూడుము.

1 సేవ—ఊపిరి లేదుబాబూ!

జయ—ఈమె నెవరు చంపియుండిరో?

సేవ—తా మిక్కడకు దయచేయుచుండఁగనే డుంగరసీయు నతని సేవకుఁడును బ్రక్కనుండి పాఱిపోయినారు.

జయ—సేవకా! నీవుపోయి మఱియిద్దఱు సేవకులను దీసికొని వారిని గారాగృహమున నుంపుము

2 సేవ—చిత్తము బాబూ! (నిష్క్రమించును)

(నేపథ్యమున) అమ్మా! రాజుగారు వచ్చినారు. తలుపుతెఱవుము. నీతో మాటలాడుదురు.

వీర—ఎవరు వచ్చినను సరియే. నాభర్త వచ్చినఁ గాని నేను దలుపు దీయను.

జయ—(గట్టిగా) అమ్మా! నేను నీ వృత్తాంతమును రవంత కర్ణాకర్ణిగఁ దెలిసికొంటిని. నీకేమియు భయము లేదు కాని నీవిట్లు నాప్రజలకు హానిచేయుట తగదు. తలుపు తెఱవుము. నీవృత్తాంతమును సాంతముగ విందును.

వీర—నావృత్తాంతమును వినుటకు మీరు పైకి రానక్కఱలేదు. నే నుదయాదిత్య మహారాజు కోడలను. నేనును నాభర్తయు నీగ్రామమునకు గారణాంతరమున వచ్చితిమి. నన్నీ జాంబవతి మోసపుచ్చి యిటకుఁదెచ్చి లాలాదాసునితోఁ గూర్ప నెంచినది. నామర్యాదను నేను గాపాడుకొన నాతనిఁ జంపితిని. గోడనెక్కిన భటులు నన్నుఁజూచి కాళ్లుపట్టు తప్పిపోవుటచేఁ గ్రిందఁబడి చచ్చిరి. జాంబవతిని డుంగరసీయను నాతఁడు చంపినాఁడు. నేను లాలాదాసునిఁదక్క మఱియెవ్వరికిని హానిచేయలేదు.

జయ—అయ్యో! ఆలాగుననా? నీభర్త యెటనున్నాఁడు?

వీర—లాలూదాసునిచే మీకారలో బద్ధుఁడై యున్నాఁడఁట.

జయ—సేవకా! పోయి కారలోనున్న యుదయాదిత్య మహారాజపుత్త్రునిట్లు తీకొనిరమ్ము. అమ్మా! మీరిట వచ్చుసంగతి రవంత నాకుఁ దెలియఁజేయ పోయితిరేల? అయ్యయ్యో! మహారాజకాంతవైన నీకెంతకష్టము సిద్ధించినది ఉదయాదిత్య మహారాజపుత్త్రుఁడేమి? నాకారలో నుండుటయేమి? ఎం వ్యత్యాసము సిద్ధించినది!

వీర—(తనలో) అదిగో నాభర్త వచ్చుచున్నాఁడు

(జగద్దేవుఁడు సేవకునితోఁ బ్రవేశించును)

జయ—మహారాజపుత్రా! జగద్దేవా! నన్ను క్షమింపుము.

జగ—జయసింహరాజేంద్రా! తప్పులేని క్షమాపణమా? దోషములేని ప్రాయశ్చిత్తమా?

జయ—శత్రుసంహార మొనర్చి మీ కాంతయైన నీకాంత యీ మేడలో నున్నది. పై బోమ్ము.

వీర—నాథా! నేనే వచ్చుచున్నాను. (క్రిందికిదిగి) నమస్కారము.

జగ—వీరమతీ—

జయ—అంతయును మనము తరువాత మాటలాడుకొందము ఇది వీధి సమీపమున మన స్థలము. వెంటనే మన కోటకుఁ బోవుదము. సేవకా! బండ్లు సిద్ధముగనున్నవా

సేవ—చిత్తము.

జయ—రండు.

(అందరు నిష్క్రమింతురు.)

ఇది యష్టమాంకము.

---

శ్రీరామ

# వీరమతి

## నవమాంకము

(విష్కంభము)

ప్రదేశము—వీధి

ప్రవేశము — లక్ష్మణరావు, రంగారావు

రం—వలదని యెందులకుఁ జెప్పితివి ?

లక్ష్మ—విషూచివ్యాధి హెచ్చుగా నున్నకాలమునుండి యెవ్వరును బైకి బోఁగూడదు. కావున మిమ్ముఁ గూడఁ బోవలదని చెప్పితిని

రం—ఇక్కడనే నిల్చి చావవలసినదని నీ యభిప్రాయమా ?

లక్ష్మ—ఇక్కడనే నిల్చినయెడలఁ జచ్చుట సందేహము కాని పారిపోయినయెడల మాత్రము చచ్చుట నిశ్చయము.

గీ. కాలు వెనుకఁ ద్రిప్పువానినే ♦ కఱచుఁ గుక్క
అధికభయశీలునకె యుపా ♦ ధ్యాయు తిట్టు
వలదు వలదను వనితకే ♦ వచ్చుఁ జూలు
పరుగిడినవానినె విషూచి ♦ పట్టిచంపు.

రం—అటులైన నిచ్చటనే యుండుమనెదవా ?

లక్ష్మ—ఇచ్చటనే యుండి స్నానసంధ్యాద్యనుష్ఠానములం దప్రమత్తుఁడవై శుచివై మితాశివై నిర్భయముగఁ గాలక్షేపము చేయుట మంచిదని నేననుకొందును.

రం—నిర్భయముగా నెట్లుండఁగలనో తెలియకున్నది. ఊరంత గగ్గోలుగా నున్నదో-
[illegible] మధ్యాహ్నమునఁ గానఁ
బడదు. మధ్యాహ్నమువాఁడు సాయంకాలమున కగపడదు. రాత్రి యెవ్వరికిఁ గూడఁ దెల్లవారుననియే తోఁచకున్నది. రోగులకు సాయపడి చేసినయెడల నమ్మవారికిఁ గోపమువచ్చునేమో యని మందుమాత్ర లెవ్వరును దలపెట్టకుండ నున్నారు. బ్రాహ్మణులలోకంటె నబ్రాహ్మణులలో నీరోగ మెక్కువమందికిఁ దగులుచున్నది! మృత్యుసంఖ్యయు వారిలో హెచ్చుగనే యున్నది. మృతుల నను బండ్లపైఁ దీసికొని పోవుచున్నారు. ఊరిలోఁ బగలైననడచుటకే భయ

ముగా నున్నది. కత్తిగ్రేటు వైచిన నైన నెవని పెంగమునందును నెత్తురుచుక్క లేనట్లున్నది

లక్ష్మి—నీవనినంత భయంకరముగా లేదుకాని, బాగుగాఁ బరిశీలింపఁగ గ్రామమిప్పుడే పవిత్రమై శుభావహమై కనఁబడుచున్నది.

గీ. జ్వరితునకుఁ బూర్వమందున్న ♦ వ్యసనచయము
నందు రోఁతజనించిన ♦ యట్లు గ్రామ
మున విషూచిగల్గఁగ నెల్ల ♦ జనుల కిప్పు
డెల్లవ్యసనసంతతులపై ♦ నేవపుట్టె.

అదిగాక మఱియొక్క విశేషము.

సీ. పడుచుదాసిని డాసి ♦ పైఁట లాగినవాఁడు
శివపూజకై భక్తిఁ ♦ జేయిచాచు
పడఁద్రాగి వీధిలోఁ ♦ జెడఁబ్రేలి పకువాఁడు
హరిహరీయని నోట ♦ నాడఁజొచ్చు
పత్రముల్ సృష్టించి ♦ ప్రజల మాపినవాఁడు
రామకోటిని బూని ♦ వ్రాయసాగు
దారిలోఁ దలఁగొట్టి ♦ ధనముదోఁచిన దొంగ
గతిలేనిపిల్లలఁ గరుణఁ బెంచు
చేతను గోడావరుమదామున్ ♦ జేర్చునాతఁ
డెదుటి కాళికమ్మకు మ్రొక్కు ♦ లిడఁగఁదొడఁగు
నెగ్గువిడనాడు లేకాక ♦ లగ్గుఁగొనుట
కూడ జనులయం దిప్పుడు ♦ చూడఁబడియె.

సీ ఎక్కడఁజూచిన ♦ నితిహాసకథనముల్
వేదాంతచింతాప్ర ♦ వీణతలును
జల్లనితల్లికిఁ ♦ జల్గినై వేద్యముల్
పోతరాజునకు సం ♦ పూజనములు
శివశక్తులల్లాడి ♦ చేయుబోధంబులు
తాండవించెడుభక్త ♦ తతులరుతులు
కోటలమ్మకుఁ జల్ల ♦ మోరలధారలు
గణనాథు లొనరించు ♦ గానములును

ముడుపులను మ్రొక్కులును బలి ♦ పోతు లమిత
కుంభనైవేద్యములు పంబ ♦ ఘుంఘుమమ్రోఁత
వీధిభాగవతంబులు ♦ వెలసి మిగుల
గ్రామము శుభావహంబయి ♦ క్రాలుచుండు.

ఆ. ప్రభునికొరకకున్న ♦ బహుశక్తిసంహర్త్రి
యతనిమందిమాట ♦ యందు లేమ
చచ్చునంతదాఁక ♦ వచ్చునప్పుడె కాని
ప్రజలకెపుడు ♦ బుద్ధి రాదు కాదె.

(నేపథ్యమున) ఓ జనులారా! అందఱాలకింపుఁడు. ఈ పట్టణస్థానమున వ్యాపించిన గత్తరల నడఁచివైచి ప్రజలఁ గాపాడుటకు జగద్దేవుఁడు నాతనిభార్యయుఁ దమ ప్రాణములను గాళికాదేవికి బలిగా సర్పింతురఁట రండు. రండు. పెద్ద వీధివెంట నప్పుడే యూరేగింపారంభమగుచున్నది.

లక్ష్మి—చూతము రమ్ము.

రంగ—ఆశ్చర్యముగానున్నదే

లక్ష్మి—నీ విదివఱ కేమియు వినియుండలేదా యేమి?

రంగ—నేను భయముచే నిల్లు కదలనప్పుడు నాకెట్లు తెలియును?

లక్ష్మి—ఈవ్యాధిని శీఘ్రముగా శాంతింపఁజేయుమని ప్రతిదినమును గాళికమ్మకు జయసింహరాజుగారు స్వయముగాఁ బూజ చేయుచున్నారు. మొన్నఁ గాళి ప్రత్యక్షమై నీయాస్థానముననున్న సర్వసద్గుణసమన్వితులైన దంపతులు నాకొఱకు బలియగుదురేని నేను శాంతించెదనని చెప్పెను. "తల్లీ నాయాస్థానమున నట్టివా రెవరున్నారు?" అని రాజు దేవి నడుగ "లేరని యనుకొనకుము. జగద్దేవుఁడు వీరమతి యున్నార"ని దేవి చెప్పెను. ఆసమయమున జగద్దేవుఁడుకూడ నాలయమున నుండుట తటస్థించుటచే "ధన్యోస్మి ధన్యోస్మి మహానందమ"ని యాతఁ డంగీకరించెను.

రంగ—వీరమతియో?

లక్ష్మి—బండి కొకచక్రము ముందునకు నొకచక్రము వెనుకకుఁ బోవునా?

రంగ—రాజుగారు వారిని వలదని వారింపలేదా?

లక్ష్మి—శక్తివంచనలేకుండ వారించిరి. అదేమోకాని లోకహితార్థము స్వప్రాణత్యాగమన్న వారికి మహాపర్వముగా నున్నది.

రంగ—ప్రకృతులలో నెన్ని భేదములో యున్నవి. నామట్టునకు నేను ప్రాణభయముచేఁ జచ్చుచున్నాను ఈచిత్రమేదో చూతము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది విష్కంభము

ప్రదేశము—పెద్దవీథి.

ప్రవేశము—రాజు జయసింగు జగద్దేవుఁడు కొందఱు జనులు.

(నేపథ్యమున) జయా! జగద్దేవా! లోకహితైకతత్పరా జయా!

జగ—జనులారా! మీరు నన్నుఁ గొనియాడవలదు. మనుజునకు విధియైన పనిని నేను జేయుచున్నాను గాని యంతకంటె వేఱుకాదు. ప్రజాసేవ మనుజునకు విహితమైనది. అందులకు స్తుతులక్కఱ లేదు.

ప్రజకొనర్చుసేవ ♦ పరమాత్మసేవయే
జీవభక్తియగును ♦ దేవభక్తి
సృష్టజగమునకును ♦ సృష్టికర్తకు భేద
మేమి లేదటంచు ♦ నెఱుఁగవలయు.

జయ—జగద్దేవా! నీ మాటలు పరమార్థములై యుండవచ్చును. స్వార్థవాంఛారాహిత్యమునకుఁ గూడఁ గొంత హద్దున్నదికాని లేకపోలేదు. మీప్రాణములను బోఁగొట్టుకొని యితరులప్రాణములను గాపాడఁ బ్రయత్నించుట తగదు. ఇతర ప్రాణరక్షణము కర్తవ్యమైనప్పుడు స్వప్రాణరక్షణముమాత్రమేలకాదు? మీవి మాత్రము ప్రాణములుకావా? కాళికాదేవి శాంతించినప్పుడే శాంతించుఁగాక!

(నేపథ్యమున) రాజుగారు బాగుగా చెప్పినారు. అదే మాయభిప్రాయముకూడను. అదిగాక తీఱ మీప్రాణము లిచ్చెదరనుకొనుఁడు. గత్తరలాఁగునని యేమి నమ్మకము? ఆగకున్న యెడల వృథాజీవహానికాదా?

జగ—నాయనలారా! అట్లనవలదు. కాళికాదేవియాజ్ఞయటుండనిండు. అది ప్రకృతివిరుద్ధముకాదు. ఒకనికి జ్వరము వచ్చినది. అతని యవయవము లన్నియు సమముగా బాధపడుచున్నవి. నేలవేము కషాయము నోరు మ్రింగినది. సహింపలేని యావేదుబాధను నోరపడుటచేత దేహమునకంతకును జ్వరబాధ శాంతించినది. ఒకనికి దోషగుణము తగిలినది. కంటిలో శీతాంశుశరసముంచినారు. కన్ను దుర్భరమైన మంటబాధనుబడి దోషగుణమును హరింపఁజేసినది. ఒక్క దేహములో నేదో స్వల్పావయవము బాధనొంది మిగిలిన యవయవములకు బాధనివారించుచున్నదనుట కనేకోదాహరణములు చెప్పవచ్చును. ఒక్కదేహమునకు సత్యమైనమాత్రము సర్వదేహసమామ్నాయమైన జగతికేల సత్యముకాదు.

గీ. సర్వజగతియగును ♦ జగదీశు దేహంబు
ప్రాణులన్ని యతని ♦ యవయవములు;
ఒకప్రాణి పోయి ♦ యొకకోటిప్రాణాళి
కైన రక్షసేయ ♦ నర్హమగును.

కావున మహాజనులారా! నాస్వార్థపరిత్యాగము వృథయైపోవునని యెంచ

కలదు. రాజేంద్రా! బాలుఁడనుఁగా నుంటిఁగైనప్పటినుండియుఁ నన్ను దండనాథునిగాఁ గొన్ని సంవత్సరములు మంత్రిగాఁ గొన్నిసంవత్సరములు నియమించి పోషించినందులకు మీ కెంతయును కృతజ్ఞుఁడను. నేను మీవ్యవహారమున నేమైన లోపములొనర్చియుంటినేని దయతో మన్నింప వేఁడుచున్నాను.

జయ—నీవిక్కడకు వచ్చి ప్రధానుఁడవైయున్న యెనిమిది సంవత్సరములనుండియుఁ ప్రజలు మహాసుఖము ననుభవించుచున్నారు. ద్వారరక్షకుని జంపి కారణుండి యీ నడుమను బారిపోయిన దొంగ రక్షకాలములోఁ బ్రజలెంత క్షోభపడిరో యిప్పుడంత యానంద మొందుచున్నారు. జనులలో దుర్వ్యసనములు చాలవరకు నశించినవి. చోరులు జూదగాండ్రు నరహంతలు మొదలగు దుష్టులిప్పుడు తఱచుగాఁ గానఁబడరు. సత్యము ధర్మము రాజభక్తి మొదలగు గుణములచేఁ బ్రజలొప్పుచున్నారు. నేను నీమూలమున న్యాయపరిపాలకుఁడనని ధర్మమూర్తినని పేరొందియున్నాను. కాని మాదురదృష్టవశమున నెక్కడనుండియో యీవ్యాధులువచ్చి మహాఘోరముగ వ్యాపించి బహుజనమారణ మొనర్చుచున్నవి. నే నింతలకే పరితపించుచుండగా నీవు బోదుననుట న్యాయమా? నీసద్వ్యవహారమునఁ గూడ నిట్టియాపదలు ప్రజలకుఁ గలుగుట చూడ నేను జేసికొనిన పాపముకాని వేఱుకాదనుట నిశ్చయము.

జగ—మహారాజా! నాయందలి మహానురాగముచే నీమాటలే యిదివఱ కెన్నిమారులో చెప్పియుంటిరి. కాలానుసరణమునఁ బ్రకృతిలోఁ గొన్నిమార్పులు జరుగకతప్పదు.

గీ. భోజనంబున నిద్రను ♦ బొలఁతిపొందు
నందు మితితప్ప గొప్పకీ ♦ డగుట నిజము
ప్రకృతి సహియించి నట్లుగ ♦ పడునుగాని
కడకు దుర్భరోపద్రవ ♦ గతిని గూర్చు.
పాముపగయైనఁ బగరాదు ♦ పశ్విభువతంసు
పగయు బగకాదు శాంతరూ ♦ పమును బూని
యించుకంతయుఁ దప్పు సహింపకుండఁ
బ్రకృతి తీఱుచుకొనుపగ పగయెసుమ్మ.
పులుసుతోడ క్షయవ్యాధి ♦ పుట్టునట్లు
బెల్లమున రాచపుండు దుద్భ ♦ వించునట్లు
సంఘమున గ్రామ్యసౌఖ్య వి ♦ స్తారకలనఁ
బుట్టు ధర్మనాశము దానఁ ♦ బుట్టు లయము.
వహ్ని శైలవిక్షోభంబు ♦ జ్వరభవార్తి
తత్త్వమున నొకటేయంచుఁ ♦ దలఁపవలయు

మారికావ్యాధి యెట్టిదో ♦ వారినిధులు
పొంగి పొరలుట యట్టిదే ♦ భూవరేంద్ర.
ప్రకృతి యొనరించు బహుచిత్ర ♦ వికృతులందు
దక్కు వెక్కువ యనెడు భే ♦ దంబు లేదు
దోమచచ్చుట యెట్టిదో ♦ "రోము" కూలు
టట్టిదేకాని వేఱుకా ♦ దవనినాథ!
సంఘసంక్షోభ మాఁపగాఁ ♦ జాలువాఁడు
స్వార్థవర్జన మొనరించు ♦ నాతఁ డొకఁడె.
అట్టిపుణ్యంబు నిపుడు నేఁ ♦ గట్టుకొనుట
కనుమతి నొసంగుమయ్య! మహానుభావ!

జయ—మహాత్మా! మీయిష్ట మెట్లో యట్లే యాచరింపుడు.

జగ—తథాస్తు మహాసంతోషము. ఓమహాజనులారా! మీరుకూడ నాపరలోక ప్రయాణమునకు సమ్మతి నొసఁగవలయును.

ఒకమనుజుఁడు—మహాత్మా! ఈసంఘపక్షమున నేను గొన్ని మాటలాడుదును. నీవు మనుజుఁడవుకావు. లోకశాంతికొఱ కవతరించిన దేవుఁడవో దేవదూతవో.

గీ. రెండుచేతుల నార్జించు ♦ చుండు గృహావి
భుండు దుర్భరయ్యాను బండి ♦ యుండునపుడు
తమ్ములను మోసపుచ్చి ప ♦ త్త్రములు కొన్ని
యగ్రజుఁడు దాఁచి యెఱుఁగని ♦ యట్టులుండు.
గడుపునను గన్నకొడుకులఁ ♦ గన్ను మొఱగి
సుతులు పెద్దవారైరి నన్ ♦ జూడఁబోరు
నాదు పేరిట నిల్లొ మా ♦ న్యంబొ వ్రాసి
యిమ్మనుచు భార్య తొందర ♦ నిచ్చుచుండు
నాయనా! నన్ను వీడుచు ♦ న్నావె యపుడె!
అయ్యొ! నాకేమిచెప్పినా ♦ వనుచు దల్లి
శ్వశ్రు వూరుఁగాయలు వేఱ ♦ సర్దుచుండుఁ
దార పనికిరాదని బావ ♦ తత్తఱిల్లు.
ధనవిహీనులలోకంబె ♦ ధనులయందె
యిట్టి దేవులాటలు మఱి ♦ యింత హెచ్చు

బంధువులప్రేమ లిట్టి శో ♦ భనువహింపఁ
బరుల కుపకృతిపై సృష్టి ♦ వార్తయేమొ ?
తియ్యనగుమాటలనె ప్రేమ ♦ తెలుపునతఁడ
ధముఁడు ధనమిచ్చి తెలుపు మ ♦ ధ్యముఁడు కాయ
కష్టము నొసంగి తెలుపు న ♦ తఁడుత్కృష్టుఁడిట్టె
ప్రాణముల నిచ్చువాఁ డెట్టి ♦ వాఁడొ యహాహా !

జగ — వాఁడుకూడ మనుజుఁడే. నాయనలారా! మీకు మనుజప్రకృతిని గూర్చి యిట్టి నీచమైన యభిప్రాయ మున్నందులకు విచారించుచుంటిని. కొంత సత్యమే పలికితిరి కాని యెక్కువగా నతిశయోక్తి పలికితిరి మనుజప్రకృతి నిజముగాఁ బరకష్టసహానశక్తిరహితమైనదే—పరోపకారవాంఛాసమన్వితమైనదే—చాల మట్టునకు స్వార్థపరత్వశూన్యమైనదే—అందు కొక్కటి రెండు నిదర్శనము లిచ్చెదను. అనవసరముగ మీరు నన్ను రేఁపుచున్నారు కావునఁ బలుకవలసి వచ్చినది.

గీ. కల్లకొడుకు కాగిదపట్ల ♦ కాటిలోనఁ
బురుషచంద్రమతి కొడుని ♦ శిరముఁ బెట్టి
హాలికిచావు చాసఁగ మీరు ♦ పులుకుపులుకు
కన్నులను సరు పొలిఁబోరిఁ ♦ గార్పనేల ?
బాటలో దూడ కాల్జాఱి ♦ పడినయప్పు
డప్రయత్నముగా నయ్యో ♦ యనరె మీరు ?
గాయకునికంఠమున జీర ♦ గలుగ నప్ర
యత్నముగ సకిలింపరే ♦ యయ్య మీరు ?

మొదట మనప్రకృతి మిగుల నున్నితమైనదే. అత్యంతరసవంతమైనదే - కాని కృత్రిమములగు ననేకసంఘమర్యాదలవలనను దుష్టవిద్యాపద్ధతులవలనను జాతి వైరములవలనను మఱి యనేకములగు నితరకారణములవలనను నది కర్కశమై కొంత రసహీనమైపోయినది. నాయనలారా! ప్రకృతిపరీక్ష కిది సమయము కాదు ఇదివఱకే యాలస్యమైనది త్వరగఁ బోవుదము రండు.

(నేపథ్యమున) జయా! జగద్దేవమహాత్మా! జయా! జగద్దేవ! అవతారపురుషా! జయ
(పుష్పములు పైని చల్లుచున్నారు)

జగ — నాయనలారా! నాపైఁ బుష్పములు కురిపించుచున్నారా? తప్పు నాయనలారా! తప్పు. దేవపూజకై యవి నిర్మింపఁబడినవి నేను భగవంతుని ప్రార్థించుచుఁ బాడుదును. మీరు కూడ దయయుంచి నాతోఁ బాడుఁడు. మీపుష్పములతో భగవంతు నారాధన మొనర్తము.

అందఱు—(పుష్పములు పైకిఁ జల్లుచుఁ బాడుదురు)

బిలహరి—ఏక.

జయ రామ జయ రామ జయ జానకీరామ
జయ సర్వగుణధామ-జయ సార్వభౌమా
జయ శుభాకరనామ-జయ వైరిభీమా ॥జయ॥
మాపాపములఁ బాపి - మమ్ము రక్షింతువని
నీపాలఁ బడినాము - నీరేజనయన -
శ్రీపాదములను - జెచ్చి మొక్కెదమయ్య
కాపాడరావయ్య - కరుణాలవాలా ॥జయ॥
పిలుపుతో 'ఓ' యంచు - నేంచేయువాఁడవని
పలికినా రెల్లెడల - భక్తులందఱును
మొలకనవ్వుల ముద్దు - లొలుకుచూపుల తోడఁ
గలకలంచును వేగ - కన్నులఁ బడవయ్యా ॥జయ॥
ధర్మకాంతల పైని - వాంఛలను బోకార్చి
నిర్మలత్వము మదిని - నిల్పవో తండ్రి!
ధర్మమందున బుద్ధి - తప్పఁజేయకుమయ్యా
కర్మసాక్షీ రామ - ఘనఘనశ్యామా ॥జయ॥

జయ రమారమణగోవిందో హరి—

(నేపథ్యమున) నడువుఁడు. ముందుకు నడువుఁడు. కాళికమ్మగుడి యొద్దకు

(అందఱును ముందునకు నడచుచున్నారు.)

(నేపథ్యమున మఱియొక ప్రక్కనుండి) అయ్యా! మనుష్యులు కారఁటయ్యా; దారిలో నడ్డముగా నుందురేల? వెనుకవారు ముందునకు రానక్కఱలేదా యేమి! పొండు. ముందునకుఁ బొండు. వీరమతమ్మగారు రాణిగారు వచ్చుచున్నారు.

(జయసింగు జగ్గీ[illegible], మఱియొక ప్రక్కనుండి వీరమతి కమలాదేవి ప్రవేశింతురు)

(నేపథ్యమున) జయా! వీరమతిదేవికి జయా! జయా! మహాత్మురాలికి జయా జయా! కాంతాశిరోమణికి జయా!

కమ—అమ్మా! వీరమతీ! ఇచటి కాంతాజనసంఘపక్షమున మఱియొకసారి ప్రార్థించుచున్నాను. ఈప్రయత్న మింక వలదు.

వీర—మహారాజ్ఞీమణీ! నన్ను క్షమింపుము

(నేపథ్యమున) అమ్మా! మహారాణిగారు అరుంధతమ్మవంటివారు. ఆమెప్రార్థనను త్రోసిపుచ్చవలదు. రాణివాసమును విడిచి మీయందలి భక్తిచే మీతోఁ దిరుగాడుచున్నారు.

వీర—మీకందఱకొక్కనమస్కారము. నన్ను క్షమింపుడు.

కమ—సోదరీమణులారా! భయంకరములగు నీవ్యాధులమూలమున నిదివఱకు మన కెన్నియో కష్టదినములు జరిగినవి కాని యీనాఁటివంటి కష్టదినము మన కిదివఱకు జరిగియుండలేదు. లోకోపకారిణియగు వీరమతిదేవి లోకశాంతికొఱకు భర్తతోఁగూడ లోకాంతర మేఁగుచున్నది ఆఁడువారిలో నింత స్వార్థపరిత్యాగినిని మీ రెచ్చటనైనఁ గాంచితిరా? వినియైన వినియుంటిరా? ఈమె వచ్చినప్పటినుండియు స్త్రీవిద్యలో మనయాస్థాన మెంతయభివృద్ధిఁ గాంచినదో మీరంద ఱెఱుఁగరా? స్త్రీలకొఱ కెన్ని పాఠశాలలు పెట్టించినది! స్త్రీలలో నెంత విద్యావ్యాప్తి కలుగఁజేసినది! బాలికలకుఁ గఱ్ఱసాము కత్తిసాముకూడ నేర్పించి సరసిజాక్షులను స్వప్రాణమానసంరక్షణమున సమర్థలను జేయుచున్నదే! శత్రుబాధనుండి దేశమును సంరక్షించుకొనుటకుఁ బురుషులవలెనే స్త్రీలుకూడ సమర్థలని యనిపించుచున్నదే! ఈమె పుణ్యమున నెందఱు కాంతలు మహోపన్యాసము లిచ్చుచున్నారు! ఎందరు మహాపవిత్రులై విఖ్యాతిఁ గాంచుచున్నారు! ఎందఱు గాయనీమణులై క్రాలుచున్నారు! ఎందఱు లలితకళాప్రపంచమున నూతనసృష్టు లొనర్చుచున్నారు! ఆహాహా! ఎనిమిది సంవత్సరములైన గాలేదుకదా! స్త్రీలలో నూతనశక్తి నుదయింపఁ జేసినదే. స్త్రీల ఫాలములందు నూతన ప్రబోధచంద్రోదయ మగునట్లు చేసినదే. స్త్రీల భావనాంబరమందు నూతనశక్తిధనుస్సహస్రమును వేయించినదే. స్త్రీల భవిష్యచ్చరిత్రమునకు రజతపత్రములు బంగారు వర్ణములు సిద్ధపఱచి యుంచినదే. ఆహాహా! ఎంత విద్యాసంపన్నురాలు! ఏంత మేధాశాలిని! ఎంత మహాగుణసంపన్నురాలు! ఎట్టి వీరకాంతాశిరోమణి! ఈ వెనుకటి యుపకారమంతయు నటుంచుడు. ఇప్పు డీప్రబలవ్యాధిని మన యాస్థానమునుండి పాఱఁద్రోలి మనల రక్షించుటకు సంకల్పించుకొని యున్నది. ఎట్లు? తనప్రాణము లిచ్చి—భర్తతోఁ గూడఁ దనప్రాణము లిచ్చి—ఆహాహా! అవతారస్వరూపిణి. మన కంటితో మనము చూచుచున్నాము కాన సరిపోయినదికాని యెవఁడైనఁ జెప్పినయెడలఁ గవికల్పితమని కల్లయని త్రోచివైతుమే. ఆహాహా! అందఱు మనుష్యులే—మనము బ్రదుకుచున్నాము—ఎందులకీ బ్రదుకు? తినుచున్నాము, పిల్లలఁ గనుచున్నాము. ఆమాత్రపు పనికి మనుజులమయియే పుట్టవలయునా? కాకు లందుకుఁ జాలియుండవా? ఎవని బ్రదుకువలన దేశక్షోభము నశించునో దేశశాంతి యుదయించునో యతని బ్రదుకే బ్రదుకగునుగాని మిగిలినవి బ్రదు

కులా? దేశశోభమైన నరేకాని మఱియేమైన నరేకాని యిట్టికాంత దేహమును బాయుట తగదు. ఈప్రయత్నమునుండి మఱలుమని యిదివఱ కెన్నిసారులో ప్రార్థించితిమి. మన ప్రార్థన మంగీకరింపనప్పుడు మన మేమి చేయవలసినది? ఆమెకు నమస్కరించుట తక్క మనము చేయదగినదేమున్నది? కావున సోదరీమణులారా! మఱియొకసారి యామెకు నమస్కారము లాచరింపుడు

(నేపథ్యమున) స్వార్థసంత్యాగినీ శిఖామణీ! సాష్టాంగనమస్కారము. సహస్ర సాష్టాంగ నమస్కారములు.

వీర—కమలాదేవి! సోదరీమణులారా! మీకందఱ కనేక నమస్కారములు. మీదయకు మహానంద మొందితిని. మీరు నన్ను స్తుతించినారు. మిమ్ము నిందించుకొని నారు. పరస్తుతియు నాత్మనిందయు మీ రొనర్చినారు. పరనిందయు నాత్మస్తుతికంటె నిది మంచిదేకాని యిదికూడఁ గొంత తప్పే. యథార్థముగ మీ స్తుతికి నే నర్హురాలను గాను. మీనిందకు మీ రర్హులు గారు. నేనేమో మహాస్వార్థపరిత్యాగమును జేయుచున్నా ననియు నావంటి వ్యక్తి ప్రపంచమున లేదనియు మీరు భ్రాంతి పడుచున్నారు. నావిశేషమేమియు లేదు. ప్రపంచమున స్వార్థపరిత్యాగి మెచ్చటఁ జూచినఁ గనఁబడుచున్నది.

గీ. మట్టి నిరుగ్రోలి ♦ మకరందమీయంగఁ
బ్రాఁకులాడుఁగాదె ♦ వల్లులెల్లఁ
గట్టిదెబ్బచేత ♦ గాయమొందియుఁ జెట్లు
పండ్లొసంగ నూఁగి ♦ వంగుఁగాదె.
వట్టిగడ్డిఁ దినుచుఁ ♦ బాలీవె యావులు?
ఖరము సుఖము నిడదె? ♦ బరువుమోస
ఒంటెలోనఁ బడుచుఁ ♦ బట్టొసంగదె పుర్వు?
చలిని బడుచు గొఱ్ఱె ♦ పాలు విడదె?
పెంట భాగ్యమనుచుఁ ♦ బ్రీతినొందుచు క్షమ
యెల్లధాన్యతతుల ♦ నిచ్చుఁగాదె.
క్షారనీరమునను ♦ సంతృప్తిఁ గని మేఘ
మమృతమిచ్చి తానె ♦ యంతరించుఁ
బట్టులేక భూమి ♦ చుట్టు ద్రిమ్మరి చందు
శైత్యముదము లిచ్చి ♦ క్షయముఁ జెందుఁ
దాను మంటఁ బడుచుఁ ♦ దపియించుచును రవి
నరుని కిచ్చు రోగ ♦ నాశనంబు,

జ్ఞానలేశరహిత ♦ మైన ప్రకృతి యిట్లు
స్వార్థవితరణమున ♦ నలరు చుండ
జ్ఞానసహితమైన ♦ దాని యాధిక్యంబు
సకియలార! చెప్ప ♦ సాధ్యమగునె?
అతిథిపూజనమున ♦ సర్భకావనమంగు
భర్తృపాదపద్మ ♦ భజనమందు
వంశపారిశుద్ధ్య ♦ పరిపాలనమునందు
సుదతి స్వార్థభాగ ♦ శూన్యకాదె?

సీ. కడఁద్రొక్కి నడురాత్రి ♦ గడపఁ జేరినకాంతు
కాళులు భక్తితోఁ ♦ గడుగుటందుఁ
జెడఁద్రాఁగి కడు రేగి ♦ పడఁదన్ను కాంతుని
కోపశాంతికి ముద్దు ♦ గొనుటయందుఁ
గాలకుష్ఠంబునఁ ♦ గంపరోఁత యైననా
ధుని యన్న శేషంబు ♦ దినుటయందుఁ
ముదుసలిభర్తకై ♦ ముష్టి యెత్తుచుఁ గూడు
గుడుపుచుఁ దాఁ బస్తు ♦ పడుటయందు
నహహా మనదేశకాంతల ♦ యందుఁ జౌక
యైనస్వార్థవర్జన మెట ♦ నైనఁ గలదె?
ఇచటి మట్టిలో మణిరాసు ♦ లెన్ని గలవొ
యెవఁ డెఱుంగును భగవంతుఁ ♦ డే యెఱుంగు.

ఇట్టి మీరు స్వార్థపరిత్యాగిని నని నన్నుఁ గొనియాడుట న్యాయమా? మీఁదు మిక్కిలి మిమ్ము దూషించుకొందురా?

(నేపథ్యమున) భర్తృసేవాదులు మాకు సుఖమిచ్చుచున్నవి కావున మే మట్లు చేయు చున్నాము. మాకు స్వార్థపరిత్యాగ మెక్కడిది? మీరు మా సౌఖ్యమునకై ప్రాణమును బోఁగొట్టుకొనుచున్నారు కదా!

వీర—(నవ్వుచు) సోదరీమణులారా! మీరు సౌఖ్యపడుటయే నా మహాసుఖము. అందుచే నేనిట్లు చేయుచున్నాను మీకు స్వార్థత్యాగము లేనప్పుడు నాకుమాత్ర మెక్కడిది? నేనును నా సుఖము కొఱకే దేవులాడుచున్నాను. అందుచే మీరు నన్నుఁ గొనియాడవలదు. మిమ్ము మీరు దూషించుకొనఁదగదు. నిజముగా—

గీ. పరసుఖంబులోన ♦ నరుసుఖ మున్నది
పరునిబాధలోన ♦ నరునిబాధ
కాన నరుఁడు తన సు ♦ ఖమె కోరినయెనను
బరులసుఖమె సేయ ♦ వలయు నెపుడు.
భర్తపెట్టుబాధ ♦ పడలేక యిల్లాలు
పడినిబడుట సుఖము ♦ నకునె సుమ్ము
జనుఁడు భవము వాసి ♦ సన్న్యాసి యగుటయు
మోక్షలక్ష్మిసౌఖ్య ♦ మునకె సుమ్ము.
ప్రకృతి సంతతసౌఖ్యమే ♦ పడయనెంచుఁ
గానఁ బరిపూర్ణమగు త్యాగ ♦ మైనఁగాని
పరమబహిరంగమగు స్వార్థ ♦ పరత సుమ్ము
అటది యిటదని మాత్రమే ♦ యంతరంబు.

(నేపథ్యమున) అమ్మా! మేము మీకుఁ బ్రత్యుత్తరము చెప్ప సమర్థులమా? మీయిష్టమెటులో యటులే.

వీర—రాజ్ఞీవతంసమా! నాభర్త వెడలి కొంతసేపైనది కాబోలు. ఇఁక ముందునకుఁ బోవుదమా?

(నేపథ్యమున) ఇంకను వలదు. ఇద్దఱు బాలికలు వీరమతిదేవికి మంగళపుటారతులిచ్చుటకు వచ్చుచున్నారు. (ఇద్దఱు బాలికలు ప్రవేశింతురు.)

వీర—బాలికలారా! నా కీయెడ మంగళపుటారతి యెందులకు? వలదు.

1 బాలిక— మీయొద్ద విద్య నేర్చుకొనుచున్నవారము.

2 బాలిక—మీరు మాకు గుర్విణులు కావున మీ కారతి నిచ్చెదము.

కమ—బాలికలారా! పాడుఁడు.

ఇద్దరు— సౌరాష్ట్రి - ఏక

మంగళం మావీరమతిసతికి ॥మంగ॥
ధీరురాలికి - దివ్య - ధీమతికి -
ధారాకవితచెప్పు - తన్వంగికి
పారరహిత విద్యా - పారంగతకు నీకు ॥మంగ॥
పరుల - కష్టములఁ - బాపుటకు
ధరను శాంతినిగూర్చి - తనుపుటకు
పరమేశుఁ డంపిన - భవ్యావతారమునకు ॥మంగ॥

వీర—ఇఁకఁ జాలు. ఇఁక మీరు పాడుటకు నే నంగీకరింపను. మీచేతిలోఁ బళ్లెర మిటు తెండు. మంగళపుటారతి నర్పించుటకు నేనా మీకుఁ గనఁబడితిని? తప్పు కాదా! లోకమాతయైన మంగయాంబాదేవికి మంగళపుటారతి నిత్తము నేను బాడెదను. సోదరీమణులారా! మీరందఱు పాడవలయును.

(అందఱు పాడుదురు.)

మంగళమ్ - మా శ్రీమంగయాంబకు ||మంగ||
చేరెడేసికనుల - చెలువంబున
బారెడైన కేశ - పాశంబున
మీఱినసత్కళా - చారుమూర్తికి నీకు ||మంగ||
తల్లికర్థులకల్ప - వల్లికిని
ఎల్లజనులపాలి - యేలికకు
చల్లనిమదిగల్గు - సత్యమూర్తికినీకు ||మంగ||

బాలికలారా! మీరు నాయొద్ద నింకఁ జదువుకొనుచున్నారు మీరింకఁ బెద్దవారై కుటుంబభారమును వహింపవలసినవారు కావున నాల్గుమాటలు మాత్రమే చెప్పెదను చెప్పుమందురా?

ఇద్దఱు—మహాప్రసాదము.

వీర— సీ. విద్యావతులమంచు ♦ విఱ్ఱవీఁగుచు లేని
పోనివాదములకుఁ ♦ బోవవలదు
కవితావతులమంచు ♦ గర్వించి పనిలేక
మగవారితప్పులఁ ♦ దెగడవలదు
ఖడ్గసాధనమున ♦ ఘనతఁగాంచితిమని
వేటకై యెన్నఁడు ♦ వెడలవలదు
సతియును బతియును ♦ సములె యయ్యును మనో
వల్లభు నెదిరించి ♦ పలుకవలదు
ఘనవివేకార్జనమున కే ♦ మనకు విద్య
మనదుకవిత దేవుని గాన ♦ మునకె సుమ్ము
మనదుకత్తి స్వరక్షణ ♦ మునకె తగును
భర్తతో సమత్వము ధర్మ ♦ పరతకొఱకె.

సీ. శత్రుశిక్షణ శౌర్య ♦ సంపత్తిచే నైజ
సాధ్వసంబింతైన ♦ జాఱఁదగదు
ప్రబలసభామధ్య ♦ వక్తృత్వధాటిచే
సహజలజ్జాలక్ష్మి ♦ సడలఁదగదు
దేశభక్త్యాదిప్ర ♦ దీప్తగుణాలిచే
స్వకుటుంబకగుణాభ ♦ జంకఁదగదు
మహితజాతీయాభి ♦ మానంబుచే సర్వ
జాతిసమత్వంబు ♦ సమయఁదగదు
కరియుఁ గేసరియొకగుహఁ ♦ దిరుగవలయుఁ
దగరు శార్దూలమొకనీరు ♦ ద్రావవలయుఁ
జిత్రపూర్వఋష్యాశ్రమ ♦ సీమలట్లు
వింతగా మీమనంబులు ♦ వెలయవలయు.

బాలికలారా! బుద్ధిమతులగు మీ కింతవఱకె చాలును. సోదరీమణులారా! ముందు నకు నడువుఁడు. నాభర్తయు జయసింగు రాజుగారును నీసరికిఁ గాళికాలయమున కేగియుందురు. ఇఁక నాలస్యము చేయఁదగదు.

(అందఱు నిష్క్రమింపఁగఁ దెరయెత్తఁబడిన వెంటనే కాళికాదేవియాలయము నెదుట జగద్దేవుఁడు జయసింగు పూజారి ప్రవేశింతురు.)

పూజ—రాజేంద్రా! అట్లుకాదని మనవిచేసికొనుచున్నాను.

జయ—ఏల?

పూజ—బలికి దెచ్చిన జీవములను నేను నఱకుట యేయాచారమయ్యా!

జగ—రాజేంద్రా! అశ్లేయగుఁగాక—నాకొఱకు నాచారమును మీఱుట యెందులకు?

జయ—నిన్నాతఁడే వధింపవచ్చునుగాని వీరమతిదేవినో! ఆమెకొఱకుఁ జెప్పితిని.

(వీరమతిదేవియుఁ గమలయుఁ బ్రవేశింతురు.)

వీర—ప్రాణనాథా! నమస్కారము.

కమ—ప్రాణనాథా! నమస్కారము.

జగ—వీరమతీ! వచ్చితివా? మహాసంతోషము. నీతల యెవరు నఱకుట నీయిష్టము.

వీర—నాథా! మీరే.

జయ—జగద్దేవా! ఎంతచక్కఁగ నడిగితివయ్యా! నీ కేయాభరణ మిష్టమని యడిగినట్లెంత ముద్దుగ నడిగితివయ్యా!

కమ—దేశశాంతికై ప్రాణహరణముకంటె నాభరణ మేమున్నది!

జయ—(అప) కమలా! పరదేశమునుండి వచ్చిన యీపవిత్ర దంపతులు మనదేశ శాంతికై ప్రాణము లర్పింపనుండ మన మూరక మట్టిబొమ్మలవలెఁ జూచు చుండుట న్యాయమా?

కమ—(అప) నాథా! నామనస్సులోని యూహము మీనోటఁ బ్రతిధ్వనించినదే. అంతకంటెఁ గావలసినదేమి? కానిమ్ము. కాళికమ్మకు నాప్రాణము లర్పింప సిద్ధముగా నున్నాను వీరమతి శిష్యురాలనగు నేను వెనుదీయుదునా!

జయ—(అప) సెబాస్—కమలాదేవి! నీవు మహోత్తమురాలవు—నీవెంట సద్గతికై నన్నుఁగూడఁ దీసికొనిపొమ్ము.

కమ—(అప) అటులైన వీరమతి జగద్దేవులకంటె మనమే ముందుగ బలియగుదము. మీరు కత్తి తీసికొని నన్ను నఱుకుఁడు

జయ—(అప) తథాస్తు (కత్తి తీసికొని) కమలా! దేవిని ప్రార్థింపుము

కమ—దండకము శ్రీకాళికాదేవి! దుర్గా! భవానీ! శివాదేవి! ఈదేశ మందున్న ఘోరాపదల్బాపి కాపాడుమోతల్లి కారుణ్యవార్ధీ! మహాదేవదేవీ! జగత్త్రాణ దక్షా! సురారీంద్రశిక్షా! నమస్తే నమస్తే నమస్తే నమః.

జయ—జగద్దేవా! మీరు కాళికమ్మకు బలియగుటకు నేనంగీకరింపను. నాయాస్థానమున నేను ప్రభుఁడను. మీరు నాయాజ్ఞకు విధేయులైయుండవలయును.

జగ—ఏమి మహారాజా! అట్లు సెలవిచ్చుచున్నారు?

కాళి—వీరమతిజగద్దేవులు నాకిప్పుడు బలికాక తప్పరు కానియెడల దెల్లవాఱుసరికి యాస్థానమును రూపుమాపెదను

జయ—తల్లీ! మాప్రాణము లర్పింతుము.

కమ—నాథా! కాళికావిగ్రహము వెనుక నెవ్వరో యున్నారు.

జయ—ఎవఁడు! ఎవఁడు! ఏఁడీ

(ఇద్దఱు విగ్రహమునకు వెనుకకుఁబోయి యొకభటుని బట్టి తెత్తురు.)

జయ—ఎవఁడవు నీవు?

భటు—మహాప్రభూ! రక్షింపవలయును. (రాజుకాళ్ళపైఁబడును.)

జయ—నీవెవఁడవో చెప్పుము. ఇప్పుడు కాళికాదేవి వెనుకనుండి మాటాడినవాఁడవు నీవేనా?

భటు—ఇప్పుడు మాటలాడినవాఁడను నేనే జగద్దేవుని వీరమతిని బలినిమ్మని వెనుక మాటలాడినవాఁడను నేనే

జయ—నీవింతద్రోహ మేల చేసితివి? నిన్ను క్షమింతును. యథార్థము చెప్పుము.

భటు—మహాప్రభూ! నేను డుంగరసీ భటుఁడను అతఁ డేఁడుసంవత్సరములు కారలోనుండి యీసంవత్సరమే పాఱిపోయినసంగతి మీ కెఱిఁగియేయున్నారు. అతఁడు సమీపారణ్యమున నున్నాఁడు. అతని పుత్త్రుని వీరమతి చంపినది జగద్దేవవీరమతులయంతము చూచుట కాతఁడు శపథమొనర్చియున్నాఁడు. ఈ

తంత్రమునఁగాని వారొక్కమాఱుగాఁ జావరని యెంచి నన్నిట్లు చేయుమని నియమించినాఁడు.

జయ—ఓరి తుచ్ఛుఁడా! ఎంతపనిచేసితివరా! పో! (భటుఁడు పోవును.)

(కౌఁగిలించుకొని) జగద్దేవా! నిన్ను గరిసముగా ననినందులకు క్షమింపుము. మేమిద్దఱము బలిశానెంచుటచే నీనట్లనవలసివచ్చినది.

జగ—ఎట్లయినను నేను విధేయుఁడనే.

జయ—కాని యెంతమోసము జరిగినదో చూచితివా!

జగ—గీ. ప్రజల మతవిషయంపువి ♦ శ్వాసములను
గుమతు లాధారముగఁజేసి ♦ కొనుచుఁ దఱచు
భక్తులను మోసపుచ్చుట ♦ పాదుప్రకృతి
వెనుకఁబాడినపాటయే ♦ వింతయేమి?
ఎటను గల్లయు మాయయు ♦ నింతయైన
మైలపఱుపంగఁ దగవట్టి ♦ మతమునందె
కల్లలకు మాయలకు లెక్క ♦ కలుగఁబోదు
కఠినలుబ్ధుల దుర్మార్గ ♦ కర్మములను.

(నేపథ్యమున) ఇట్లు జరుగుటరయే మంచిదని మేము సంతోషించుచున్నాము. జగద్దేవ వీరమతులు నిరుపద్రవముగ నున్నారు. మా కంతకంటె సంతోషములేదు ఈగత్తర లెల్లకాలము బాధించునా?

కమ—వీరమతీ! లోకాభరణముగ నీవుంటివి మాకంతియే చాలు.

వీర—మీదయకు సంతసించుచున్నాను.

జయ—ఇఁక మనము కోటకుఁ బోవుదము

(నేపథ్యమున) జగద్దేవా! మీ యమ్మగారియొద్దనుండి వచ్చితిని.

జగ—రాజేంద్రా! ఆతని నిట్లు పిలువవచ్చునా!

జయ—అభ్యంతరమేమి రానిమ్ము (ధీమంతుఁడు ప్రవేశించును)

జగ—ధీమంతా! మాయమ్మగారు సుఖముగానున్నారా?

ధీ—ఉన్నారు మీరాజ్యము పరాక్రాంతమైనది. మీ తండ్రిగారు కారాగృహమందున్నారు మీసవతితల్లిగారు మరణించిరి మీప్రధానుఁడు వధింపఁబడినాఁడు. శత్రువిజయమొనర్చి నీరాజ్యమును నీవు స్వాధీనపఱచుకొనుమని మీయమ్మగారు మీకు వార్తనంపినారు.

జయ—జగద్దేవా! నాసైన్యసమూహముతో నీతోడవచ్చి నేను నీకు నీరాజ్యమునఁ బట్టాభిషేక మొనర్చెదను రమ్ము. త్వరగఁ బ్రయాణభేరి వేయింపవలయును.

జగ—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు)

ఇది నవమాంకము.

# వీరమతి

## దశమాంకము

ప్రదేశము—ధారాపురమున వీధి.

ప్రవేశము—ఇద్దఱు భటులు.

మొ॥వా.—జగద్దేవుని రాజ్యమిదియేకాదా?

రెం—ఔను.

మొ—దీని పేరు.

రెం—ధారాపురము మహారాజాస్థానము.

మొ—యుద్ధమనఁగా నీలాగుననుండవలయునురా. యుద్ధమునకువచ్చినట్టు లుండవలయును యుద్ధము జరుగకుండ నుండవలయును. ఇట్టి యుద్ధములలో నెంత కాలము పనిచేసినను బాధలేదు.

రెం—మన మింకఁ బది క్రోసుల దూరమున నుండఁగనే శత్రురాజు తన స్వల్పసేనతోఁ బాఱిపోయినాఁడటకాదా?

మొ—ఏలాగైననేమి? గెల్పు మనదన్నమాట.

రెం—జగద్దేవుఁడనఁగ ప్రజ కెంతప్రేమరా!

మొ—పైదేశమువారికి మనకేయుండునప్పుడు వారికుండదఁటరా?

రెం—అదిగాక జగద్దేవుఁడు నిజముగా మంచివాఁడుకూడను.

మొ—ఇదిగో మంచితనమేదో బహుమతులవేళఁ గనఁబడును.

రెం—పట్టాభిషేక మప్పుడే యారంభమైనదా?

మొ—ఈపాటికిఁ బూర్తియై యుండును.

రెం—మనకు బహుమానముల కిదియే వేళ కాఁబోలు. పోవుదమురమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

ప్రదేశము—రాజభవనము.

ప్రవేశము—జగద్దేవుఁడు, వీరమతి, జయసింహుఁడు, ఉదయాదిత్యమహారాజు, భవాని.

జయ—మహారాజా! నీపుత్త్రునకుఁ బట్టాభిషేక మైనది. ఇఁక మాకు సెలవొసఁగుఁడు పోవుదము.